# సాంఖ్యదర్శనము

## ( ఆంధ్రీకృత సాంఖ్యతత్త్వకౌముది )

## సటిప్పణము


గ్రంథకర్తలు

కొల్లూరు సోమశేఖరశాస్త్రి

శైలేశ్వరసేన్


క్షేత్రక్షేత్రజ్ఞయో రేవ మన్తరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షంచ యే విదు ర్యాన్తి తే పరమ్॥

గీతా॥ 13-35


కవిరాజ పబ్లిషర్సు

తెనాలి :: మద్రాసు





1950

[రు. 2-8-0

# విజ్ఞప్తి

పురాతన భారతీయ దార్శనిక గ్రంథములకు సవిమర్శ మగు ఆంధ్రానువాదములు రచింప మే మిరువురమును సంకల్పించితిమి. మహర్షి ప్రణీతములై సంస్కృతభాషలో పండితమాత్రవేద్యములైయున్న ఆ దర్శన సిద్ధాంతములు ఆంధ్రమున సుబోధములగునట్లు రచించి వానిని వ్యాప్తికి దెచ్చుట మా యభిలాషము. క్లిష్టములగు శాస్త్రీయ విషయములను దేశభాషలలో సుబోధము కావించుటలోని క్లేశము విజ్ఞులెఱుంగనిది కాదు. అయినను శక్యమయినంత దూరము బోధసౌలభ్యమునకై యత్నించితిమి. అందు ఎంతవఱకు కృతార్థులము కాగలిగితిమో అది చదువరులు నిర్ణయింప దగినయంశము.

మా పరిశీలనములో ఇది మొదటి గ్రంథము. మాలో మొదటి గ్రంథకర్తకు మాతృభాష ఆంధ్రము. రెండవవారిది వంగభాష. ఇరువురకును సాధారణభాష సంస్కృతము. కావున కారికా కౌముదులకు అనువాదము సమగ్రముగ మొదటివారు రచించినది. ఆంగ్ల, గీర్వాణ, జర్మన్, వంగాది భాషలందుగల దర్శనగ్రంథ విమర్శనముల నెల్ల బరిశీలించి, ముఖబంధమందును, టిప్పణమందును, పరిశిష్టమందును, వ్రాయబడిన విషయములనెల్ల సేకరించినవారు రెండవవారు. వారు సేకరించిన యంశములను ఇరువురును సవిమర్శముగ సంప్రతించుట, టిప్పణాదులను మొదటివారు ఆంధ్రమున రచించుట, అనుమార్గమున ఈ రచనము సాగినది.

ఈ గ్రంథమును సావధానముగ సాంతముగ బరికించి ఆంధ్రమున సులభబోధనమునకు వలసిన సూచనలు కొన్ని గావించి దీని సత్వర ప్రకాశనమునకు తగినరీతిని మమ్ము

ప్రోత్సహించిన మా ప్రియమిత్రులు శ్రీ దువ్వూరి వేంకట రమణశాస్త్రిగారి సౌహార్దము మే మెరువురమును మఱువ రానిది.

దీని ముద్రణ ప్రకటనములకు సోత్సాహముగ బూనుకొని నిర్దష్టమును రమణీయము నగు రూపముతో ఈగ్రంథమును వెలయించి నందులకు కవిరాజ పబ్లిషర్సు (తెనాలి) వారు మాకు మిక్కిలి అభినందనీయులు.

ఇట్లే- తక్కిన దర్శనములన్నిటిని ఆంధ్రమున వెలువ రించుట మా సంకల్పము. దానికి సరసులగు పాఠకుల ప్రోత్సాహము మాత్రమే అభిలషితము.

ఇట్లు సుజనవిధేయులు
గ్రంథకర్తలు
కొల్లూరు సోమశేఖరశాస్త్రి
శైలేశ్వరసేన్

ఆంధ్రవిశ్వకళాపరిషత్తు
వాల్తేరు
సర్వధారి-చైత్రశుక్ల
నవమి

# ముఖబంధము

## I

భారతదేశమున ప్రసిద్ధములగు దర్శనములలో సాంఖ్య మొకటి. "శుద్ధాత్మతత్త్వవిజ్ఞానం సాంఖ్యమిత్యభిధీయతే" "సంఖ్యాం ప్రకుర్వతే యస్మా త్ప్రకృతిం చ ప్రచక్షతే। చతుర్వింశతి తత్త్వాని తేన సాంఖ్యం ప్రకీర్తితమ్" అను మహాభారత వచనమునుబట్టి, "సాంఖ్యంసంఖ్యాత్మకత్వాచ్చ కపిలాదిభిరుచ్యతే" అను నారోక్తినిబట్టియు, ఈదర్శనమునకు సాంఖ్యమని వ్యవహారము.

సాంఖ్య దర్శనమం దిపుడు లభించెడి గ్రంథము లన్నిటిలోను ఈశ్వర కృష్ణుని కారికలే ప్రాచీనములు. వీనికి సాంఖ్య సప్తతి అనియు వ్యవహారము కలదు. చీనాదేశమునం దీ కారికలను సువర్ణసప్తతి అనియు, హిరణ్యసప్తతి అనియు వ్యవహరింతురు. ఈ గ్రంథమునొక్క రచనాసమయము స్పష్టముగ దెలియదు. కాని యీ గ్రంథమునకు చీనాభాషయందు పరమార్థునిచే జేయబడిన యనువాదము, క్రీస్తుశకము 546 సంవత్సర ప్రాంతమున చైనాదేశమందు ప్రచారమునకు వచ్చినది. క్రీస్తునకు తరువాత 350 ప్రాంతమునందుండెడి బౌద్ధదార్శనికుడగు వసుబంధువునకు సమకాలికుడగు వింధ్యవాసుడను సాంఖ్య దార్శనికుడొక డుండెడివాడని ఆ దేశమందు ప్రసిద్ధి కలదు. కొందఱీ యీశ్వర కృష్ణునకే వింధ్యవాసుడను నామాంతరము కలదనుచున్నారు.

కారికలలో చివర షష్టితంత్రమను గ్రంథము చెప్పబడినది. ఈ గ్రంథము పంచశిఖ ప్రణీతమని కారికలవలన దెలియుచున్నది. వాచస్పతిమతమున షష్టితంత్రము వార్షగణ్యప్రణీతమని తోచుచున్నది. తత్త్వవైశారది 4 పా. 13 వ సూత్రమును, భామతి 2-1-3, వ సూత్రమును జూడుడు. అహిర్బుధ్న్య సంహితయందును షష్టితంత్రము జెప్పబడినది. అందు మొదటి 32 భాగములు ప్రాకృతమండలాంతర్గతము లనియు, మిగిలిన భాగములు వైకృత మండలాంతర్గతములనియు కలదు. ఈ షష్టితంత్రము వార్షగణ్య ప్రణీతమనియు, ఇందఱువదివేల శ్లోకములు కలవనియు చీనాదేశమున ప్రతీతి కలదు. వాచస్పతి తన కౌముదియందు రాజవార్తికమను గ్రంథమునుండి మౌలిక పదార్థములను జూపెను. కాని యీ గ్రంథముకాని ఈ గ్రంథకర్త పేరుకాని మనకు లభించుటలేదు.

సాంఖ్య దర్శనమను పేర ఆఱధ్యాయములు కల సూత్రాత్మకమగు గ్రంథమొకటి కలదు. దీని కనిరుద్ధునివృత్తియు, విజ్ఞాన భిక్షుని వ్యాఖ్యానమును కలవు. ఇది కపిలప్రణీత మని కొందఱనుచున్నారు. కాని యిది ప్రాచీనము కానేరదు. ఇది ప్రాచీనమే అయిన యెడల శంకరాచార్యులు తమ భాష్యమున సాంఖ్యమత విచారసందర్భమునం దీ సూత్రములనే ఉదాహరించి యుండెడివారు. అట్లుదాహరింపక కారికలనే ఉదాహరించిరి. తత్త్వసమాసమని మఱియొక సాంఖ్యగ్రంథము కలదు. ఇది కపిలప్రణీతమని కొందఱనుచున్నారు. సాంఖ్యమున కీ గ్రంథమే ప్రాచీనతమమని మాక్సుమ్యుల్లరు మహాశ

శయు డనుచున్నాడు. కాని దరిమిలావారు దీని నంగీకరించుట లేదు. పైకారణమునుబట్టి యిదియు ప్రాచీనము కానేరదు.

కారికలకు గల వ్యాఖ్యలలో ఈ క్రిందివి సుప్రసిద్ధములు. 1. గౌడపాదకృతభాష్యము. (ఈ గౌడపాదులు మాండూక్య కారికాకారు లగుదురా, కారా, అని విచారింపవలసియున్నది.) 2. మాఠరవృత్తి. 3. శంకరుని జయమంగళ టీక. (ఈశంకరులు బ్రహ్మసూత్ర భాష్యకారులగుదురా, కారా, అని విచారింప వలసి యున్నది.) 4. వాచస్పతి కృత తత్త్వకౌముది. 5. నారాయణతీర్థుల చంద్రిక. వీనిలో గౌడపాద భాష్యమునకు, మాఠర వృత్తికిని సామ్యముకలదు. ఈ కారికలు పరమార్థునిచే చీనా భాషయం దనువదింపబడి వ్యాఖ్యాతములయినవి. టాకాకుసూ మహాశయు డీ వ్యాఖ్యను ఫ్రెంచి భాషయం దనువదించెను. ఆ ఫ్రెంచిభాషానువాదమును కీ. శే. సూర్యనారాయణశాస్త్రి ఆంగ్లమునం దనువదించెను. ఈ ఆంగ్లానువాదమునుబట్టి చూడ పరమార్థుని వ్యాఖ్యానము మాఠరవృత్తికి సరిపోవుచున్నది.

పాశ్చాత్యదేశమందును ఈ సాంఖ్యశాస్త్రము ప్రసిద్ధిని గాంచినది. సాంఖ్యశాస్త్రమును విమర్శించిన విద్వాంసులలో లాసెన్, కోల్‌బ్రూక్, విల్సన్, గార్బే, డేవిస్, కీత్, డాల్మన్, జాన్స్టన్ మున్నగువారు ప్రసిద్ధులు.

# II

సాంఖ్యదర్శనమందు చెప్పబడిన తత్త్వములు ఉపనిషత్తులందు కొన్ని తావుల స్పష్టముగను, మరికొన్ని తావులందు అస్పష్టముగను వినబడుచున్నవి.

మహదాది తత్త్వములు కఠోపనిషత్తునందు III. 10, 11, VI. 6, 7, మంత్రములందు దగపడుచున్నవి. "ఇంద్రియేభ్యః పరాహ్యర్థా అర్థేభ్యశ్చ పరంమనః । మనసస్తుపరాబుద్ధిః బుద్ధేరాత్మా మహాన్పరః । మహతః పర మవ్యక్త మవ్యక్తాత్పురుషఃపరః" "ఇంద్రియేభ్యః పరంమనో మనసస్సత్త్వము త్తమం । సత్త్వాదధి మహానాత్మా మహతోऽవ్యక్తము త్తమమ్ । అవ్యక్తాత్తు పరః పురుషోవ్యాపకోऽలింగఏవచ."

సత్త్వాది గుణములు, ఛాందోగ్యమున VI. 4, నందిట్లు కలవు. "యదగ్నే రోహితం రూపం తేజసస్తద్రూపం । యచ్ఛుక్లం తదపాం, యత్కృష్ణం తదన్నస్య । అపాగాదగ్నే రగ్నిత్వం వాచారంభణం వికారో త్రీణి రూపాణీత్యేవసత్యమ్."

మైత్రాయణీయమున "సంమోహోభయం విషాదో నిద్రాతంద్రీ వ్రణోజరాశోకః క్షుత్పిపాసాకార్పణ్యం క్రోధో నాస్తిక్యం అజ్ఞానం మాత్సర్యం వైకారుణ్యం మూఢత్వం నిర్వ్రీడత్వం నికృతత్వ ముద్ధతత్వ, మితి తామసాన్వితః। తృష్ణా స్నేహో రాగో లోభో హింసా రతిర్దృష్టిర్వ్యాపృతత్వ మీర్ష్యా కామమవస్థితత్వం చంచలత్వం జిహీర్షా అర్థోపార్జనం,

మిత్రానుగ్రహణం పరిగ్రహాఽవలంబో అనిష్టేష్విఁంద్రియార్థేషు ద్విష్టిరిష్టేష్వభిష్వంగ ఇతిరాజస సాన్వితేః పరిపూర్ణః."

మైత్రాయిణీయోపనిషత్తునందే "పంచతన్మాత్రాణి భూతశబ్దేనోచ్యంతే, పంచమహాభూతాని భూతశబ్దేనోచ్యంతే" అని తన్మాత్ర తత్వము చెప్పబడినది. III. 2, జూడుడు.

"అజామేకాం లోహిత శుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః । అజో హ్యేకో జుషమాణోఽనుశేతే జహాత్యేనాం భుక్తభోగామజోఽన్యః" అని ప్రకృతితత్వము శ్వేతాశ్వతరోపనిషత్తున కలదు. 4,5, ను జూడుడు.

మఱియు, సాంఖ్య కపిల అజాశబ్దములు, శ్వేతాశ్వతరోపనిషత్తునందు కలవు. 2. 13, లను జూడుడు.

63 వ కారికలో జెప్పబడిన ప్రధాన పురుషులు, మైత్రాయణీయోపనిషత్తునందు జెప్పబడిరి.

మహాభారతమున కపిల, ఆసురి, పంచశిఖుల నామములు శాంతిపర్వమున కలవు. వీరిలో కపిలుని శిష్యుడు, ఆసురి, ఆసురిశిష్యుడు, పంచశిఖుడు, అనియు కలదు. ఈశాంతి పర్వమునందును, అశ్వమేధ పర్వమునందును, సాంఖ్యమతము జెప్పబడినది. అ. ప. 37 మొదలు, 51 వ అధ్యాయము వఱకును జూడుడు.

కాని కారికాకౌముదిలోని సాంఖ్య మతమునకును, భారతమందలి సాంఖ్యమతమునకును, అచ్చటచ్చట భేద మగపడుచున్నది. చూడుడు.

1. తమోగుణమువలన మోహముపుట్టునని, మ. భా. శాం. 218. తమోగుణమువలన మోహముపుట్టునని కౌముది. 219 వ అధ్యాయమున మాత్రము తమోగుణమువలన మోహము పుట్టునని కలదు.

2. 302 వ అధ్యాయమున జీవునికన్న వేఱగు పరమాత్మ చెప్పబడెను. కౌముదిలో పరమాత్మ చెప్పబడుట లేదు.

3. 219 వ అధ్యాయమున జ్ఞానమువలన బుద్ధి మనః ప్రభృతులు నిరాకరింపబడిన పిదప, విద్యాసాధనమువలన స్వరూపానంద ప్రాప్తి కలుగునని పంచశిఖుని యుపదేశముగ వ్రాయబడినది. కౌముది యందట్లు లేదు.

4. 303 వ అధ్యాయమున ఈశ్వరుడు కలడనియు, ఈతనివలన త్రైలోక్యము పుట్టుననియు కలదు. మఱియు సత్వగుణప్రధాన ప్రకృతివలన మహత్తత్వమును, మహత్తత్వము నుండి తమః ప్రధానమగు నహంకారమును, అహంకారము వలన పంచ సూక్ష్మ భూతములును, సూక్ష్మ భూత సముదాయమువలన క్రమముగ స్థూలభూతములును పుట్టునని కలదు. ఇది వేదాంతి సమ్మతమగు పంచీకరణ ప్రక్రియ ననుసరించుచున్నది. కాని, 307 వ అధ్యాయమున సాంఖ్యోక్తక్రమమున మహాభూతాది సృష్టి చెప్పబడినది.

5. 306 వ అధ్యాయమున జ్ఞాని, జీవపరుల కభేదమును దెలిసికొనును. అజ్ఞాని భేదమును జూచును అని కలదు. ఇది వేదాంతి మతసదృశము.

6. భగవద్గీతయందును "మహాభూతా న్యహంకారః బుద్ధిరవ్యక్తమేవచ । ఇంద్రియాణి దశైకంచ పంచచేంద్రియ గోచరాః" అని సాంఖ్యోక్తబుద్ధ్యహంకారాదులు చెప్పబడినవి

# III

సాంఖ్యదర్శనమున కితరదర్శనములతో గల సామ్య వైషమ్యములు:

1. ఆత్మ నిర్గుణము, జ్ఞాన స్వరూపము, అను విష యము సాంఖ్యులకు, వేదాంతులకును సమానము. కాని వేదాంతిసమ్మతమగు సుఖరూపత్వమును సాంఖ్యు లంగీకరిం పరు. సాంఖ్యమతమున సుఖమంతయు బుద్ధిధర్మము.

2. ఆత్మ నానాత్వమందు సాంఖ్య, నైయాయిక వైశేషికాదులకు సామ్యము కలదు. కాని నైయాయికాదుల మతములం దాత్మ సగుణము. సాంఖ్యమతమం దాత్మ నిర్గుణము.

3. కార్యకారణభావ విషయమున బౌద్ధులది సంఘాత వాదము. వైశేషిక నైయాయికులది ఆరంభవాదము. సాంఖ్యు లది పరిణామ వాదము. వేదాంతులది వివర్త వాదము.

4. వైశేషికులు అసత్కార్య వాదులు, సాంఖ్యులు వేదాంతులును సత్కార్య వాదులు.

5. న్యాయ వైశేషిక మతములందు కార్య కారణములకు కేవలభేదము. సాంఖ్యమతమునందు అభేదము. వేదాంతి మతమున తాదాత్మ్యము. అనగా భేదాభేదము. ఇది ప్రాతిభాసికస్థలమున ప్రాతిభాసికమును, వ్యావహారిక స్థలమున వ్యావహారికమును అగుచున్నది.

6. సాంఖ్య, వేదాంతి, న్యాయ, వైశేషికుల మతమందు ఆత్మవిభువు. అనగా వ్యాపకము. జైనమతమం దాత్మ మధ్యమ పరిమాణము కలది. రామానుజమతమం దాత్మ అణుపరిమాణము కలది.

7. జీవన్ముక్తి విషయమున సాంఖ్య, వేదాంతి, నైయాయిక, వైశేషికులకు సామ్యము. రామానుజ మతమున సర్వజ్ఞముని మతమందును జీవన్ముక్తి లేదు.

8. మోక్షము దుఃఖాభావరూపమనుటలో సాంఖ్య, నైయాయిక, వైశేషికులకు సామ్యము కలదు. కాని మోక్షావస్థయం దాత్మ పాషాణులవలె జడరూపముగ నుండునని న్యాయమతము. సాంఖ్యమతమున చైతన్యరూపుడు. వేదాంతి మతమున చిదానంద రూపుడు.

9. ఘటాకారము కల అంతఃకరణవృత్తి యందలి, చైతన్యప్రతిబింబము, ఘటజ్ఞానము, అని విషయజ్ఞానమందు,

సాంఖ్యులకును, వేదాంతులకును సామ్యము కలదు. న్యాయమత మున జ్ఞానము ఆత్మగుణము, నిరాకారము.

10. ప్రమాణ విషయమున సాంఖ్యులకును, ఇతర దార్శనికులకును గల భేదమును టిప్పణమున జూడుడు.

11. తత్త్వజ్ఞానము ముక్తిసాధనమను విషయము న్యాయ, వైశేషిక, సాంఖ్య, వేదాంతులకు సమానము. కాని తత్త్వజ్ఞానమందు మాత్రము భేదము కలదు. 2 వ కారిక టిప్పణ మును జూడుడు.

12. కపిలమతమం దెట్లు తత్త్వములు నిరూపింపబడినవో పతంజలి మతమందును, అట్లే నిరూపింపబడినవి. సాంఖ్యదర్శ నమునకును, పాతంజల దర్శనమునకును ఈశ్వర విషయమున భేదము. సాంఖ్యు లీశ్వరు నంగీకరింపరు. పాతంజలు లంగీకరిం తురు. కావుననే కాపిలదర్శనమునకు నిరీశ్వరసాంఖ్య మనియు, పాతంజల దర్శనమునకు సేశ్వర సాంఖ్యమనియు వ్యవహారము.

13 ఖ్యాతి (భ్రమ) విషయమునందు అఖ్యాతివాదులు ప్రాభాకరులు. అన్యథా ఖ్యాతివాదులు వైశేషికులు, నైయాయికులు, భాట్టులును. అసత్ఖ్యాతి వాదులు మాధ్య మికులు. ఆత్మఖ్యాతివాదులు యోగాచార బౌద్ధులు. సత్ఖ్యాతి వాదులు రామానుజాను యాయులు. అనిర్వచనీయ ఖ్యాతి వాదులు వేదాంతులు. సదసత్ఖ్యాతివాదులు సాంఖ్యులు.

విజ్ఞానభిక్షువు, సాం. ద. **5. 56** వ సూత్రవ్యాఖ్యాన మున 1 స్ఫటికమందు లౌహిత్యప్రతీతి, 2 శుక్తియందు రజత

ప్రతీతి, 3 చైతన్యమందు ప్రపంచప్రతీతియు అను మూడు దృష్టాంతములచే ఈ సదసత్ఖ్యాతిని నిరూపించి యుండెను. సాంఖ్య మతమున వస్తువులన్నియు సత్తులగుటవలన లౌహిత్యము, రజతము ప్రపంచమును స్వరూపముచే సత్తులగుచున్నవి. ఇవియే సంసర్గము (ప్రతిబింబరూపము)ను బట్టి అసత్తులగుచున్నవి. లౌహిత్యము స్ఫటిక ప్రతిబింబితరూపముచే అసత్తు స్వరూపము (బింబరూపము) చే సత్తును అగుచున్నది. రజతమును శుక్త్యధ్యస్తరూపముచే అసత్తును, వణిగ్వీధిస్థరూపముచే సత్తును అగుచున్నది. ప్రపంచము స్వరూపముచే సత్తును, చైతన్యాధ్యస్త రూపముచే అసత్తును అగుచున్నది. వీరి మతమున సత్త్వమన అబాధ్యత్వము. అసత్త్వమన బాధ్యత్వము. బాధ్యమనగా తాను దేనియందు భాసించునో దానియందే నిషేధింపబడుట అని యర్థము. (Object of Sublative Judgment) సాంఖ్య సమ్మత బాధ్యత్వము, వేదాంతి సమ్మత బాధ్యత్వమును సమానములు. వీరి అసల్లక్షణము వేదాంతులమిథ్యాలక్షణ సదృశము వేదాంతులమతమున ప్రపంచము స్వరూపముచేతను, సంసర్గము చేతను గూడ మిథ్య యగుచున్నది. సాంఖ్యమతమున సంసర్గమునకు బాధకాని, స్వరూపమునకు బాధలేదు. కాగా పై మూడు స్థలములందును వేదాంతుల మతమున స్వరూపమునకును, సంసర్గమునకును బాధ సిద్ధించును. "లోహితః స్ఫటికః" అను జ్ఞానమందు సత్తగు స్ఫటికమును ప్రతిబింబరూపముచే అసత్తగు లౌహిత్యమును కలిసి భాసించుటవలన ఈజ్ఞానము సదసత్ఖ్యాతి యనబడుచున్నది.

# ఆంధ్రీకృత సాంఖ్యతత్త్వ కౌముది

శ్లో॥ అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సమానాః। అజాయేకాం జుషమాణాం భజంతే జహాత్యేనాం భుక్తభోగాం నుమస్తాన్॥

కపిలాయ మహామునయె మునయె శిష్యాయ తస్య చాసురయె। పంచశిఖాయచ మునయె ఈశ్వర కృష్ణాయెతాన్నమస్యామః॥

జన్మరహితము, నిత్యము, నిరుపమము, సత్వరజస్తమో గుణాత్మకమును నగు ప్రపంచమునంతను సృజించునట్టియు ప్రకృతిని నమస్కరింతుము. ఏ జీవులు తమకు భోగమును గల్పించెడి ఆ ప్రకృతిని అనుసరించుచుండిరో, ఎవరు అనుభవించిన భోగములు కలవారై ఆ ప్రకృతిని విడిచిపెట్టుచుండిరో, అట్టి రెండురకముల పురుషులను నుతింతుము.

కపిలమహాముని ప్రీతికొఱకును, కపిలశిష్యుడగు ఆసురి ప్రీతికొఱకును, ఆసురిశిష్యుడగు పంచశిఖాచార్యుని ప్రీతికొఱకును, ఆతని శిష్యుడగు ఈశ్వర కృష్ణుని ప్రీతికొఱకును ఆ కపిలాదులను నమస్కరింతుము.

లోకమునందు ఉపదేశకుడు శ్రోతల కిష్టమును క్షేమంకరమును అగు దానిని బోధించునపుడే శ్రోతల ప్రీతికి పాత్రుడగుచుండును. అట్టివాని యుపదేశమును, శ్రోతలు సావధానముగ గ్రహింతురు. అట్లుగాక ఇష్టముకాని దానిని

బోధించునప్పుడు శ్రోత యతడు లోకజ్ఞుడు కాడు, శాస్త్రజ్ఞుడును కాడని వానిని పిచ్చివానివలె నుపేక్షింతురు. ఏది పరమపురుషార్థమునకు సాధనమో అట్టిదానినే ప్రాజ్ఞు లభిలషింతురు. ఈ సాంఖ్యదర్శనమునందు నిరూపింపబడెడి పదార్థవిజ్ఞానము పరమపురుషార్థసాధనమగు వివేకఖ్యాతికి (తత్త్వజ్ఞానమునకు) హేతువగుచున్నది. కాన సాంఖ్యశాస్త్ర విషయములందు జిజ్ఞాస అవసరము.

దుఃఖత్రయాభిఘాతా జ్జిజ్ఞాసా తదపఘాతకే హేతౌ ।
దృష్టే సాపార్థాచే న్నైకాంతాత్యంతతోఽభావాత్ ॥

దుఃఖత్రయాభిఘాతాత్ = ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములగు దుఃఖములయొక్క ఒత్తిడివలన తదపఘాతకే హేతౌ = ఆ దుఃఖములను నశింపజేయు హేతువునందు, జిజ్ఞాసా = తెలిసికొనవలయునను కోరిక, భవతి = కలుగుచున్నది. దృష్టే సతి = ప్రత్యక్షమువలన అట్టికారణము సిద్ధించునపుడు సా = ఆ కోరిక, అపార్థాచేత్ = వ్యర్థమందువేని, ఏకాంతాత్యంతతోఽభావాత్ = ప్రత్యక్షసిద్ధమగు కారణమువలన నిశ్చయముగను, నిశ్శేషముగను, దుఃఖము నశింపనందున, న = నీ యాక్షేపము చెల్లనేరదు...

ప్రపంచమందు దుఃఖము లేకపోయినను, దుఃఖమునుండి తొలగవలయునని ఇచ్ఛ పురుషునకు లేకపోయినను, దుఃఖమును పోగొట్టుకొనుటకు సాధనము లేకపోయినను ఈ శాస్త్రార్థమును దెలిసికొనుట కెవ్వనికిని యిచ్ఛ జనింపదు.

దుఃఖము నిత్యమయినను, దుఃఖము నశించుటకు సాధనము తెలియకుండినను, దుఃఖమునుండి తొలగుట శక్యముకాదు. దుఃఖము నశించినను, ఈ సాంఖ్యశాస్త్రవిచారమువలన గలిగిన జ్ఞానము దానికి బనికిరాకుండినను, ఇంతకన్నను తేలికయగు మఱియొక సాధనమున్నను ఈ శాస్త్రమునం దెవ్వరికిని బ్రవృత్తి కలుగదు. కాని దుఃఖము లేదనుటకుగాని, నశింపదనుటకుగాని వీలులేదు. ఈ విషయమే ఈ కారికయందు నిరూపింపబడు చున్నది.

దుఃఖము ఆధ్యాత్మిక మనియు, ఆధిభౌతిక మనియు, ఆధిదైవిక మనియు త్రివిధము. ఆధ్యాత్మిక దుఃఖము శారీర మనియు, మానసికమనియు ద్వివిధము. వాతపిత్తశ్లేష్మముల వైషమ్యమునుబట్టి శారీరదుఃఖము సిద్ధించుచున్నది. కామము, క్రోధము, లోభము, మోహము, భయము, ఈర్ష్య, విషాదము, ఇష్టమగు వస్తువుయొక్క అలాభము, అను వీనివలన మానసిక దుఃఖ మేర్పడును. ఈ రెండు రకముల దుఃఖమును దేహాంతర్గతములగు సాధనములవలన సిద్ధించుచున్నది. ఆదిభౌతికాది దైవికములు రెండును బాహ్యసాధనములవలన సిద్ధించుచున్నవి. మనుష్య, పశు, పక్షి, సర్ప, స్థావరరూపములగు భూతములవలన సిద్ధించునది ఆదిభౌతికములు. యక్ష, రాక్షస, వినాయక, గ్రహావేశములవలన సిద్ధించునది ఆధిదైవికము. రజోగుణముయొక్క పరిణామ విశేషమును సర్వానుభవసిద్ధము నగు దుఃఖము లేదనుటకు వీలులేదు. ఇట్లాంతఃకరణమునందుండెడి త్రివిధ దుఃఖములతోను చేతనునికి ప్రతి

కూలము (విరుద్ధము, అనిష్టము) అగు సంబంధమే అభిఘాత మనబడును. ఈ అభిఘాతమే దుఃఖనివారణమునకు ఏది సాధనము? అను జిజ్ఞాసకు హేతువు. అంతఃకరణమునం దుండెడి దుఃఖము తప్పనిదైనను దానిని తొలగించుకొనుటకు వీలున్నదని ముందు నిరూపింపబడును. కావున కారికయందు జెప్పబడిన "తదపఘాతకే హేతౌ" అనునది ఉపపన్నమే యగుచున్నది. "దుఃఖత్రయాభిఘాతాత్" అను పదమునందు దుఃఖము అప్రధానముగ జెప్పబడినను తదపఘాతకే అనునపుడు తచ్ఛబ్దముచేతను, ఆ దుఃఖమే బుద్ధిస్థమగుటవలన పరామర్శింపబడుచున్నది. అట్టి దుఃఖమును తొలగించు హేతువు ఈ శాస్త్రమందు చెప్పబడుచున్నది.

పైని చెప్పిన దుఃఖమున్నది. అది నశింపనలయును. దానిని మీ శాస్త్రమందు చెప్పబడిన హేతువు నశింపజేయవచ్చును. అయినను మీరు చెప్పినదానికన్నను తేలికయగు లోకసిద్ధమైన ఉపాయమువలననే ఆ దుఃఖము నశించుచుండ మీ శాస్త్రార్థము మాకెందులకు? గూటియందే తేనె సిద్ధమైయుండ దానికొఱకు పర్వతమున కెందులకు పోవలయును? ఇట్లే మనమెఱిగిన తేలికసాధనముల వలన కార్యము సిద్ధించుచుండ శాస్త్రమెందులకు? శారీరక దుఃఖము నశించుటకు వైద్యులు చెప్పిన సాధనములు కలవు. మానసికదుఃఖములు నశించుటకు స్త్రీలు మున్నగు ఇష్టసాధనములు కలవు. భూతములవలన గలిగెడి దుఃఖములు నశించుటకు నీతిశాస్త్ర కౌశలము, నిరపాయస్థానము మున్నగునవి సాధనములు. దైవికము

లగు దుఃఖములు నశించుటకు మణులు, మంత్రములు మున్నగునవి కలవు. కాన మీ శాస్త్ర మెందులకు? అను శంక కలుగవచ్చును. కాని మీరుచూపిన పై లౌకిక హేతువుల వలన దుఃఖములన్నియు తప్పక నిశ్శేషముగ నశించుట కవకాశము లేదు. వైద్యులు చెప్పినట్లౌషధముల సేవించినను, స్త్రీలు, నీతిశాస్త్రము, మంత్రములు, మున్నగు వానిని సంపాదించినను కొందఱకు దుఃఖము నశించుట లేదు. మఱికొందఱ కప్పటికి నశించినను తిరిగి దుఃఖము సిద్ధమగుచున్నది. కాన తప్పక నిశ్శేషముగ దుఃఖము నశించుటకీ శాస్త్రమందు జెప్పబడిన సాధనమే కావలయును. కాన ఈ శాస్త్రారంభము సఫలమే యగుచున్నది.

అమంగళరూపమగు దుఃఖముతో శాస్త్రారంభము అనుచితమని శంక కలుగవచ్చును. కాని దుఃఖము అమంగళరూపమయినను, ఆ దుఃఖవినాశము సమ్మతమును మంగళరూపమును అగుచున్నది. కాన మంగళరూపమును, శాస్త్రాభిమతమును అగు దుఃఖవినాశమును నిరూపించుటకే ఇట దుఃఖము స్మరింపబడినది కాన దోషము లేదు.

లోకసిద్ధమగు లౌకికోపాయమువలన సంపూర్ణ దుఃఖవినాశము సిద్ధింపకపోయినను, వేదమునందు జెప్పబడిన జ్యోతిష్టోమము మున్నగువానివలన పైని జెప్పబడిన దుఃఖము పూర్తిగ నశింపవచ్చును. స్వర్గకాముడు యాగమును చేయవలయునను విధికలదు. ఏ సుఖము దుఃఖమిశ్రితమును దుఃఖతిరస్కృతమును, దుఃఖాంతమును కాదో, తాను కోరిన

వెంటనే లభించెడి అట్టి సుఖమే స్వర్గమనబడును. ఈ సుఖము తనకు విరోధియగు దుఃఖమును పూర్తిగ నశింపజేయును. తాను మాత్రము నశింపదు. సోమపానమువలన అమృతత్వము (నిత్యసుఖము) సిద్ధించునని వేదము బోధించుచున్నది. కావున వేదోక్తమగు దుఃఖప్రతీఘాతోపాయము కలదు. ఈ ఉపాయము ప్రతిక్షణము క్రమముగ సావకాశముగ సంపాదింపదగినది. మీరు చెప్పెడి ప్రకృతిపురుష వివేకవిజ్ఞానము బహుజన్మ ప్రయత్నసాధ్యము. కాన మీ శాస్త్రోక్తమగు విషయమందు ప్రవృత్తి ఎట్లు కలుగును? అని శంక కలుగవచ్చును. కాని,

శ్లో॥ దృష్టవదానుశ్రవికః సహ్యవిశుద్ధిక్షయాతిశయయుక్తః ।
తద్విపరీతః శ్రేయాన్ వ్యక్తావ్యక్తజ్ఞ విజ్ఞానాత్ ॥ 2

అనుశ్రవికః = వైదికమగు యాగాదికము, దృష్టవత్ = లౌకికోపాయమువలె, అనిత్యమగుఫలము కలదియే యగుచున్నది. హి = ఎందువలన, సః = ఆయాగాదికము, అవిశుద్ధి, క్షయా, తిశయయుక్తః = హింస, అనిత్యత్వము, హెచ్చుతగ్గులతోగూడినదికద, వ్యక్తావ్యక్తజ్ఞవిజ్ఞానాత్ = వికార, ప్రకృతి, పురుషుల విశేషజ్ఞానమువలన పుట్టిన, తద్విపరీతః = కర్మరూపమగు సాధనముకన్నను వేఱగు మేము నిరూపించెడి సాధనము, శ్రేయాన్ = శ్రేష్ఠమయినది.

గురూపదేశమునుబట్టి గ్రహింపబడుచున్నది కాన, వేదము అనుశ్రవమనబడుచున్నది. దీనివలన వేదము పేరు

 హేయము కాదని స్పష్టమగుచున్నది. అందు నిరూపింపబడిన యజ్ఞాదికము ఆనుశ్రవికము. ఈ యజ్ఞాదికము సయితము లౌకికసాధనమువలెనే తప్పక నిశ్శేషముగ దుఃఖమును తొలగింప జాలదు. ఇట ఆనుశ్రవిక మని సామాన్యముగ వేదమందలి విషయమంతయు జెప్పబడినది. వేదమునందు కర్మలు, ప్రకృతిపురుషవివేకము రెండును జెప్పబడినవి. అయినను ప్రకృత సందర్భమునుబట్టి కర్మలను మాత్రమే గ్రహింపవలయును. ఈ యజ్ఞాదులు హింసాదియుక్తము లగుటవలన ఆత్యంతిక శ్రేయస్సాధనములు కానేరవు. ఈ విషయమును పంచశిఖాచార్యు లిట్లు నిరూపించిరి. కర్మఫలము స్వల్పసంకరము. అనగా పశుహింసవలన గలిగినదియు, ప్రాయశ్చిత్తమువలన నశించునదియు, సహింపదగినదియు నగు దుఃఖముతో సంకీర్ణ మగుచున్నది. కావుననే స్వర్గసుఖము లనుభవించెడివారు కర్మలందు జేసిన హింసాఫలమగు స్వల్పదుఃఖమును సయిత మనుభవించుచునే యుందురు. భూతములందు దేనిని గూడ హింసింపరాదు అను సామాన్యశాస్త్రము యజ్ఞములందు పశుహింస చేయవలయునను విశేషశాస్త్రమునవలన బాధింపబడును. కాన యజ్ఞమందలి హింస దుఃఖకరము కాదని కొందఱకు శంక కలుగవచ్చును. కాని యీ రెండు శాస్త్రములకును విరోధమే లేదు. ఒకే విషయమందు చేయుము, మానుము, అనునపుడు విరోధము ప్రసక్తమగుచున్నది. ప్రకృతమున సామాన్యశాస్త్రము హింసను నిషేధించుచు హింస దుఃఖసాధనమని బోధించుచున్నది. విశేష

శాస్త్రము హింస యజ్ఞసాధనమని బోధించుచున్నది. కాని దుఃఖసాధనము కాదని చెప్పుటలేదు. పై విశేషశాస్త్రము హింస యజ్ఞసాధనమనియు, దుఃఖసాధనము కాదనియు, రెండర్థములను బోధించినయెడల మీమాంసకులు చెప్పిన వాక్యభేదమను దోషము వచ్చును. కాగా ననర్థహేతువగు హింస యజ్ఞసాధనమగుటకు ఏ విరోధమునులేదు. కాగా నిటసామాన్య శాస్త్రము విశేషశాస్త్రముచే బాధింపబడుట కవకాశము లేదు. యజ్ఞాంగమగు హింస పురుషునికి దుఃఖమును కలిగించుచునే యజ్ఞాంగము కావచ్చును. కర్మఫలమందలి క్షయాతిశయములను కర్మలం దారోపించి "అవిశుద్ధి క్షయాతిశయ యుక్తః" అని చెప్పబడినది. కర్మఫలమగు స్వర్గము కార్యము (పుట్టుచున్నది.) కాన నశింపక తప్పదు. కర్మభేదమును బట్టి కర్మఫలమందు తారతమ్యమును తప్పదు. లోకమున తాను సుఖమునను భవించుచున్నను పరుల సంపదుత్కర్షను జూచి సహింపజాలక దుఃఖపడుట కలదు. సోమపానమువలన నమృతులమయితి మను వాక్యమునకు చిరకాలము సుఖించుచుంటిమని అర్థము. కావుననే భూతములు నశించునంతవఱకుండు స్థానమునే అమృతస్థానమని చెప్పుదురు అని కలదు. ముఖ్యమగు నమృతభావము కర్మసాధ్యము కానేరదు. కావుననే శ్రుతియందు కర్మలచేతను, సంతానముచేతను, ధనముచేతను, జ్ఞానశూన్యమగు సన్న్యాసముచేతను మోక్షము సిద్ధింపదు. ఆత్మయందు సహజసిద్ధమయి, కేవల సుఖరూపమయి, యే మోక్షము ప్రకాశించుచున్నదో దానిని జ్ఞానసంపన్నులగువారు కర్మాదుల

కన్నను వేఱగు శ్రవణాదులచే పొందగలుగుచున్నారు అని చెప్పబడినది. మఱియు గృహస్థులగువారు కర్మలవలన మోక్షమును పొందలేకపోయిరి. జ్ఞానులగు యతులు కర్మలకు దుర్లభమగు మోక్షమును సాధించిరి అనియు కలదు. దీనినంతను మనస్సునం దిడికొనియే "తద్విపరీతః శ్రేయాన్" అని చెప్పబడినది. వేదముచే బోధింపబడినట్టియు, దుఃఖసంకీర్ణ మగునట్టియు కర్మకన్న విలక్షణమును, హింసాసంబంధరహితమును అగు ప్రకృతిపురుష భేద సాక్షాత్కారము శ్రేష్ఠమయినది. ముక్తునకు పునరావృత్తి లేదని వేదమం దనేక స్థలములం దుండుటవలన మోక్షము నిత్యము, నిరతిశయము నగుచున్నది. భావరూపమగు కార్య మనిత్యమయినను, దుఃఖనాశ రూపమగు కార్యము నిత్యము కావచ్చును. కాన వివేక విజ్ఞానసాధ్యమగు మోక్షము అనిత్యమేల కారాదని శంకింప నవకాశము లేదు. కారణము ప్రవర్తింపనినాడు కార్యము పుట్టదు. కాన మఱియొక దుఃఖము పుట్టరాదా యనుటకును వీలులేదు. సత్యబుద్ధి (ప్రకృతిపురుష వివేకము) జనించునంతవఱకే కారణము ప్రవర్తించును. కాని పిమ్మట ప్రవర్తింపదు. ఈ విషయము ముందు నిరూపింపబడును. వేద విహితములగు కర్మలు స్వల్పమగు దుఃఖసంబంధము కలవయినను ఉత్కృష్ట సుఖహేతువులగుటవలన ప్రశస్తములు. ప్రకృతి పురుష వివేకము ఆ కర్మలకన్నను మంచిదగుటవలన శ్రేష్ఠమయినది. ఈ వివేకజ్ఞానము, వ్యక్తావ్యక్తజ్ఞ విజ్ఞానమువలన గలుగుచున్నది. వ్యక్తమన కార్యరూపమగు ప్రపంచము. అవ్యక్తమన కారణరూపమగు ప్రకృతి. జ్ఞ డన

పురుషుఁడు. ఇట కార్యరూపమగు వ్యక్తవిజ్ఞానము వలన కారణ రూపమగు నవ్యక్తవిజ్ఞానము కలుగును. వ్యక్తావ్యక్తములు రెండును పరార్థము లగుటవలన ఈ రెండిటి విజ్ఞానమునుబట్టి పీనికన్నను పరుఁడగు పురుషుని విజ్ఞానము కలుగును. ఈవిషయ మునే "వ్యక్తావ్యక్తజ్ఞ విజ్ఞానాత్" అను పదమునందలి క్రమము బోధించుచున్నది. అనగా శ్రుతి, స్మృతి, పురాణేతిహాసముల వలన వ్యక్తావ్యక్త పురుషులను తెలిసికొని, యుక్తులచే వానిని దృఢముగ బరిశీలించినవానికి చిరకాలము శుశ్రూషచే సేవింప బడిన సద్గురువుల శాస్త్రోపదేశమువలన నట్టి సత్యపురుష వివేకజ్ఞానము లభించును. ఇట ధర్మమన భావనారూపము (శాస్త్రార్థ మననరూపము) అని యెఱుంగునది. ఈ జ్ఞానోత్పని 64 వ కారికయందు మూలకారులే నిరూపించుచున్నారు.

ఇట్లు బుద్ధిమంతుల కపేక్షిత మగుటచే శాస్త్రారంభ మును సమర్థించి శిష్యుల బుద్ధి నిలకడగ నుండుట కీ శాస్త్రార్థ మును సంగ్రహముగ నిరూపించుచున్నాడు.

శ్లో॥ మూలప్రకృతి రవికృతిః మహదాద్యాః ప్రకృతి వికృతయస్సప్త। షోడశకస్తు వికారో నప్రకృతిర్న వికృతిః పురుషః॥ 3

ఈ శాస్త్రమునందు కేవల ప్రకృతిరూపము, కేవల వికృతిరూపము, ప్రకృతి వికృతిరూపము, ఈ మూటికన్నను విలక్షణము, అని పదార్థములు నాలుగు విధములుగ నున్నవి. ప్రకరోతి అను వ్యుత్పత్తినిబట్టి జగన్నిర్మాణమును చేయునదియు,

సత్త్వరజస్తమో గుణములయొక్క సామావస్థా రూపమును అగు ప్రధానమే మూలప్రకృతి యనబడును. అది అవికృతిః- ఎన్నడును కార్యము కానేరదు. మహత్తత్త్వము (బుద్ధి) అహంకారము, పంచతన్మాత్రలు అను నీ యేడును, ప్రకృతి రూపములు, వికృతి రూపములు నగుచున్నవి. పంచమహా భూతములు, ఏకాదశేంద్రియములు, అను నీ పదునాఱును వికారములే యగుచున్నవి. పురుషు డీ మూటికన్నను వేఱు. అనగా ప్రకృతికాని, వికృతికాని, ప్రకృతివికృతిరూపుడుకాని కానేరడు. ఇట మూలప్రకృతిః అనుటవలన ప్రధానము కారణమే కాని కార్యముకాదనుట కొకయుక్తి సూచింపబడినది. ప్రపంచమునకు ప్రధానమే మూలము. దానికి మూలము లేదు. దానికింకొక మూలము నంగీకరించినచో అనవస్థ సంభవించునని భావము. మహత్తత్త్వము ప్రధానమునకు వికృతియు, నహంకారమునకు ప్రకృతియు నగుచున్నది కాన ప్రకృతి వికృతిరూప మగుచున్నది. ఇట్లే యహంకారము ఇంద్రియములకును, పంచతన్మాత్రములకును ప్రకృతియు, మహత్తత్త్వమునకు వికృతియు నగుచున్నది. అహంకారముయొక్క వికృతులగు పంచతన్మాత్రలు మహాభూతములకు ప్రకృతు లగుచున్నవి. కాన నీ యేడును ప్రకృతి వికృతు లనబడుచున్నవి. పంచమహా భూతములును, ఏకాదశేంద్రియములును మొత్తము ఈ పదునాఱును వికృతులే కాని ప్రకృతులు కాజాలవు. తన్మాత్రలన రూప, రస, గంధ, స్పర్శ, శబ్దములు. వీనినే భూతసూక్ష్మము లందురు. పృథివ్యాది భూతములవలన గోవులు, వృక్షములు,

మున్నగు వికారములు పుట్టుచున్నవి. వానివలన పయో బీజాది రూప వికారములును, వానివలన దధ్యంకురాది రూప వికారములును అగపడుచున్నవి గదా! ఇవియు ప్రకృతులే ల కావు? అని శంకింపరాదు. మీరు చూపినవన్నియు పృథివి కన్న విలక్షణములు కానేరవు. వీనికిని పృథివికివలె స్థౌల్యము, ఇంద్రియగ్రాహ్యత్వమును సమానములే యగుచున్నవి. ప్రకృతి వికృతి భావము విలక్షణములగు వానికే యుండునని మా యభిప్రాయము. పురుషుడు ప్రకృతికాని, వికృతికాని, కానేరడు' ఈ విషయము ముందు స్పష్టముగ నిరూపింపబడును...

ఈ విషయము ప్రమాణసిద్ధమని నిరూపింపవలయును. అందుకు ముందుగ ప్రమాణముల నిరూపింపవలసి యున్నది. కాన ప్రమాణముల నిట నిరూపించుచున్నాడు.

శ్లో॥ దృష్టమనుమాన మాప్తవచనంచ సర్వప్రమాణసిద్ధత్వాత్ ।
త్రివిధం ప్రమాణమిష్టం ప్రమేయ సిద్ధిః ప్రమాణాద్ధి॥ 4

ఇట 'ప్రమాణం' అని చెప్పుటవలన ప్రమను బుట్టించు నది ప్రమాణమని, ప్రమాణ సామాన్యలక్షణము చెప్పబడి నది. కాన నిక ప్రమాణ విశేషములకు విశేష లక్షణముల జెప్పనచ్చును. ప్రత్యక్షము, అనుమానము, శబ్దము అని మూడు ప్రమాణములు. ఉపమానము మున్నగునవి వీనిలో నంతర్భూతములే యగును. కాన నింతకన్న నధికముగ ప్రమాణముల నంగీకరింప బనిలేదు. విషయములకును ఇంద్రి యములకును బరస్పర సంబంధమువలన కాని, వ్యాప్తిజ్ఞానా

దులవలన కాని, పుట్టిన చిత్తవృత్తికి ప్రమాణమని పేరు. ఈ చిత్త వృత్తికిని పురుషునకును గల సంబంధమే ప్రమ యనబడును. ఈ సంబంధ మా చిత్తవృత్తివలన గలుగుచున్నది. కాన దీనిని ప్రమాణఫలమగు ప్రమ యందురు. ఈ చిత్తవృత్తి అసందిగ్ధము అవిపర్యస్తము అజ్ఞాతార్థ విషయకమును, అగునపుడే ప్రమాణ మనబడును. కాన సంశయమునకును, భ్రమకును, స్మృతికిని సాధనములగు వానియందీ ప్రమాణ వ్యవహారము లేదు. ఇట "త్రివిధమ్" అనుటవలన ప్రమాణములు హెచ్చని కాని, తక్కువ యని కాని చెప్పుటకు వీలులేదు.

ఇతర దర్శనకర్తలు ప్రమాణములు నాలుగనియు, ఆఱనియు చెప్పుచున్నారు. కాన మీరుచేసిన నిర్ణయ మెట్లు పొసగును? అని శంకింపరాదు. ఇతర దర్శనకర్తలు ప్రమాణ ములని నిర్ణయించిన ఉపమానాదులీ మూడిటిలోనే చేరును. కాన మా నిర్ణయ ముపపన్నము కావచ్చును. ఈ విషయమే "సర్వప్రమాణ సిద్ధత్వాత్" అను కారికా భాగము వలన చెప్పబడినది. సర్వప్రమాణములు వీనిలో సిద్ధములు – అంత ర్భూతములు అని ఆ వాక్యమున కర్థము.

ప్రమేయ నిరూపణమునకు బయలుదేరిన శాస్త్ర మీ ప్రమాణములను నిరూపించుట యెందులకు? అను శంకకు ప్రమేయముల సిద్ధి ప్రమాణాధీనము అని సమాధానము. ఈ కారికయం దర్థక్రమమునుబట్టి "త్రివిధం ప్రమాణమిష్టమ్" అనునది తొలుత వివరింపబడినది.

ఇక ప్రమాణవిశేషము నిరూపింపబడును. వాని లో వాదులందఱిచే నంగీకరింపబడుటవలనను, సర్వ ప్రమాణముల కును సహకారి యగుటవలనను మొదటి దగుటవలనను ప్రత్యక్ష ప్రమాణము తొలుత నిరూపింపబడుచున్నది.

శ్లో॥ ప్రతివిషయాధ్యవసాయో దృష్టం, త్రివిధమనుమానమ్ ।
తల్లింగలింగి పూర్వమాప్త శ్రుతి రాప్తవచనంతు॥ 5॥

"దృష్టమ్" అను పదముచే లక్ష్యమగు ప్రత్యక్షము చెప్పబడినది. "ప్రతివిషయాధ్యవసాయః" అనునది లక్షణమును చెప్పుచున్నది. సజాతీయములు, విజాతీయములు నగు ఇతర పదార్థములకన్న వేఱుగ లక్ష్యమును నిరూపించునది లక్షణము. "విశిణ్వంతీతి విషయాః" అను వ్యుత్పత్తినిబట్టి జ్ఞానమందు తమ రూపమును సమర్పించి ఆజ్ఞానమున కాకారమును గల్పించునవి అని యర్థము. పృథివి మున్నగునవి విషయములు. మనకు గోచరింపని పరమాణువులు మున్నగు సూక్ష్మవస్తువులు యోగులకు గోచరించును కాన నవియు విషయములే యగుచున్నవి. ప్రతివిషయము తోడను సంబంధము కలదగుటవలన నింద్రియమే యిట ప్రతివిషయ శబ్దముచే జెప్పబడుచున్నది. ఇంద్రియములకును విషయములకును ఉండెడి సంబంధము వృత్తిరూపము. కాగా విషయసంబద్ధమగు నింద్రియమని అర్థము. అట్లు విషయేంద్రియ సంబంధమువలన అంతఃకరణవృత్తి రూపమగు జ్ఞాన ముదయించును. ఇట్లు వృత్తిరూపమగు జ్ఞాన ముదయించిన పిమ్మట ఈ వృత్తివలన బుద్ధియందలి తమోగుణము తిరోహితమగును. పిమ్మట కలిగిన సత్త్వగుణము

సొక్క విశాసము అధ్యవసాయ మనబడును. దీనినే వృత్తి యనియు, జ్ఞానమనియు చెప్పెదురు. ఈ అధ్యవసాయమే సాంఖ్య మతమున ప్రత్యక్ష ప్రమాణ మనబడును. ఈ యధ్యవసాయ ముతో పురుషునకు గలిగిన తాత్కాలిక సంబంధమే ప్రమ యనబడును. అట్టి ప్రమను పుట్టించుటలో, నధ్యవసాయము నకు పురుషసాన్నిధ్యము వ్యాపారమగుచున్నది. ఇట్టి యధ్యవ సాయము ప్రమాకరణమై ప్రమాణ మగుచున్నది. బుద్ధి ప్రకృతి కార్య మగుటవలన నచేతనము. ఇట్లే బుద్ధికార్యమగు నధ్యవ సాయమును, సుఖాదులు గూడ నచేతనములే యగుచున్నవి. నిజమగు సుఖాదిసంబంధములేని పురుషుడు చేతనుడు. ఈ చేత నుడు బుద్ధియందు ప్రతిఫలించి బుద్ధిస్వరూపమును పొందు చున్నాడు. కావుననే బుద్ధియందుండెడి జ్ఞానసుఖాదులను తనవానినిగ భావించును. ఇట్లు బుద్ధికి చేతనునితో తాత్కా లిక సంబంధము కలుగుచుండును. దీనినే చేతనానుగ్రహ మందురు. పురుష సంబంధము వలన నచేతనమగు బుద్ధియు, నధ్యవసాయమును, చేతనములవలె భాసించుచున్నవి. ఈ విషయ మిఱువదవ కారికయందు జెప్పబడినది. ఇట నధ్యవ సాయ మనుటవలన సంశయము నిరాకరింపబడినది. భ్రమ అసద్విషయకముకాని సద్విషయకము కానేరదు. ప్రతి అను దానివలన ప్రత్యక్షమునం దింద్రియార్థ సంబంధ మవసరమని సూచించుటచే అనుమానాదులు నిరాకరింపబడు చున్నవి. అనుమానాదులందు నింద్రియార్థ సంబంధ మక్కరలేదు. ఇట్లు సమాన జాతీయములగు అనుమానాదుల కన్నను, అసమాన

జాతీయములగు ఘటాదుల కన్నను ప్రత్యక్షము వేఱని దెలుపుటవలన "ప్రతివిషయాధ్యవసాయః" అనునది ప్రత్యక్ష లక్షణ మగుచున్నది.

ఇక ననుమానమును బరిశీలింతము. ఈ అనుమానము ప్రమాణము కానేరదని చార్వాకు లనుచున్నారు. కాని వీరి మతమున తాను చెప్పినదానిని పరుడు తెలిసికొనలేదని కాని, విరుద్ధముగ తెలిసికొనుచున్నాడని కాని, సంశయించుచున్నాడని కాని వీరికి తెలియు టెట్లు? పరుని సంశయాదులు మనవంటి వారికి ప్రత్యక్షగోచరములు కావుగదా! మఱియొక తీరున తెలిసిన ననుటకు వీరికి మఱియొక ప్రమాణమే లేదుగదా! పరుని సంశయాదుల దెలిసికొనక వానితో ప్రసంగించిన, వాని మాటలను ఉన్మత్తుని మాటలనువలె నెవ్వరును విశ్వసింపరుగదా! కాగా పరుని చేష్టలనుబట్టి కాని, మాటలనుబట్టి కాని పరుని యజ్ఞానము మున్నగువానిని మనము తెలిసికొనుచున్నారము. కాన అనుమానము ప్రమాణమనియే చెప్పవలయును. ఇట్లు ప్రమాణమును ప్రత్యక్షకార్యమును అగు ననుమానమునకు లక్షణము "లింగలింగి పూర్వకమ్" అని చెప్పబడినది. లింగ మన వ్యాప్యము. లింగి యన వ్యాపకము. వ్యాప్యమన వ్యాప్తి కలది. వ్యాప్తియన నిరూపాధికమగు సంబంధము; స్వాభావిక సంబంధమని భావము. దేనితో నీ వ్యాప్యమునకు స్వాభావికమగు సంబంధ ముండునో అది వ్యాపకము. వహ్నిధూమములలో ధూమము వ్యాప్యమును, వహ్ని వ్యాపకమును అగుచున్నవి. ఇట విషయమును బోధించెడి లింగలింగి శబ్దము

లచే లింగలింగి జ్ఞానమును గ్రహింపవలయును. అనగా వహ్ని వ్యాప్యము ధూమము, అను వ్యాప్తిజ్ఞానమును గ్రహింప వలయును. లింగలింగి పూర్వకమ్ అను పదమునకు లింగిచ, లింగిచ, లింగినీ - లింగంచ - లింగినీచ - లింగలింగిని, లింగ లింగీని పూర్వం యస్యతత్ - లింగలింగిపూర్వకమ్, అని విగ్ర హమును చెప్పవలయును. ఇట రెండవ లింగిపదము పక్ష సంబంధ జ్ఞానమును చెప్పెను. కాగా వ్యాప్తి పక్షసంబంధముల యొక్క జ్ఞానము మూలముగాకలది అనుమానమని సామాన్య లక్షణము సిద్ధించుచున్నది. ఈ అనుమానము, పూర్వవత్తనియు, శేషవత్తనియు, సామాన్యతోదృష్టమనియు త్రివిధము. మఱియొక తీరునగూడ విభజింపవచ్చును. వీత మనియు, అవీత మనియు, అనుమానము ద్వివిధము. అనగా అన్వయవ్యాప్తి అనియు, వ్యతిరేకవ్యాప్తి అనియు, వ్యాప్తి ద్వివిధము. సాధ్య సాధనముల కుండెడి వ్యాప్తి అన్వయవ్యాప్తి. సాధ్యాభావ సాధనాభావముల కుండెడి వ్యాప్తి వ్యతిరేకవ్యాప్తి. కాగా అన్వయవ్యాప్తితో గూడినదియు, ఇతర ప్రమాణమువలన దెలియని భావరూపమగు విషయమును బోధించునదియు నగు అనుమానము వీతానుమానము. వ్యతిరేకవ్యాప్తితో గూడి నదియు, ఇతర ప్రమాణములవలన దెలియని అభావరూపమగు విషయమును బోధించునదియు నగు అనుమానము అవీతాను మానము. ఈ అవీతానుమానమే శేషవత్తనబడును. శేషమన పరిశేషము. మిగులునదని భావము. అట్టి శేషము విషయముగా కలదికాన శేషవత్తగుచున్నది. పరిశేషానుమానమని భావము.

అనగా నొక పదార్థము కొన్నిటిలో దేనియందున్నదను సందే
హము కలిగినప్పుడు, ఆ కొన్నిటిలో జేరినవానిలో కొన్నిటి
యందా పదార్థము లేదని చెప్పగనే, మిగిలినది పరిశేష మన
బడును. ఆ పరిశేషము విషయముగాకలది శేషవత్తని భావము.
వీతానుమానము పూర్వవత్తనియు, సామాన్యతోదృష్టమనియు
ద్వివిధ మగుచున్నది. ఇదివఱకు మఱియొక చోటున జూడ
బడిన వస్తువునకు సజాతీయమగు వస్తువును గోచరించెడి (తెలియ
జేయునట్టి) అనుమానము పూర్వవత్తగును. పూర్వమెన్నడును
జూడబడని వస్తువునకు సజాతీయమగు వస్తువును గోచరించెడి
అనుమానము సామాన్యతోదృష్ట మనబడును. పూర్వము
పాకశాలయం దగపడిన వహ్నికి సజాతీయమగు వహ్నిని పర్వత
మందు గోచరించెడి అనుమానము పూర్వవత్తగును. రూపా
దుల జ్ఞానమువలన చక్షురాదీంద్రియముల నూహించుట
సామాన్యతోదృష్టానుమానము. రూపాదిజ్ఞానములు క్రియలు
కాన వీటికొక సాధన ముండవలయును. లోకమున క్రియా
సాధనములలో కొన్ని మనకు ప్రత్యక్షము లగుచున్నవి. ఛేదన
క్రియకు సాధనములగు గొడ్డలి మున్నగునవి ప్రత్యక్షము లగు
చున్నవి. కాని రూపజ్ఞానము మున్నగు క్రియలకు సాధనము
లగు ఇంద్రియములు మాత్రము మనకు ప్రత్యక్షములు కాలేదు.
అయినను ఛేదనాది క్రియలందు సామాన్యముగ సాధనాపేక్ష
దృష్టమగుటవలన, దీనినిబట్టి మన కగపడని ఇంద్రియములను
జ్ఞానాది క్రియాసాధనములుగ నూహించుట సామాన్యతో
దృష్టము. పూర్వవత్తు, సామాన్యతోదృష్టము అను నీరెండును

పేతము చే అయినను పూర్వవత్తునందు సాధ్యసాధనములు మఱి యొక స్థలమున కాలాంతరమునందు మనకు ప్రత్యక్షగోచరము లగుచుండును. సామాన్యతోదృష్టమందు మాత్రము సాధ్య సాధనములలో సాధ్యమెన్నడును మన కగపడదు. ఇదియే యీ రెంటికిని గల భేదము. ఈ విషయము న్యాయవార్తిక తాత్పర్యటీకలో వాచస్పతిచే విపులముగ నిరూపింపబడినది.

ప్రేరకుడగు పెద్దవానిమాటను విని యువకుడు ప్రవర్తించును. ఈ యువకప్రవృత్తినిబట్టి యీ ప్రవృత్తికి ప్రేరకుని వాక్యమునవలన గలిగిన జ్ఞానము కారణమని ప్రక్కనున్న మఱియొక డూహించుచున్నాడు. కాగా పదపదార్థ సంబంధ జ్ఞానము అనుమాన మూలకము. ఈపదపదార్థసంబంధ జ్ఞానము లేనివానికి శబ్దములను వినుచున్నను అర్థము తెలియదు. కాన అనుమానమును నిరూపించినపిమ్మట శబ్దము నిరూపింపబడుచున్నది.

"ఆప్తశ్రుతి రాప్తవచనమ్" అనునెడ ఆప్తవచనమ్ అనునది లక్ష్యము. ఆప్తశ్రుతిః అనునది లక్షణము. ఆప్తమైన శ్రుతియని అర్థము. ఇక్కడ వాక్యమువలన బుట్టిన వాక్యార్థజ్ఞానమే శ్రుతి యనబడును. ఇది అపౌరుషేయమగు వేదవాక్యమువలన బుట్టినందున సకలదోష శంకారహితము. కాన ఈ వాక్యార్థజ్ఞానము సహజముగనే ప్రమాణ మగుచున్నది. ఇట్లే వేద మూలకములగు స్మృతి పురాణేతిహాసముల వలన గలిగిన వాక్యార్థజ్ఞానమును ప్రమాణమే యగుచున్నది. మొదటి విద్వాంసుడగు కపిలునకు సృష్ట్యాదియందు

మునుపటి కల్పమం దధ్యయనము చేయబడిన శ్రుతులు నిదుర నుండి మేల్కాంచువానికి గతదిన వృత్తాంతము జ్ఞప్తికి వచ్చు నట్లు జ్ఞప్తికివచ్చును. కల్పాంతర వృత్తాంత మీ కల్పమున స్మరింపబడు నను విషయము మహాభారతమునం దవజ్య జైగీషవ్య సంవాదమున స్పష్టముగ జెప్పబడినది. ఇట "నాప్త శ్రుతిః" అనుటవలన ననాప్తులగు బౌద్ధాదులచే రచింపబడిన ఆగమాభాసములు పరిహృతము లగుచున్నవి. ఈ బౌద్ధా ద్యాగమములు పరస్పర విరుద్ధము లగుటవలనను, నిర్మూలము లగుటవలనను, ప్రమాణ విరుద్ధమగు విషయమును బోధించుట వలనను, మందప్రజ్ఞులు దురాచారపరులగు కొందఱిచేతనే ఆద రింపబడుట వలనను ఆభాసములే యగుచున్నవి.

ఆప్తవచనము అనుమానముకన్న భిన్నమే యగు చున్నది. వాక్యమునకు వాక్యార్థము విషయము. అనగా వాక్యమువలన గలిగిన వాక్యార్థజ్ఞానము విలక్షణము. ధూమము వహ్నిధర్మమయినట్లు వాక్యము వాక్యార్థమునకు ధర్మము కానేరదు. కాన వాక్యార్థజ్ఞానమును అనుమాన మను టకు వీలులేదు. మఱియు అవినాభావ సంబంధమును బట్టి ధూమము వహ్నికనుమాపక మయినట్లు వాక్యము వాక్యార్థ మును బోధించునపుడు అట్టి నియత సంబంధము నపేక్షింపదు. లోకమున కవులు మనమెన్నడును చూడనట్టియు, చూచు టకు వీలు లేనట్టియు వస్తువులను వర్ణించుచుందురుగదా! అట్టి యెడ వాక్యవాక్యార్థసంబంధము మనకు తెలియుచున్నదిగదా! అది యెట్లు పొసగును?

ఇట్లు మూడు ప్రమాణములును నిరూపింపబడినవి. ఇక శాస్త్రాంతరములందు నిరూపింపబడిన ఉపమానాదు లీ మూడిటిలోనే అంతర్భావమును పొందునను విషయము నిరూపింపబడును.

తంత్రాంతరములం దుపమాన మిట్లు నిరూపింపబడినది. గవయపదమున కర్థము నెఱుగని గ్రామీణుడు, గవయపదమున కర్థమేమి? అని ఆటవికుని ప్రశ్నించును. "గోవువలె నుండునది గవయపదార్థము" అని ఆటవికుడు బదులు చెప్పెను. ఈ ఆటవికుని మాటవలన గ్రామీణునకు "గవయపదార్థము గోసదృశము" అను జ్ఞానము కలుగును. పిమ్మట గ్రామీణుడు అడవికిపోయి గోవువంటి జంతువును చూచును. అప్పు డాటవికుడు చెప్పినమాటను దాని యర్థమును జ్ఞాపకము చేసికొనును. పిమ్మట ఇది గవయపదార్థమని నిశ్చయించుకొనును. ఇందు ఆటవికుని మాట వినునప్పుడు కలిగిన వాక్యార్థజ్ఞానము ఉపమానము. గోసదృశమగు దానిని జూచినపుడు కలిగిన యాటవిక వాక్యార్థస్మరణము వ్యాపారము. చివరకు గలిగిన "ఇది గవయపదార్థము" అను నిశ్చయమే ఉపమితి. ఇం దాటవికుని వాక్యమువలన గలిగిన మొదటిజ్ఞానము శాబ్దమే యగుచున్నది. చివరకు గలిగిన మూడవజ్ఞానము అనుమితి రూప మగుచున్నది. పెద్దలచే గోవునందు వాడబడు గోశబ్దము ఎట్లు గోవునకు వాచకమో అట్లే గవయశబ్దము గోసదృశమునందే వాడబడుటచే గోసదృశమునకు వాచకమను విషయము అనుమానము వలన సిద్ధించుచున్నది. ఇక గ్రామీణు డడవికి

పోయి గవయమును చూచునపుడు కలిగిన "ఇది గోసదృశము" అను జ్ఞానము ప్రత్యక్షమే యగుచున్నది. ఇట్లే అపుడు స్మరింపబడెడి గోవునందు ఈ గవయ సాదృశ్యజ్ఞానమును ప్రత్యక్షమే యగుచున్నది. సాదృశ్యమన నొకదానియందుండెడి మఱియొక వస్తువుయొక్క అవయవ సామాన్య సంబంధము. ఈ సంబంధము రెండిటియందును ఒక్కటియేగాన గవయమునందు ప్రత్యక్షమగుటవలన గోవునందును ప్రత్యక్షమే యగును. కాగా ఉపమానమునకు చేయదగిన విశేషకార్యము లేదు. కాన ఉపమానము స్వతంత్రప్రమాణము కానేరదు.

ఇక అర్థాపత్తిని విచారింతము. అర్థాపత్తి యన నొక యర్థమువలన నింకొక యర్థమును గల్పించుట. జీవించిన దేవదత్తుడు గృహమందు కాని మఱియొకతావున కాని యుండవలయును. కాగా గృహమందు లేకపోయినపుడు బయట నున్నాడని మనము నిర్ణయింతుము. ఈ గృహమందు లేకపోవుట, బయట నుండుటకు గల్పకమగుచున్నది. ఇట్లు గృహాసత్త్వ, బహిస్సత్త్వముల కుండెడి కల్ప్య కల్పక భావమునే అర్థాపత్తి యని మీమాంసకు లనుచున్నారు. కాని యీ యర్థాపత్తి అనుమానమే యగుచున్నది. వస్తువు నశింపకముందు ఒకచోటున లేనపుడు మఱియొకచోటునం దుండి తీరవలయును. ఈ విషయము మన శరీరమునందే ప్రత్యక్షమగుచున్నది. కాగా దేవదత్తుని గృహాసత్త్వమే బహిస్సత్త్వమునకు లింగ మగుచున్నది. ఈ గృహాసత్త్వ బహిస్సత్త్వములకు విరోధము లేదు. కాన వీనిలో నొకటి మఱియొకదానిని బాధింపదు. అందువలన

గృహాసత్త్వము బహిస్సత్త్వమునకు లింగమగునపుడు సద్ధేతువే యగును కాని హేత్వాభాసము కానేరదు. సర్వలోకసిద్ధమగు సత్త్వాసత్త్వ విరోధ మెట్లు వారింపబడు ననుటయు యుక్తము కాదు. కేవల సత్త్వాసత్త్వములకు విరోధమున్నను, గృహాసత్త్వ బహిస్సత్త్వములకు మాత్రము విరోధము లేదు.

అభావబుద్ధి ప్రతియోగి జ్ఞానము నపేక్షించుట సహజము. కాన చైత్రుడు గృహమందు లేడను నిషేధము చైత్రుని సత్త నపేక్షించును. కాగా చైత్రుని దేశసామాన్య సత్తలో నొకప్పుడు గృహసత్తయు జేరవచ్చును. కాన గృహసత్తకు గృహాసత్తకును విరోధము తప్పదు. అప్పుడు మీ గృహాసత్త్వ హేతువు ఆభాసము కాదా? అని శంకింపదగదు. ప్రత్యక్ష ప్రమాణముచే చైత్రునకు గృహాసత్త్వము నిశ్చితమయినది. ఇట్లు ప్రామాణికమగు గృహాసత్త్వము సాక్షికమగు గృహసత్త్వముచే నెట్లు ప్రతిషేధింపబడును. ఇట్లే ప్రామాణికమగు గృహాసత్త్వము గృహసత్త్వమును నిషేధించినను, దేశాంతరసత్తను కాని, చైత్రసత్తయందు సంశయమును కాని నిషేధింపదు. గృహాసత్త్వ, గృహసత్త్వములకు విరోధమున్నది కాన, గృహాసత్త్వము గృహసత్తను నిషేధించినను సత్తాసామాన్యమును నిషేధింపదు. కాన గృహాసత్త్వహేతువువలన బహిస్సత్త్వము అనుమితము కావచ్చును.

రెండు ప్రమాణములకు విరోధమువలన ప్రామాణ్యభంగము ప్రసక్తమయినపుడు అర్థాపత్తి ఆప్రమాణముల విరోధమును దొలగించి ఆ ప్రమాణములకు ప్రామాణ్యమును

స్థిరపఱుచును. ఎట్లన చైత్రునికి గృహాసత్త్వము ప్రత్యక్ష ప్రమాణ సిద్ధము. చైత్రునికి సత్త్వము, ఆగమ ప్రమాణసిద్ధము. ఇట్లే గృహాసత్త్వ సత్త్వములను గోచరించెడి రెండు ప్రమాణము లకును బరస్పర విరోధమువలన ప్రామాణ్యము భగ్నము కాజాలసిరాగా, అర్థాపత్తి ప్రత్యక్షమునకు గృహాసత్త్వమును, ఆగమమునకు బహిస్సత్త్వమును, విషయములుగ విభజించి వాని విరోధమును దొలఁగించునని కొందఱనుచున్నారు.

కాని వీరివాదము సరికాదు. ప్రత్యక్షము గృహాసత్త్వ మును మాత్రము గోచరించు చున్నది. ఆగమము సత్తను బోధించు చున్నది. కేవల సత్తకును, గృహాసత్త్వమునకును విషయభేద ముండుటవలన విరోధమే లేదు. కాన నర్థాపత్తిచే ప్రమాణ విరోధము పరిహరింపబడ నవసరము లేదు. ఇట్లే అర్థా పత్తికి గల ఉదాహరణము లన్నియు ననుమానమునం దంతర్భూ తములే యగును గాన నర్థాపత్తిని మరియొక ప్రమాణ మన నక్కఱ లేదు.

అనుపబ్ధి ప్రమాణాంతరమని కొందఱనుచున్నారు. ప్రత్యక్షానుమానాగమములు, భావపదార్థమును గోచరించు ననియు అనుపలబ్ధి అభావమును గోచరించుననియు వీరి అభి ప్రాయము. కాని అభావమనునది భావముకన్న వేఱగు పదార్థము కానేరదు. చైతన్యముతక్క మిగిలిన పదార్థము లన్నియు ప్రతిక్షణమునను మాఱుచుండును. కాగా భూతల మందలి ఘటాభావము కేవల భూతలముకన్న వేఱు కానేరదు. ఇట్లే దేనియందుండెడి అభావము ఆ యాశ్రయరూపమే యగు

చున్నది. అనగా అభావము భావముకన్న నతిరిక్తముగ లేదని భావము. ఆశ్రయము ప్రత్యక్షాది ప్రమాణ గోచరమే యగు చున్నది కాన, అభావప్రమకు సాధనముగ ననుపలబ్ధిని ప్రమాణముగ నంగీకరింప బనిలేదు.

కొందఱు సంభవమును ప్రమాణ మనుచున్నారు. సంభవ మనగా ననేక పర్యాయములు చూచుటవలన కలిగిన జ్ఞానము. దీనివలన నూఱురూపాయ లున్నవానివద్ద ఏబది రూప్యము లుండవచ్చును. నూటిలో నేబది ఇమిడి ఉన్నది కదా! అను జ్ఞానము కలుగును. ఇదియు ననుమానమునందే యంతర్భూతము కావచ్చును. ఇట్లే ఐతిహ్యమును శబ్ద ప్రమాణాంతర్గత మగుటవలన వేఱు ప్రమాణ మనుట సరికాదు. ఈ ఐతిహ్యము ఆప్తుడగు వక్త సిద్ధించిననే ప్రమాణము. లేనినాడు అప్రమాణమే యగుచున్నది.

ఇట్లు వ్యక్తావ్యక్తజ్ఞ రూపమగు ప్రమేయముయొక్క సిద్ధి కనువగు ప్రమాణములు చూపబడినవి. వీనిలో వ్యక్తము లగు పృథివ్యాదులు మన కందఱకును చక్షుర్గోచరము లగు చున్నవి. దూరమునం దుండెడి వహ్న్యాదులు ధూమాది హేతుగమ్యము లగుచున్నవి. కాన వానిని బోధించుటవలన శాస్త్రమునకు తగిన ఫలము సిద్ధింపదు. దుర్బోధమగు విషయ మునే శాస్త్రము బోధింపవలయును. కాన సామాన్యముగ ప్రమాణములను వానికి గోచరమగు విషయమును బోధించి యీ శాస్త్రమువలన దెలిసికొన దగినట్టియు, ప్రత్యక్షాను

మానములకు గోచరము కానట్టియు విషయమును స్పష్టముగ చెప్పుచున్నాడు....

శ్లో॥ సామాన్యతస్తు దృష్టాదతీంద్రియాణాం ప్రతీతి రనుమానాత్। తస్మాదపిచాసిద్ధం పరోక్షమాప్తాగ మాత్సిద్ధమ్॥ 6

సామాన్యతో దృష్టాను మానమువలన, అతీంద్రియములగు ప్రధాన పురుష తన్మాత్రములు గ్రహింపబడును. వ్యాప్తి జ్ఞానమువలన గలిగిన అధ్యవసాయరూపమయిన బుద్ధి వృత్తికి, అనుమానమని పేరు. ఆ బుద్ధివృత్తియందు పురుషుడు ప్రతిబింబించును. దానినే యనుమితి యందురు. మఱియు పరిశేషానుమానము వలనను ఈ అతీంద్రియములు గ్రహింపబడవచ్చును. పైని చెప్పబడిన రెండురకముల యనుమానములు ప్రవర్తింపని మహత్త్వము మున్నగువాని సృష్టిక్రమమందును, స్వర్గసాధనమగు అపూర్వము (పుణ్యము) నందును, దేవతావిశేషములందును, ఆగమము ప్రవర్తించును. కాన ననుమాన సిద్ధములు కాని వస్తువులసిద్ధి ఆగమమువలన గలుగునని యెఱుంగునది.

గగనకుసుమము, శశవిషాణము, ప్రత్యక్షానుమాన సిద్ధములు కానందున అవి లేవని యెట్లు నిశ్చయించుచుంటిమో అట్లే మీరు చెప్పిన స్వర్గాపూర్వము మున్నగునవియు లేవని యేల చెప్పరాదు? అను శంక కిట్లు సమాధానమును చెప్పవలయును.

శ్లో॥ అతిదూరాత్సామీప్యా దింద్రియ ఘాతాన్మనోఽనవస్థానాత్। సౌక్ష్మ్యాద్వ్యవధానాదభి భవాత్సమాభిహారాచ్చ॥ 7

"అనుపలబ్ధిః" అను ముందు కారికలోని పదమున కిట అన్వయము చేయవలయును. ఆకాశమునందు దూరమున నెగురుచున్న పక్షి మన కగపడుటలేదు. ఇట్లే మన కంటిలోని కాటుక అతిసామీప్యమువలన మన కగపడుటలేదు. మఱియు నంధత్వము, బధిరత్వము మున్నగు నింద్రియ దోషమువలన మన కా యా యింద్రియమువలన కలుగవలసిన ప్రత్యక్షములు కలుగుటలేదు. మనస్సు కామాంధమగునపుడు మంచి వెలుతురులో నున్న వస్తువులనుగూడ చూడలేదు. శ్రద్ధకలవాడయినను, ఇంద్రియ సంబద్ధములగు పరమాణువులు మున్నగు సూక్ష్మ వస్తువులను జూడలేడు. గోడ మొదలగునవి అడ్డుగా నున్నపుడు ఘటాదులు మనకగుపడవు. మఱియు పగటిపూట సూర్యకాంతిచే తమకాంతి తగ్గిన గ్రహములు మున్నగునవి మన కగపడుట లేదు. తమకు సజాతీయమగు తటాకోదకముతో గలిసిన, వర్షోదక బిందువులును మన కగపడవు. ఈ కారికయందలి చకారము వలన అనభివ్యక్తమగు నదియు ప్రత్యక్షము కాదని చెప్ప వచ్చును. పెఱుగు క్షీరావస్థయం దనభివ్యక్తమగుటవలన మనకు గోచరింపదు. కాగా మన కగుపడకుండినంత మాత్ర మున నా వస్తువు లేదనుట యుక్తము కానేరదు. అట్లయినచో నింటినుండి బయటికి వచ్చువానికి ఇంటిలోని స్వజన మగపడుట లేదు. అంత మాత్రమున నింటిలో స్వజనము లేదని యెవ్వడు నంగీకరింపడు గదా! అనగా ప్రత్యక్షమగుటకు తగిన యవకాశ మున్నపు డేది యగపడదో అది లేదని నిశ్చయించినను సామాన్యముగ నగపడనంత మాత్రమున లేదనుట మాత్రము సరి

కాదు. కాగా ప్రధానపురుషాదులకు ప్రత్యక్షయోగ్యతయే లేనందున ప్రత్యక్షగోచరములు కానంతమాత్రమున నవి లేవనుట సరికాదు. ప్రధానాదులు మన కగపడ కుండుటకు కారణ మేమన,

శ్లో॥ సౌక్ష్మ్యాత్తదనుపలబ్ధిః నాభావాత్కార్యతస్తదుపలబ్ధేః।
మహదాది తచ్చకార్యం ప్రకృతి సరూపం విరూపంచ ॥8॥

అతిసూక్ష్మ మగుటవలన ప్రధాన మింద్రియ గోచరము కాలేదు. అంతియెకాని, ఏడవ రసమువలె అసలే లేనందున నింద్రియ గోచరము కాలేదనుటకు మాత్రము వీలులేదు. పురుషుని విషయమున ప్రమాణమును ముందు చెప్పుచున్నాడు. కాన నిట 'తత్' అను పదమువలన ప్రధానమును మాత్రమే గ్రహింపవలయును. ఏది సరియగు ప్రమాణమువలన సిద్ధించు చున్నదో, అట్టి వస్తు వగపడకుండునపుడు అటప్రత్యక్ష యోగ్యత లేదని చెప్పవలయును. సప్తమ రసము ప్రమాణసిద్ధమే కానం దున నట ప్రత్యక్ష యోగ్యత లేదనుట కవకాశము లేదు. ప్రకృతి కార్యములగు మహదాదులే ప్రకృతికి సాధకము లగుచున్నవి. ఈ విషయము ముందు "భేదానాం పరిణామాత్" అను చోటున నిరూపింపబడును. తత్త్వజ్ఞాన రూపమగు ప్రకృతి పురుష వివేకమున కుపకరించెడి ప్రకృతి సారూప్య వైరూప్య ములు కార్యమం దుండెడివి ముందు నిరూపింప బడును.

కార్యమువలన కారణము దెలియును. కాని ఆకార ణము ప్రకృతియే యనుట యెట్లు? జగత్కారణమునందు

దార్శనికుల కభిప్రాయభేద మగపడుచున్నది. చూడుడు. బౌద్ధులు శూన్యమునుండియే యీ జగత్తు పుట్టుచున్న దను చున్నారు. వేదాంతులీ జగత్తును బ్రహ్మయొక్క వివర్తమను చున్నారు. తార్కికులు సత్తువలన నసత్తగు కార్యము పుట్టు ననుచున్నారు. సత్తువలన సత్తగు కార్యమే పుట్టునని కొంద అనుచున్నారు. ఇందు మొదటి మూడు మతములందును ప్రధానము సిద్ధింపదు. కాని ప్రపంచమునందలి వస్తువు లన్నియు సుఖదుఃఖ మోహాత్మకములు పరిణామము కలవియు నగుచున్నవి. కాన జగత్కారణమును సుఖదుఃఖ మోహాత్మకము పరిణామియు గావలయును. ఈ తీరుపై మూడు వాదములందును సరిపడదు. మొదటిమతమున కార్యకారణములకు లోకసిద్ధమగు తాదాత్మ్యము (ఏకీభావము) సరిపడదు. అసత్తును, నిస్స్వభావమును నగు కారణమునకును, సుఖదుఃఖ మోహాత్మకమగు కార్యమునకును, తాదాత్మ్య మెట్లు పొసగును. ఇక రెండవ మతమునందు అద్వితీయమగు బ్రహ్మవలన ప్రపంచ మెట్లు పుట్టును. నిజముగ బ్రహ్మ జగత్తునకు కారణమగునేని, బ్రహ్మ కద్వితీయత్వ భంగము తప్పదు. మఱియు వీరి మతమున బ్రపంచము సత్యము కాదుగాన సత్తువలన సత్తు పుట్టుననుటయు సరికాదు.

సత్తగు కారణమువలన నసత్తగుకార్యము పుట్టుచున్న దను తార్కిక మతమందును, కార్య కారణముల కేకాత్మకత్వము సరిపడదు. సత్తగు కారణమునకును అసత్తగు కార్యమునకును తాదాత్మ్య మెట్లుండును? కాన ప్రధాన సిద్ధి

కావున సాంఖ్యులకు సత్కార్యవాదము ముందుగ నిరూపింపబడు చున్నది.

శ్లో॥ అసద కరణాదుపాదానగ్రహణా త్సర్వసంభవా భావాత్।
శక్తస్య శక్యకరణాత్కారణ భావాచ్చ సత్కార్యమ్॥ 9॥

కారణవ్యాపారమునకు పూర్వమందును కార్యము సత్తని యంగీకరింప వలయును. తార్కికులు ఉత్పత్తికి పూర్వము కార్యము సత్తని యంగీకరింపరు కాన సిద్ధసాధనమను దోష మున కవకాశము లేదు. లోకమున బీజనాశానంతర మంకురము పుట్టుచున్నది. దీనిని బట్టియే అభావమువలన భావము పుట్టుచున్నదని కొందఱనుచున్నారు. కాని యింత మాత్రమున నభావము కారణమనుట యుక్తము కాదు. బీజావయవమే అంకురమునకు కారణముగాని బీజాభావము కాదు. అట్లగునేని అభావ మంతటను సులభమే యగుటవలన అన్ని కార్యములు అన్ని తావులందును పుట్టవలయును. ఈ విషయము న్యాయవార్తిక తాత్పర్యటీకలో విపులముగ నిరూపింప బడినది. బాధకము లేనినాడు నిజముగ నగపడెడి ప్రపంచమును మిథ్య (అసత్యము) యనుటయు యుక్తము కానేరదు. ఉత్పత్తికి ముందసత్తగుకార్యము ఉత్పత్త్యనంతరము సత్తగుటకు వీలులేదు. ఎంత నేర్పరి అయినను నలుపును తెలుపుచేయ నేరడుగదా. కాగా కార్యము సత్తనియే చెప్పవలయును. సదసత్త్వములు వస్తువుయొక్క ధర్మములు. వస్తువు ధర్మి కాగా ఘటమందు తొలుత అసత్త్వము, పిమ్మట సత్త్వము నుండవచ్చు ననుటయు సరికాదు. ధర్మముల కాశ్రయమగు ధర్మి సిద్ధింప

వలయును. కాగా ఘటమునకు సత్త్వమే సిద్ధించును గాని అసత్త్వము సిద్ధింపదు. ఇట్లు సత్తగు ఘటముతో సంబంధము లేని యసత్త్వమును బట్టి ఘటమునకు అసత్త్వ మెట్లు సిద్ధించును? కాగా కారణ వ్యాపారానంతరమందువలె కారణ వ్యాపారమునకు బూర్వమందును కార్యము సత్తే యగుచున్నది. ఉన్నవస్తువున కభివ్యక్తి లోకసిద్ధము కాన కారణవ్యాపారానంతరము సత్తగు కార్య మభివ్యక్త మగుచున్నది. గానుగ ఆడుటవలన తిలలనుండి తైలము, దంచుటవలన ధాన్యమునుండి బియ్యము, పిదుకుటవలన గోవునుండి పాలును నభివ్యక్తము లగుచున్నవి. అసత్తగునది యభివ్యక్త మగుటకాని, పుట్టుటకాని లేదు. కాన అసత్కార్యవాదమున దృష్టాంతమే దుర్లభమగుచున్నది.

మఱియు కార్యము కారణముతో సంబంధము కలదియే యగుచున్నది. కార్య సంబద్ధమగు కారణమే కార్యమును పుట్టించుచున్నదని భావము. అసత్కార్యవాదమందు అసత్తగు కార్యమునకు సత్తగు కారణమునకును, సంబంధము సరిపడదు. కాన కార్యము సత్తే అనవలయును. మొదట కారణముతో సంబంధము లేకుండనే కార్యము పుట్టును. పిమ్మట కారణముతో సంబంధించును అనుటయు సరికాదు. ఆ పక్షమున సర్వసంభవ ప్రసంగమువచ్చును. అనగా కార్యము దేనితోడను సంబంధము లేని దగుటవలన అన్ని కార్యములును అన్ని కారణముల వలనను పుట్టవలయును. అట్లు పుట్టుట లేనందున కారణముతో సంబద్ధమగు కార్యమునకే ఉత్పత్తినికాని, యభివ్యక్తినికాని అంగీకరింప వలయును. కావుననే "అసత్తగు కార్యమునకు

సత్తగు కారణముతో సంబంధము పొసగదు. కారణ సంబంధము లేకుండగనే కార్యము పుట్టుననుట సరికాదు. ఆపక్షమునం దవ్యవస్థ వచ్చును" అని సాంఖ్యవృద్ధు లనుచున్నారు. కార్య కారణములకు సంబంధము లేకపోయినను ఏ కారణమునకు ఏ కార్యమును పుట్టించు శక్తి కలదో, ఆ కారణము వలననే ఆ కార్యము పుట్టుచుండును. కాన నవ్యవస్థ లేదనుటయు యుక్తము కానేరదు. కారణమం దుండెడి ఆ శక్తి, సర్వకార్యోత్పాదన సమర్థమా? లేక పరిమితములగు కొన్ని కార్యములనే పుట్టించునా? మొదటి పక్షమునం దవ్యవస్థ వారింప బడదు. ఇక రెండవ పక్షమందు ఏకార్యములను పుట్టించుటకు తగినశక్తి కారణమం దుండెనో, ఆ శక్తిలో ఆ కార్యము విషయము కావలయును. కాగా అసత్తు శక్తిలో విషయము కానందున, సత్కార్యవాదనే సిద్ధించుచున్నది. అనగా సత్తగు శక్తికిని అసత్తగు కార్యమునకును సంబంధము సంభవింపదుగాన, శక్తిలో విషయమగు కార్యము సత్తే కావలయునని భావము.

మఱియు కార్యకారణముల కత్యంత భేదము లేదు. కాగా కారణము సత్తని నీవే యంగీకరించితివి. అప్పుడు కారణాభిన్నమగు కార్యమును సత్తే యగును గదా! కార్యకారణముల కభేద మీా క్రిందితీరున నెఱుంగునది.

భిన్నములగు గవాశ్వములకు ధర్మధర్మి భావము లేదు. వస్త్రము తంతువుల ధర్మమగుచున్నది. అనగా తంతువులను విడిచియుండుట లేదు. కావున పటతంతువులకు భేదము లేదు. భిన్నములగు ఘట పటములకు కార్యకారణ భావము లేదు,

పటమునకు తంతువులకును ఉపాదానోపాదేయ (కార్యకారణ) భావము కలదు. కాన కార్యకారణములగు పటతంతువులకు భేదము లేదు. మఱియు భిన్నములగు పదార్థములకు గోలెము నకు పూలమొక్కకువలె సంయోగముకాని, హిమవద్వింధ్యము లకు వలె వ్యవధానముగాని యుండవలయును. స్వతంత్రము లగు పదార్థములకు తాత్కాలికమగు సంబంధము సంయో గము. కాగా తంతుపటములకు సంయోగముగాని వ్యవధా నముగాని లేవు. కాన తంతుపటముల కభేదము నంగీకరింప వలయును.

మఱియు ఎంతబరువుగల నూలుతో వస్త్రమును నిర్మిం తుమో ఆ వస్త్ర మంతటి బరువే కలిగి యుండును. తంతు పటములు భిన్నములే అగునెడల తంతువుల బరువును, వస్త్రము బరువును కలిసి రెండు బరువులగుటవలన అసలు తంతువుల బరువుకన్న తయారయిన వస్త్రముయొక్క బరువు హెచ్చుగా నుండవలయును. అట్లగపడుట లేదు. కాన తంతుపటములకు భేదము లేదు. పైని జూపబడిన వ్యతిరేకవ్యాప్తి మూలక హేతు వులవలన పడుగు పేకగ నేర్పడిన తంతువులకే వస్త్రమని వ్యవహారము కాని, తంతువులకన్న వేఱగువస్త్రము మాత్రము లేదు.

ఇట్లు తంతుపటములకు అభేదము స్పష్టము కాన ప్రతి వాదులచే జూపబడెడి "తంతువులందు పటము పుట్టుచున్నది, నశించుచున్నది." "తంతువుల నాశ్రయించి పటమున్నది" అను ప్రతీతి వ్యవహారము, ఉపయోగము మున్నగు భేద

హేతువులు తంతుపటములకు వాస్తవికమగు భేదమును సాధింప జాలవు. కార్యకారణములకు అభేదమున్నను, ఆవిర్భావ తిరోభావ రూపములగు అవస్థా విశేషములను బట్టి, పై భేద వ్యవహారము, ఉపయోగము, మున్నగున వన్నియును పపన్న ములు కావచ్చును.

లోకమున తాబేటినుండి దాని యవయవము లొక్క ప్పుడు స్పష్టముగ పైకి వచ్చును. మఱియొకప్పుడు లోనికి ముడుచుకొని పోవును. అంతమాత్రమున అవయవములు తాబేటినుండి పుట్టుచున్నవనికాని, నశించుచున్న వనికాని, మన మంగీకరింపము. అట్లే మృత్తునుండి ఘటాదులు, సువర్ణము నుండి కటకాదులు నావిర్భూతము లైనపుడు పుట్టుచున్నవనియు తిరోహితము లైనపుడు నశించుచున్న వనియు వ్యవహారము పపన్నము కావచ్చును. ఇంతియొకాని యసత్తున కుత్పత్తియు, సత్తునకు వినాశమును మాత్రము సంభవింపవు. కావుననే భగవ ద్గీతయందు అసత్తున కుత్పత్తియు, సత్తునకు వినాశమును లేవని వ్యాసమహర్షి చెప్పుచున్నాడు. కాగా కూర్మమెట్లు సంకోచ, వికాసావస్థలు కల తన యవయవముల కన్నను భిన్న మయినది కానేరదో, అట్లే ఘట, కటకాదులును, మృత్తు కన్నను సువర్ణముకన్నను భిన్నములు కానేరవు. కాగా తంతువు లందు పటమున్నదను వ్యవహారము, ఈ వనమందు తిలక వృక్షము లున్నవను వ్యవహారము వంటిది. తిలకవృక్ష సము దాయముకన్న వనమెట్లు భిన్నముకాదో అట్లే తంతుసము దాయము కన్నను పటము వేఱుకానేరదు. అయినను కొలది

భేదమునుబట్టి యీ వ్యవహారములు సిద్ధించు చున్నవి. ఒకే వస్తువు చాలపనుల జేయవచ్చును. ఒకే వహ్ని దాహమును, ప్రకాశమును, పాకమును చేయుచున్నది. కాన క్రియా భేదమును బట్టియు కార్యకారణములకు భేదము సహజము కానేరదు. మఱియు కార్యవ్యవస్థయు భేదసాధకము కానేరదు. లోకమున పల్లకి మోయువారిలో ఏ ఒకడయినను పల్లకి మార్గము సరిగా నున్నదా లేదా అని ముందు పరిశీలించి రాగలడు. వారందఱును కలిసిగాని పల్లకిని మోయజాలరు. ఇట్లే తంతువులు ప్రత్యేకముగ గట్టుకొనుటకు కప్పుకొనుటకు, పనికిరాకుండినను, పటరూపము నొందిన ఆ తంతువులే కట్టుకొనుట కుపయోగించును. సత్కార్యవాదమున కరణముల వ్యాపారమెందులకు ? అన్నచో సత్కార్యముయొక్క ఆవిర్భావముకొఱకు అని చెప్పవలయును. ఈ యావిర్భావము కరణవ్యాపారమునకు పూర్వమందు సత్తగునా, కాదా ? సత్తగునేని కరణవ్యాపారము వ్యర్థమనక తప్పదు. అసత్తగునేని అసత్కార్యవాదము నంగీకరింపక తీరదు అను శంక నిట్లు వారింప వలయును. అసత్తగు కార్యము పుట్టునను వారి మతమందును, ఉత్పత్తి సత్తగునా, కాదా ? ఉత్పత్తి సత్తగునేని కరణ వ్యాపారము వ్యర్థము. అసత్తగునేని ఉత్పత్తికి మఱియొక యుత్పత్తియు, దానికింకొక యుత్పత్తియు నని యీ తీరున అనవస్థ వచ్చును. పటోత్పత్తి పటముకన్నను వేఱు కాదందు వేని, పటశబ్దమును ఉత్పత్తి శబ్దమును సమానార్థకములు కావలయును. కాగా "పటః ఉత్పద్యతే" అను సహప్రయోగమున పౌనరుక్త్యము

వాటిల్లును. మఱియు "పటః వినశ్యతి" అను ప్రయోగము పపన్నము కానేరదు. పటమన్నను ఉత్పత్తి యన్నను ఒక్క టియే కదా? ఉత్పత్తి వినాశములకు విరోధమున్నది కద. కాగా "పటః వినశ్యతి" అను ప్రయోగమెట్లు సంగతమగును. కాన ఈ యుత్పత్తిని కార్యకారణముల కుండెడి సమవాయ సంబంధరూపమనికాని, కార్యమునకును సత్తకును ఉండెడి సమ వాయరూపమనికాని చెప్పవలయును. ఎట్లయినను అది పుట్టు నది మాత్రము కాదు. అయినను ఆ ఉత్పత్తికొఱకు కరణ వ్యాపారము మాత్ర మవసర మగుచున్నది. అట్లే అభివ్యక్తి సత్త యినను దానికొఱకు సాధనవ్యాపార మపేక్షింప బడుచున్నది. కార్యమగు పటముతో కారణములకు సంబంధమును గల్పిం చుట యుక్తము కానేరదు. పటము వస్తువుకాని క్రియ కాదు. కారణవ్యాపారము క్రియానుకూలముకాని, ద్రవ్యానుకూలము కాదు. "కరోతీతి కారణమ్" అను వ్యుత్పత్తినిబట్టి క్రియాను కూల మయినదియే కారణ మగుచున్నది. కాన కార్యస్వరూ పానుకూలము కారణమనుట సరికాదు.

ఇట్లు ప్రధాన సాధనమున కనువగు సత్కార్యవాద మును నిరూపించి,ఇక ప్రధానమెట్టిదో నిరూపించుటకు ముందుగ తత్త్వజ్ఞానమున కుపకరించెడి వ్యక్తావ్యక్తములకు గల ప్రధాన సారూప్య వైరూప్యములు నిరూపింప బడుచున్నవి.

శ్లో॥ హేతుమదనిత్యమవ్యాపి సక్రియ మనేక మాశ్రితం లింగమ్।
సావయవం పరతంత్రం వ్యక్తం విపరీత మవ్యక్తమ్॥ 10

కారణము కలదియు, తిరోభావావస్థకలదియు, కారణము నంతను వ్యాపింపనిదియు, పురుషభేదమున భిన్నమును స్వకారణము నాశ్రయించునదియు, పరమకారణమగు ప్రధానమునకు జ్ఞాపకమును, అవయవనము అనగా పరస్పర సంయోగము కలదియు, ప్రధానాధీనమును అగునది వ్యక్తమనబడును. హేతువు లేనిదియు, నిత్యమును, వ్యాపకమును, అక్రియము, ఏకము, అనాశ్రితము, అలింగము, అనవయవి, స్వతంత్రము నగునది అవ్యక్త మనబడును.

ఇట దేసికేవి హేతునను విషయము ముందు నిరూపింప బడును. కార్యము నంతను కారణము వ్యాపించియుండును. కాని కారణము నంతను కార్యము మాత్రము వ్యాపింపదు. ప్రధానము బుద్ధ్యాదులందు వ్యాపించి యుండును. కాని ప్రధానమును బుద్ధ్యాదులు వ్యాపింప జాలవు. బుద్ధ్యాదులు పూర్వదేహమును వదలి మఱియొక దేహమును ప్రవేశించును. శరీరాదులందు సయితము చలనాదులు ప్రసిద్ధములే కావున కార్యమంతయు సక్రియము. పురుషభేదమునుబట్టి బుద్ధ్యాదులును, ఘటపటాది రూపమున పృథివ్యాదులును, భిన్నములనునది ప్రత్యక్షసిద్ధము. కార్యకారణముల కభేదమున్నను, కల్పితమగు భేదమునుబట్టి కార్య మాశ్రితము, కారణ మాశ్రయమని ఆశ్రితాశ్రయ భావ ముపపన్నము కావచ్చును. బుద్ధ్యాదులు ప్రధానమునకు లింగములను విషయము ముందు నిరూపింప బడును. పృథివ్యాదులు పరస్పరము సంయోగము కలవై యున్నవి. ఇట్లే బుద్ధ్యాదులును పరస్పర సంయోగము కలవియే

యుండున్నవి. సంయోగ మనగా అప్రాప్తము లగువానికి గల ప్రాప్తి. కాగా ప్రధానమునకును బుద్ధ్యాదులకును తాదాత్మ్యమే కాని సంయోగము లేదు. ఇట్లే కార్యకారణముల కన్నిటికిని తాదాత్మ్యమే సంబంధము. సత్త్వరజస్తమో గుణములకును, నిత్య ప్రాప్తము లగుటవలన సంయోగము లేదు. వాటికి ప్రాప్తి రూపమగు సంబంధము నిత్యము. బుద్ధ్యాదులు పరతంత్రములు. అనగా బుద్ధివలన నహంకారము పుట్టవలయుననిన బుద్ధి ప్రకృతిచే పూరింపబడ వలయును. అనగా బుద్ధ్యవయవములలో కొన్ని అహంకార రూపముగ మాఱవలసివచ్చినపుడు ఎన్ని అవయవములు అహంకార రూపముగ మాఱునో, అన్ని అవయవములు తిరిగి ప్రకృతివలన బుద్ధికి సిద్ధించును. లేనియెడల బుద్ధి క్షీణించిపోవును. ఇదియే పూరణము. ఇట్టి పూరణము సావయనములగు బుద్ధ్యాదుల కవసరము. ఇట్లే అహంకారము మున్నగు ప్రతికారణము తా నొక కార్యమును బుట్టించునపుడు ప్రకృతిచే తనయొక్క పూరణము నపేక్షించు చుండును. ఇదియే పారతంత్ర్యము.

ఇట్లు వ్యక్తావ్యక్తముల కుండెడి భేదము నిరూపింపబడినవి. ఇక వాటికిగల సామ్యము పురుషునికి వానికి గల భేదము నిరూపింపబడును.

శ్లో॥ త్రిగుణ మవివేకి విషయః సామాన్య మచేతనం ప్రసవధర్మి।
వ్యక్తం తథా ప్రధానం తద్విపరీతస్తు పుమాన్॥ 11

సుఖదుఃఖ మోహాత్మకములగు మూడు గుణములు వ్యక్తావ్యక్త సాధారణములు. ఈగుణములు ప్రకృతిధర్మములు

కాని ఆత్మధర్మములు కానేరవు. ఇట్లే యవివేకిత్వమును సాధారణ ధర్మ మగుచున్నది. అనగా ప్రకృతికెట్లు గుణములతో భేదము దుస్సాధమగుచున్నదో అట్లే మహదాదులకును ప్రకృతితో భేదము దుస్సాధము. లేదా కలిసి పనిచేయుట యవివేక మనబడును. బుద్ధ్యాదులు పరస్పరము కలిసియే కార్యమును సాధించు చుండును. కాని, ఒక్కటి ఎన్నడును ఏ కార్యమును సాధింపజాలదు. ఇట్లే ప్రకృతియు సత్త్వరజస్తమోగుణములయొక్క యుద్రేకము వలనగాని, అదృష్టము వలనగాని కార్యముల బుట్టించు చున్నది. మఱియు వ్యక్తావ్యక్తములు విషయము లగుచున్నవి. కావుననే యివి అందఱు పురుషుల చేతను సాధారణముగ నొకే తీరున గ్రహింపబడు చున్నవి. హర్ష విషాద మోహాదులు, విజ్ఞానముయొక్క విశేషము లే యగుచున్నవని కొందఱ అనుచున్నారు. వీరి మతమున విజ్ఞానము కన్న వేఱగు బాహ్యవస్తువు కాని, అంతర వస్తువు కాని లేదు. కాని హర్షాదులు కాని, ఘటాదులు కాని, విజ్ఞానముకన్న వేఱు కాక, విజ్ఞాన ధర్మములే యనునెడ, నొకని విజ్ఞాన మింకొకనికి ప్రత్యక్షము కానందున, విజ్ఞాన మసాధారణ మయినట్లే, విజ్ఞాన ధర్మములగు ఘటాదులును సాధారణములు కాక యసాధారణములు కావలయును. హర్షవిషాదాదులు సాధారణములు. కావుననే నర్తకి యభినయించుచు కనుల ద్రిప్పునపు డందఱకు నొకేతీరున హర్షమోహాదులు సంభవించు చున్నవి. ఇట్లే అచైతన్యము (జడత్వము)ను వ్యక్తావ్యక్త సాధారణము. వీరి మతమున చైతన్యము పురుషధర్మమే కాని బుద్ధిధర్మము కానే

రదు. ప్రసవ (కార్యోత్పాదక) ధర్మము కలిగియుండుటయు వ్యక్తావ్యక్త సాధారణము. ఇట "ప్రసవధర్మి" అని మతుబర్థక మగు ఇన్ ప్రత్యయమును జెప్పుటవలన, నిత్యమును ప్రసవము కలదియే యగును కాని, ఒకప్పుడును ప్రసవము లేకుండ నుండ దని సూచింప బడినది. ఇట్లు వ్యక్తావ్యక్తములకు సాధర్మ్యమును జెప్పి దీనికన్నను పురుషుడు వేఱని దెలియుటకు పురుషుని యందు "తద్విపరీతస్తు పుమాన్" అని వ్యక్తావ్యక్త వైధర్మ్యము చెప్పబడినది. ఇట పురుషునకు అహేతుకత్వము, నిత్యత్వము, అనెడి యవ్యక్త సాధర్మ్యమును అనేకత్వమనెడి వ్యక్తసాధర్మ్యమును కలవు. అయినను అత్రైగుణ్య మనెడి వైధర్మ్యమును కలదు. ఇదియే ముఖ్యము. ఈ విషయమే "తథా" యను పదముచేతను, తు అను పదముచేతను సూచింప బడినది.

పై కారికయందు "త్రిగుణమ్" అని చెప్పబడినది. ఇట నామూడు గుణములు లక్షణములతోగూడ నిరూపింపబడు చున్నవి.

శ్లో॥ ప్రీత్యప్రీతి విషాదాత్మకాః ప్రకాశప్రవృత్తి నియమార్థాః।
అన్యోన్యాభి భవాశ్రయ జనన మిథునవృత్త యశ్చగుణాః ॥12॥

13 వ కారికయందు చెప్పబోయెడి సత్వరజస్తమో గుణములను బట్టుకొని, ప్రాచీన సాంఖ్యాచార్యుల వ్యవహారము లను బట్టుకొని, యీ కారికయందు క్రమమును జూచుకొనవల యును. ఈశాస్త్రమున గుణములన బరతంత్రములని యర్థము. సత్వరజస్తమస్సులు, ప్రీత్యప్రీతి విషాదరూపములు. అనగా

సత్త్వము సుఖరూపము, రజస్సు దుఃఖరూపము, తమస్సు మోహరూపమును అగుచున్నవి. సుఖమన, దుఃఖాభావము. ఇట్లే దుఃఖమన, సుఖాభావము. కాగా సుఖదుఃఖములు అభావ రూపములుకాని, భావరూపములు కావని కొందఱనుచున్నారు. కాని సుఖముగాని దుఃఖముకాని భావరూపమయినది లేనినాడు దుఃఖాభావము సుఖమనియు, సుఖాభావము దుఃఖమనియు, నిరూపింప వీలులేదు. మఱియు సుఖదుఃఖములు, ఘటపటముల వలె భావరూపముగ సర్వలోకానుభవ సిద్ధములు కాన వీరి మతము సరికాదను విషయమును సూచించుటకు ఈకారికయం దాత్మపద ముంచబడినది.

వీనిలో సత్త్వగుణము ప్రకాశకము, రజస్సు ప్రవర్తకము, తమస్సు నియామకము నగుచున్నవి. ఈ గుణములు పరస్పర సంబంధము కలవై కార్యమును సాధించుచుండును. తమస్సు నియమించకుండిన ప్రవర్తకమగు రజస్సుచే ప్రేరిత మయిన సత్త్వగుణము ప్రతివస్తువును ప్రకాశింపజేయవలయును. అట్లయిన మనకు దెలియని వస్తువు లేకుండ నుండవలయును. కాన తమస్సుచే నియమింపబడిన రజస్సు కొన్నిటియందే సత్త్వగుణమునకు ప్రేరకమగుచుండును. కాన కొన్ని వస్తువులే మనకు దెలియుట సిద్ధించుచున్నది. మఱియు నీ గుణము లన్యోన్యాభిభవము, అన్యోన్యాశ్రయము, అన్యోన్యజననము పరస్పర సహచారము అను వ్యాపారములు కలవి. అనగా వీనిలో నొకటి యవసరమునుబట్టి యభివ్యక్తమగునపుడు దానిచే మిగిలిన రెండును నభిభూతములగుచుండును. చూడుడు,

సత్త్వగుణ మభివృద్ధమయి రజస్తమస్సుల దిరస్కరించి సుఖ రూపమయిన ప్రశాంతమగు వృత్తిని జనియింప జేయును. ఇట్లే రజస్సు సత్త్వతమస్సుల దిరస్కరించి దుఃఖమయమగు ఘోర రూపమయిన వృత్తిని గలిగించును. తమస్సభివృద్ధమయి, సత్త్వరజస్సుల దిరస్కరించి విషాదమయమగు మూఢవృత్తిని గలిగించును

మఱియు ఈ గుణములు పరస్పరాశ్రయములు. ఇట సహజమగు నాశ్రయాశ్రితభావము సరిపడనందున దేని నుద్దేశించి దేనియందు క్రియపుట్టునో అది దాని కాశ్రయమని గౌణమగు నాశ్రయాశ్రయి భావము నంగీకరింపవలయును. చూడుడు. సత్త్వగుణము రజోగుణముయొక్క ప్రవృత్తిని, తమోగుణము యొక్క నియమమును చెడగొట్టక తా నా గుణములను వాని ప్రయోజనములను ప్రకాశింపజేయును. ఇట్లే రజస్సు సత్త్వగుణముయొక్క ప్రకాశమును, తమోగుణముయొక్క నియమమునుబట్టి ప్రవర్తకమై, పై రెండు గుణముల కుపకారమును చేయుచున్నది. తమస్సు ప్రకాశవృత్తులనుబట్టి నియమించుచున్నది. కాన పరస్పరాశ్రయము లనబడుచున్నవి.

మఱియు ఈ గుణములు పరస్పర జననవ్యాపారము కలవి. అనగా నొకగుణము పరిణమించునపు డింకొక గుణము సహకారియగునని భావము. ఇట పరిణామమన తానే పూర్వావస్థనుండి మఱియొక అవస్థలోనికి మాఱుట. ఇట్లనుటవలన గుణములకు సహేతుకత్వముకాని, యనిత్యత్వముకాని, వచ్చునను శంక కవకాశములేదు. మఱియు నీ గుణములు పరస్పర

సహచారులు. అనగా నొకదానిని విడిచి తక్కినవి ఉండవని భావము. ఈవిషయము దేవీభాగవతమం దిట్లు చెప్పబడినది.

శ్లో॥ "అన్యోన్య మిథునాస్సర్వే సర్వే సర్వత్ర గామినః।
రజసో మిథునంసత్త్వం సత్త్వస్య మిథునం రజః।
తమసశ్చాపి మిథునే, తేసత్త్వరజసీఉభే।
ఉభయోస్సత్త్వరజసోర్మిథునం తమ ఉచ్యతే।
నైషామాదిస్సంప్రయోగో వియోగో నోపపద్యతే॥"
ఈ శ్లోకములనే కౌముదీకారు లుదహరించిరి.

ఈ 12 వ కారికయందు ప్రకాశము, ప్రవృత్తి, నియమము ప్రయోజనముగా గలవి గుణములని చెప్పబడినది. ఇట వాని విశేషము చెప్పబడుచున్నది.

శ్లో॥ సత్త్వం లఘు ప్రకాశకమిష్టం ఉపష్టంభకం చలంచరజః।
గురువరణక మేవతమః ప్రదీపవచ్చార్థతో వృత్తిః॥13॥

ప్రాచీన సాంఖ్యాచార్యులు సత్త్వగుణమును లఘువనియు, ప్రకాశకమనియు చెప్పుచున్నారు. లాఘవమన, వహ్ని మొదలగు వస్తువులు పైకిపోవుటకు కారణమగునట్టియు, గురుత్వ విరోధియు నగు ధర్మము. ఈ సత్త్వమే వాయువుయొక్క తిర్యగ్గమనము (అడ్డుగా వెళ్ళుట)కు హేతువు. మఱియు నింద్రియములు త్వరగా విషయమును పొందుటకును సత్త్వమే హేతువు. అనగా నింద్రియములు తమయందుగల సత్త్వగుణమును బట్టియే త్వరగ విషయమును పొంది, ఆ విషయజ్ఞానమును కలిగించుచున్నవి. లేనినాడు మందగతి కలవి కావల

యును. ఈ విషయమే కారికలోని "ప్రకాశక" అను పదముచే సూచింపబడినది. రజస్సు చంచలమయినది. సత్త్వ, తమస్సులకు సహజమగు ప్రవృత్తి లేదు. కాన నవి స్వయముగ ప్రవర్తింప జాలవు. ఆ సత్త్వతమస్సులు రజస్సుచే ప్రోత్సహింపబడి, తమ తమ కార్యములను జేయ నుత్సాహరూపమగు ప్రయత్నము కలవగుచున్నవి. ప్రవర్తించుచున్నవని భావము. చంచల మగు రజస్సు, తనతో గలిసిన సత్త్వ, తమస్సులను గూడ అంతటను ద్రిప్ప నారంభించును. అప్పుడు తమస్సు అడ్డుపడి అనవసరమగు వానియందు ప్రవృత్తిని మరలించును. కాన తమస్సు రజస్సునకు నియామకమగుచున్నది. కారికయందలి ఏవ అను పదము మూడిటితోను సంబంధించును.

సత్త్వరజస్తమస్సులు పరస్పర విరుద్ధస్వభావము కలవై విరోధులగుచున్నవి. కాగా సుందోపసుంద న్యాయమున ఒక దాని నొకటి బాధించునుకదా! వీటికి పరస్పర సాహాయ్యమెట్లు పొసగును? అని శంకింపరాదు. పురుషార్థమునుబట్టి ప్రదీపమునకు వలె ఈ గుణములకును పరస్పర సహాయ ముపపన్నము కావ చ్చును. వత్తి, నూనె, నిప్పు ఈ మూడును పరస్పర విరుద్ధములు. అయినను వర్తి తైలములు వహ్నితో గలిసి దీపరూపమున పరస్పర సహకారులై ప్రవర్తించుచున్నవి. మఱియు పరస్పర విరుద్ధములగు వాతపిత్త శ్లేష్మములు కలిసి శరీరమును ధరించు చున్నవి. అట్లే సత్త్వరజస్తమస్సులును పురుషుని భోగము కొఱకు కలిసి ప్రవర్తింపవచ్చును. అచేతనములగు సత్త్వరజస్త మస్సులు కలిసి ప్రవర్తించుటకు పురుషార్థమే హేతువని ప్రాచీ

నులచేతను చెప్పబడినది. అతీంద్రియములగు సత్త్వాదిగుణ
ములు సుఖదుఃఖమోహాత్మకములని నిర్ణయించుట యెట్లనిన,
లోకమున మనకు గోచరించెడి వస్తువులన్నియు సుఖదుఃఖ
మోహాత్మకము లగుట వలన, వీనికి కారణములును, సుఖదుఃఖ
మోహాత్మకములే కావలయును. కార్యకారణముల కభేదము
సిద్ధమేకద. కార్యధర్మములనుబట్టి కారణధర్మముల నూహించు
నపుడు, కార్యము సుఖదుఃఖ మోహాత్మకము కానందున
తత్కారణము సుఖదుఃఖ మోహాత్మకమనుట యెట్లు ?
కార్యము సుఖాత్మకముగాని, దుఃఖాత్మకముగాని, మోహాత్మ
కముగాని యగునుకాని, సుఖదుఃఖ మోహాత్మకము కానే
రదే అని శంకింపరాదు. కార్యమంతయు సుఖదుఃఖ మోహా
త్మకమే యగుచున్నది. అయినను భాగభేదమునుబట్టి ఒకే
కార్యము ఒకనికి సుఖహేతువును, మఱియొకనికి దుఃఖహేతు
వును, ఇంకొకనికి మోహహేతువు నగుచున్నది. చూడుడు.
ఒకే ఆడుది భర్తకు సంతోషహేతువు, సవతికి దుఃఖహేతువు,
మఱియొకనికి మోహహేతువు నగుచున్నది. అనగా ఆ స్త్రీ
యందలి సత్త్వము భర్తకు సుఖహేతువు, రజస్సు సవతికి దుఃఖ
హేతువు, తమోభాగము మఱియొకనికి మోహహేతువు
నగుచున్నవి. ఇట్లే, ఒక సర్పము సర్పాంగనకు సుఖహేతువు.
ఎవనికి కఱచినదో వానికి దుఃఖహేతువు. మఱియొకనికి
మోహహేతువు నగుచున్నది. కాన వస్తువులన్నియు సుఖ
దుఃఖ మోహాత్మకములే యగుచున్నవి. అంశభేదమును
బట్టియు, నదృష్టమును బట్టియు ఒకప్పుడు సుఖహేతువు, మఱి

కార్యము కారణగుణపూర్వ మగుచుండును. కార్యమునందలి సుఖాంశము సత్త్వధర్మము. దుఃఖాంశము రజోధర్మము. మోహాంశము తమోధర్మము. కాగా వస్తువులన్నియు త్రిగుణాత్మకములే యగుచున్నవి. సుఖదుఃఖ మోహములు విరుద్ధములు. కావున వానికొక హేతువు లేదు. సుఖప్రకాశ లాఘవములు అవిరుద్ధములు. కాన వాటిమూడింటికిని, సత్త్వమొక్కటియే హేతువు. కాన నామూడింటి వలనను సత్త్వమొక్కటియే సిద్ధించును. ఇట్లే కార్యగతములగు దుఃఖోపష్టంభకత్వ ప్రవర్తకత్వములచే రజోగుణమును, మోహావరణ గురుత్వములచే తమోగుణమును సిద్ధించును. కాగా ప్రపంచము త్రిగుణాత్మకమని సిద్ధమగుచున్నది.

మన కనుభవ సిద్ధములగు పృథివ్యాదుల కవివేకిత్వాదులు ప్రత్యక్షము లగుచున్నవి. కాని మన కనుభవగోచరములుకాని సత్త్వాదిగుణము లెట్లు సిద్ధించుచున్న వనిన,

శ్లో॥ అవివేక్యాదేః సిద్ధిస్త్రైగుణ్యా త్తద్విపర్యయేఽభావాత్ ।
కారణగుణాత్మకత్వాత్కార్యస్యావ్యక్త మపిసిద్ధమ్ ॥14॥

సుఖదుఃఖ మోహాత్మకమగునదంతయు నవివేకిత్వము మున్నగు ధర్మములు కలదగుచున్నది. ఈ యంశము మనకు ప్రత్యక్షసిద్ధములగు పృథివ్యాదులందు స్పష్టముగ గోచరించుచున్నది. మఱియు నవివేకిత్వాదులులేని పురుషునందు సుఖదుఃఖ మోహములు లేవు. ఇట్లన్వయవ్యతిరేకముల వలన సత్త్వాదులందు అవివేకిత్వాది ధర్మములు సిద్ధించుచున్నవి.

లేదా అవివేకిత్వాది ధర్మములులేని పురుషునందు సుఖ దుఃఖమోహములు లేవు. వ్యక్తావ్యక్తములందు సుఖదుఃఖ మోహములున్నవి కాన వ్యక్తములగు పృథివ్యాదులు, నవ్యక్తములగు సత్త్వాదులును, అవివేకిత్వాది ధర్మములు కలవనియు చెప్పవచ్చును.

అవ్యక్తములగు సత్త్వాదులు సిద్ధించినపిదప, అవివేకిత్వాదులు ఆ యవ్యక్తముల ధర్మములనుట పొసగును. కాని యవ్యక్తములగు సత్త్వాదుల సిద్ధి యెట్లు? అనిన కార్యము కారణాత్మక మగుటవలన, అవ్యక్తములు సిద్ధించు చున్నవి. లోకమున పటాదికార్యములు తమకు కారణములగు తంతువులయొక్క గుణములు కలవగుచున్నవి. ఇట్లే ప్రపంచమంతయు కారణగుణాత్మకమే యగుచున్నది. కాన సుఖదుఃఖ మోహరూపములగు మహత్తత్త్వము మున్నగు కార్యములును, తమకు కారణమగు వస్తువుయొక్క గుణములుకలవియే యగు చున్నవని నిర్ణయింపవచ్చును. కాగా పరమకారణము, సుఖ దుఃఖ మోహాత్మకము, అవివేకిత్వాది గుణసహితము నను విషయము సిద్ధించును. అట్టి పరమకారణమునే అవ్యక్తమనియు ప్రధానమనియు చెప్పుదురు.

వ్యక్తములగు పరమాణువుల వలన, ద్వ్యణుకాది క్రమమున వ్యక్తములగు పృథివ్యాదులు పుట్టుచున్నవి. పరమాణువులందలి రూపాది గుణములవలన ద్వ్యణుకము మున్నగువానియందు, రూపాదిగుణములు పుట్టుచున్నవని, కణాద గౌతమ మతానుసారులగు తార్కికు లనుచున్నారు.

కాన మీరు చెప్పిన యవ్యక్తము నంగీకరింప బనిలేదే అని శంకింపరాదు.

శ్లో॥ భేదానాం పరిణామాత్సమన్వయాచ్ఛక్తితః ప్రవృత్తేశ్చ।
కారణకార్యవిభాగా దవిభాగాద్వైశ్వరూప్యస్య॥ 15

మహత్తత్త్వము మొదలుకొని పృథివివఱకు గల కార్యములకు అవ్యక్తరూపమయిన మూలకారణము నంగీకరింప వలయును. కారణమందు కార్యము సత్తేయగునని వెనుకనే సత్కార్యవాదమున నిరూపింపబడినది. కాగా తాబేటి శరీరమందిమిడియుండిన యవయవములే ఒకప్పుడు బయటపడి మన కగపడుచున్నవి. అప్పుడు మన మిది తాబేటి శరీరము. ఇవి దీని యవయవములు అనుకొనుచున్నారము. మఱియొకప్పుడా యవయవములు లోనికి పోవును. అప్పుడు మన కగపడవు. ఇట్లే కారణమగు మృత్పిండమునుండి కాని, హేమపిండము నుండి కాని, సత్తులగు ఘటమకుటాది కార్యము లభివ్యక్తములై కారణముకన్న వేఱుగ మన కగపడుచున్నవి. ఇట్లే సత్తులగు పృథివ్యాదులు తన్మాత్రలనుండియు, తన్మాత్ర లహంకారము నుండియు, నహంకారము మహత్తత్త్వమునుండియు, మహత్తత్త్వము ప్రధానమునుండియు, బయటపడి మనకు వేఱువేఱుగ నగపడుచుండును. ఇట్లు పరమకారణమగు ప్రధానమునుండి సాక్షాత్తుగ గాని, పరంపరగ గాని, బయటపడి ప్రపంచము మనకు గోచరించుచుండును. దీనినే కారణకార్య విభాగ మందురు. ఇక ప్రళయ కాలమున ఘటాది కార్యములు మృత్పిండాది కారణములందు లీనములై మన కగపడకుండుటచే

నవ్యక్తము లగుచున్నవి. అప్పుడు ఘటాది కార్యరూప మున గ్రహింపబడిన ఆ కారణరూపము, కారణావస్థయం దవ్యక్తమనబడును. ఇట్లే పృథివ్యాదులు తన్మాత్రలందు లీనము లగుచున్నవి. అప్పుడు తన్మాత్రలు అవ్యక్తములగుచున్నవి. పిదప తన్మాత్ర లహంకారమందు లీనమగును. అపు డహం కారము అవ్యక్తమగును. ఆ యహంకారము మహత్తత్త్వమున లీనమగును. అపుడు మహత్తత్త్వము అవ్యక్త మగుచున్నది. అట్టి మహత్తత్త్వము ప్రకృతియందు లీనమగును. అపు డా ప్రకృతి యవ్యక్తమనబడును. ప్రకృతికి లయములేదు. కాన నది పరమావ్యక్త మగుచున్నది. దీనినేకారణకార్యావిభాగమందురు ఇట్లు కారణమునందు కార్యమునకు విభాగా విభాగములు ప్రమాణసిద్ధము లగుటవలన పరమావ్యక్తమగు మూలప్రకృతి సిద్ధించుచున్నది.

మఱియు శక్తిరహితమగు కారణమువలన కార్యము పుట్టుటలేదు. కాన కారణశక్తివలన కార్యము లుద్భవించు చున్నవి. ఈసాంఖ్యమతమున కార్యముయొక్క అనభివ్యక్తి రూపమగు నవ్యక్తావస్థకన్నను వేరగు శక్తిలేదు. కావుననే తైలకారణమగు తిలలకును, ఇసుకకును భేదము స్పష్టము. తిలలందు తైలావ్యక్తావస్థా రూపమగు శక్తికలదు. ఇసుకయం దట్టి శక్తిలేదు. కాగా కార్యముయొక్క యవ్యక్తావస్థా రూప మగు శక్తినిబట్టియు, నవ్యక్తమగు కారణము సిద్ధించుచున్నది.

కారణకార్య విభాగమునుబట్టియు, కారణశక్తినిబట్టియు, నవ్యక్తము సిద్ధించినను, ఆ యవ్యక్తము, మహత్తత్త్వమే

యని యంగీకరించితిమి. కాగా మీరు చెప్పిన ప్రధానము సిద్ధించుటకు వీలులేదే అని శంకింపరాదు. పరిమాణముతో గూడినవగుటవలన ఘటాదులట్లు కార్యములో, అట్లే పరిమిత మగు మహత్తత్త్వమును కార్యమే యగుచున్నది. కాన దానికి గూడ కారణమగు పరమావ్యక్తము నంగీకరింపవలయును. ఈ పరమావ్యక్తమునకు మాత్రము కారణమున్నదనుటకు ప్రమాణము లేనందున, నిదియె పరమావ్యక్తమనియు, మూల ప్రకృతి యనియు జెప్పబడుచున్నది.

మఱియు సమన్వయమునుబట్టియు పరమావ్యక్తము సిద్ధించుచున్నది. భిన్న భిన్నములగు కార్యములం దుండెడి సమానరూపము సమన్వయ మనబడును. మృత్తికయొక్క కార్యములగు ఘటాదులు మృత్తుతో సమానరూపము కలవి. సువర్ణకార్యములగు కుండలాదులు, సువర్ణరూపము కలవియు నగుచున్నవి. కాగా ఏ కార్యము లెట్టి ధర్మము కలవగు చున్నవో, ఆ కార్యముల కట్టి ధర్మము కలదియే కారణము కావలయును. ప్రకృతమున ప్రపంచమంతయు సుఖదుఃఖ మోహాత్మక మగుటవలన, జగత్కారణమును సుఖదుఃఖ మోహాత్మకమే కావలయును. ఇదియె పరమావ్యక్తము.

ఇట్లవ్యక్తము సిద్ధింపగా, నిక దాని ప్రవృత్తి నిరూపింప బడును.

శ్లో॥ కారణ మస్త్యవ్యక్తం ప్రవర్తతే త్రిగుణతస్సముదయాచ్చ
పరిణామతస్సలిలవత్ప్రతి ప్రతిగుణాశ్రయ విశేషాత్ ॥16॥

ఈ యవ్యక్తము గుణత్రయమునుబట్టియు సముదయమును బట్టియు ప్రవర్తించుచున్నది. కాన నవ్యక్త ప్రవృత్తి ద్వివిధ మగుచున్నది. పరిణమించుటయే స్వభావముగల గుణములు క్షణమాత్రమయిన నూరకుండజాలవు. కాన ప్రళయావస్థ యందును యితరగుణముల నపేక్షింపక సత్త్వము సత్త్వరూపము గను, రజస్సు రజోరూపముగను తమస్సు, తమోరూపముగను పరిణమించుచుండును. దీనినే సదృశపరిణామమందురు. ఈ పరి ణామమందు సామ్యావస్థకు భంగము కలుగదు. ఇది మొదటి ప్రవృత్తి. సమేత్య = కిలిసి, ఉదయః = ప్రకాశించుట, సముద యము. అనగా సత్త్వరజస్తమస్సులు పరస్పరసాపేక్షములై కలియుట సముదయము. ఈ సముదయము గుణములకు ప్రధానా-ప్రధానభావము లేనిచో పొసగదు. ఈ గుణ ప్రధాన భావము ఉపమర్ద్యోపమర్దక భావమునుబట్టి సిద్ధించును. అనగా ఉపమర్దకము ప్రధానము. ఉపమర్ద్యము అప్రధానము నగు చుండును. ఈ ఉపమర్ద్యోపమర్దక భావమునుబట్టి సత్త్వరజ స్తమస్సులు గుణప్రధాన భావమున కలిసి మహదాది రూప మున పరిణతి నొందును. దీనిని సముదయప్రవృత్తి యందురు.

ఏకరూపములగు గుణముల కనేక రూపమగు ప్రవృత్తి యెట్లు సిద్ధించుచున్నదని శంకింపరాదు. ఏకరూపమగు వర్షోద కము ఆ యా తావులందు పడి, ఆ యా భూభాగ సంబంధము వలన ఆమలక, కపిత్థ, తాళ, నారికేళ, రసరూపము నొంది ఆమ్ల, కటు, మధురాదిభావము నొందినట్లు ఒక్కొక ప్రధాన గుణము నాశ్రయించి, మిగిలిన యప్రధాన గుణములు తమ

తమ విశేషమునుబట్టి పరిణమించు చుండును. ఈ విషయమే కారికయం దుత్తరభాగముచే జెప్పబడినది. సలిలవత్ = సలిలముయొక్క, పరిణామతః =పరిణామమువలె, ప్రతిప్రతిగుణాశ్రయ విశేషాత్ = ఒక్కొక గుణమందలి విశేషమునుబట్టి అని అర్థము.

కొంద ఱాత్మతుష్టిని ప్రమాణముగ దీసుకొని అవ్యక్తమునుగాని, మహత్తత్త్వమునుగాని, అహంకారమునుగాని, ఇంద్రియములనుగాని వారివారి రుచికి వచ్చినతీరున ఆత్మయని భావించి ఉపాసనము చేయుచున్నారు. వారినుద్దేశించి యీ విషయము చెప్పబడుచున్నది.

శ్లో॥ సంఘాత పరార్థత్వా త్త్రిగుణాది విపర్యయా దధిష్ఠానాత్ ।
పురుషోస్తి భోక్తృభావా త్కైవల్యార్థం ప్రవృత్తేశ్చ ॥17॥

సుఖదుఃఖ మోహాత్మకములగు నవ్యక్తము మొదలగునవి శయనాదులవలె పరోపయోగము కొఱకు పరస్పరము కలియుచున్నవి. అనగా పరస్పరము కలిసి పరోపకారకములగుచున్నవి. కాన వీనివలన నుపకారమును పొందెడి పరుడొకడుండవలయును. శయనాసనాదులు పరస్పరము కలిసి అవయవ సంఘాత రూపమగు శరీరమున కుపకరించు చున్నవి. కాని వ్యక్తావ్యక్త విలక్షణుడగు చేతనున కుపకరించుటలేదు. కాగా మీరుచూపిన దృష్టాంతమువలన నవ్యక్తాదులచే నుపకృతమగు మఱియొక సంఘాతము సిద్ధించునుగాని విలక్షణుడగు పురుషు డెట్లు సిద్ధించునని శంకింపరాదు. మీరు చెప్పినట్లవ్యక్తాదులచే

నుపకృతమగునదియు సంఘాత రూపమే యగునేని, అదియు సంఘాతరూప మగుటవలన మఱియొక సంఘాతమున కుపకరింప వలయును. కాగా అనవస్థయను దోషము తప్పదు. వీలున్నపుడు గురుతరమగు అనవస్థ నంగీకరింతుమనుటయు యుక్తముకాదు.

లోకమున దృష్టాంతమునుబట్టి, పక్షమున సాధ్యమును సాధింపవలయును. అంతియకాని దృష్టాంతమునందున్న ధర్మము లన్నియు పక్షమున సిద్ధింపవలెననుటయు సరికాదు. ఆ మతమం దనుమానమే లేకపోవలసివచ్చును. దృష్టాంతమందలి ధర్మము లెన్నడును పక్షమందుండవుకదా! కాన ప్రకృతమున ఏది సంహతమో, అది పరోపకారమగుచున్నదని యన్వయవ్యాప్తి కలదు. కాన అనవస్థాదోషమును వారించుటకొఱకు సంఘాత ముచే నుపకార్య మసంహతమని యంగీకరింప వలయును. తోడనే అత్రిగుణము, వివేకి, అవిషయము, అసామాన్యము, చేతనము, అప్రసవధర్మి అనియు నంగీకరింపవలయును. త్రిగుణ త్వాది ధర్మములన్నియు, సంహతత్వమునకు వ్యాప్యములు. కాన సంహతత్వ మీ యుపకార్యమునందు లేనియెడల దానికి వ్యాప్యములగు త్రిగుణత్వాదులును ఈ యుపకార్యమునం దుండజాలవు. బ్రాహ్మణత్వమునకు వ్యాప్యమగు కఠత్వము, బ్రాహ్మణత్వము లేనివారియం దుండదు గదా! "త్రిగుణాది విపర్యయాత్" అనుటవలన సంహతోపకార్యము అసంహత మని కారికాకారుల యాశయము. మఱియు జడములు సుఖ దుఃఖ మోహాత్మకములగు రథాదులు సారథిచే నధిష్ఠింపబడి, కార్యకారులగుచున్నవి. అట్లే సుఖదుఃఖ మోహాత్మకములగు

బుద్ధ్యాదులును పరాధిష్ఠితములు కావలయును. ఆపరుడు చేతను డగు పురుషుడే యనవలయును. కాన నధిష్ఠానమును బట్టియు చేతనుడు సిద్ధించుచున్నాడు.

మఱియు సుఖదుఃఖములు భోగ్యములగుట వలన వీని కొక భోక్త కావలయును. సుఖదుఃఖముల ననుభవించుచున్నా డను నర్థమును బోధించుటకు, భోక్తయను పదమును ప్రయో గింతురు. తన కనుకూలమను జ్ఞాన విషయము సుఖము. ప్రతి కూలమను జ్ఞాన విషయము దుఃఖము. కాగా ఈ సుఖదుఃఖ ములు అనుకూలములని కాని, ప్రతికూలములని కాని తెలిసి కొనువా డుండవలయును గదా !

సుఖదుఃఖ మోహాత్మకములగు బుద్ధ్యాదులకు, ఇది తన కనుకూలమని కాని, ప్రతికూలమని కాని, వేదనము పొసగదు. కాన సుఖాదివిలక్షణుడును, సుఖాదుల ననుకూలములని కాని, ప్రతికూలములని కాని, తెలిసికొను వాడొక డుండవలయును. అతడే చేతనుడగు పురుషుడు.

"భోక్తృత్వాత్" అను పదమునకు ద్రష్టృత్వమని యర్థము. కాగా దృశ్యములగు బుద్ధ్యాదులకు, ద్రష్ట నొకని నంగీకరింపవలయును. సుఖదుఃఖ మోహాత్మకము లగుటవలన బుద్ధ్యాదులును పృథివ్యాదులవలె దృశ్యములే యగుచున్నవి. వానికి ద్రష్టగా పురుషుడు సిద్ధించును అని కొందఱి మతము.

మఱియు వేదములు, మహర్షులును కైవల్యము కొఱకు ప్రవర్తించుచున్నారు. కైవల్యమన, నాధ్యాత్మికాధి దైవికాధి

భౌతికములగు దుఃఖములు నిశ్శేషముగ నశించుట. ఇట్టి కైవల్యము సుఖదుఃఖమోహాత్మకములగు బుద్ధ్యాదుల కెన్నడును సంభవింపదు. స్వభావమును మరలించుట సాధ్యము కాదుగదా! సుఖదుఃఖమోహవిలక్షణుడగు పురుషునికి కైవల్యము సిద్ధింప వీలున్నది. కాగా నాగమములు, మహాత్ములును, కైవల్యము కొఱకు ప్రవర్తించుటనుబట్టి, సంఘాతముకన్న నతిరిక్తుడగు పురుషు నంగీకరింపవలయును.

ఇక యీ పురుషుడు సర్వశరీరములందును ఒకడే వ్యాపించి యుండునా లేక శరీరభేదములనుబట్టి పురుషభేదము నంగీకరింపవలయునా ? అనునపుడు శరీరభేదమునుబట్టి పురుష భేదము నంగీకరింపవలయునను సాంఖ్యసిద్ధాంత మారంభింపబడుచున్నది.

శ్లో॥ జన్మమరణ కరణానాం ప్రతినియమాదయుగప త్ప్రవృత్తేశ్చ
పురుష బహుత్వం సిద్ధం త్రైగుణ్య విపర్యయాచ్చైవ ॥18॥

జన్మ మరణ కరణముల యొక్క ప్రతి నియమమును బట్టియు, పురుషునికి బహుత్వమే సిద్ధించుచున్నది. పురుషునకు పరిణతి లేనందున జన్మమన మిలితములయినట్టియు, నింతకు పూర్వము లేనట్టియు, దేహేంద్రియ మనోబుద్ధ్యహంకార వేదనలతో పురుషునకుగల సంబంధము. నిర్వికారమగు నాత్మకు నాశము లేనందున మరణమన నిదివఱకు గ్రహింపబడిన దేహాదులను విడుచుట. మనస్సు, బుద్ధి, అహంకారము, జ్ఞానేంద్రియ పంచకము, కర్మేంద్రియ పంచకము, ఈ పదుమూడును కరణములు. ఈ జన్మ మరణ కరణములకు వ్యవస్థకలదు. సర్వశరీరము

లందు నొకే ఆత్మ నంగీకరించిన పక్షమందా వ్యవస్థ సరిపడదు. ఆ పక్షమునం దొకడు పుట్టిన నందఱు పుట్టవలయును. ఒకడు గిట్టిన నందఱును గిట్టవలయును. ఒక డంధుడయిన నందఱు నంధులు కావలయును. ఒకడు పిచ్చివాడయిన నందఱును పిచ్చి వాండ్రు కావలయును. లోకమం దట్లగపడుటలేదు. పురుష బహుత్వవాదమం దట్టి ప్రసంగమున కవకాశము లేదు.

ఆకాశ మొక్కటయినను ఘటపట మఠాద్యుపాధులను బట్టియు, కర్ణరూపమగు నుపాధిని బట్టియు ఒకనికి బధిరత్వ ముండుట, ఇంకొకనికి లేకుండుట అను వ్యవస్థ కుదురుచున్నది. అట్లే శరీరరూపకమగు నుపాధినిబట్టి జననమరణ వ్యవస్థయు నుపపన్నము కావచ్చుననుటయు సరికాదు. ఒకనికి కాలు తెగి పోవచ్చును. ఆశరీరము మారిపోవచ్చును. అప్పుడు వాడు మర ణించెనను వ్యవహారము కలుగవలయును. ఇట్లే ఒక తెకు స్తనో చ్ఛేద మయినపు డామె శరీరము మారును. అట్టియెడ నామె పుట్టినదని చెప్పవలయును. లోకమునం దింతమాత్రమున నట్టి వ్యవహారము మాత్రము లేదు అయుగపత్ప్రవృత్తిని బట్టియు పురుషభేద మావశ్యకము. అయుగపత్ప్రవృత్తియన నొక్క సారిగ ప్రయత్నము లేకుండుట. నిజమున కీ ప్రవృత్తి యంతః కరణ ధర్మము. అయినను పురుషునియం దారోపింపబడు చున్నది. ఏకాత్మవాదమునం దొక శరీరమునం దాత్మ ప్రవృత్తించినపుడు అన్ని శరీరములందును ఆ పురుష ప్రవృత్తిని బట్టి చలనముండవలయును. అట్లగుపడుటలేదు. కావున పురుష నానాత్వమే యుక్తము.

మఱియు త్రైగుణ్య విపర్యయమును బట్టియు, పురుష బహుత్వమే సిద్ధించుచున్నది. త్రైగుణ్య విపర్యయమన సత్త్వ రజస్తమో గుణములయొక్క తరతమభావము. ప్రాణి సమూహమునందు దేవాదులు సత్త్వగుణ ప్రధానులు. మనుష్యులు రజోగుణ ప్రధానులు. పశుపక్ష్యాదులు తమో గుణ ప్రధానములు. ఇట్లు ప్రాణులం దగపడుచున్న యీగుణ తారతమ్యము ఏకాత్మ వాదమం దుపపన్నము కానేరదు. కాన పురుషబహుత్వ మావశ్యకము.

ఇట్లాత్మబహుత్వమును నిరూపించి, వివేకజ్ఞానమునకు సాధనములగుటవలన నాత్మధర్మములు నిరూపింపబడు చున్నవి.

శ్లో॥ తస్మాచ్చ విపర్యాసాత్సిద్ధం సాక్షిత్వ మస్యపురుషస్య ।
కైవల్యం మాధ్యస్థ్యం ద్రష్టృత్వ మకర్తృభావశ్చ 19

ఇది యనుపదము సన్నిహితమగుదానిని చెప్పును. అది అనుపదము దూరస్థమగుదానిని చెప్పును. కాగా నీ కారికయం దలి "తస్మాత్ – విపర్యాసాత్" అను విపర్యాస పదమునలన 18 వ కారికయందు చెప్పబడిన త్రైగుణ్య విపర్యాసమును గ్రహింపక 11 వ కారికయందు చెప్పబడిన త్రిగుణాది విపర్యయమునే గ్రహింపవలెనను తలంపుచే నిట అస్మాదనుటకు బదులు తస్మాత్తని చెప్పబడినది. కాగా ప్రధానధర్మములగు త్రిగుణాదుల విపర్యాసమువలన పురుషునికి అత్రిగుణత్వము, వివేకిత్వము, అవిషయత్వము, అసాధారణత్వము, చేతనత్వము, అప్రసవ ధర్మిత్వమును సిద్ధించుచున్నవి. మఱియు చేతనత్వము

వలన ద్రష్టృత్వమును, అవిషయత్వమునుబట్టి సాక్షిత్వమును, సిద్ధించుచున్నవి. చేతనుడే చూడగలడు కాని, యచేతనమున కట్టి శక్తిలేదు. చూచునదియే సాక్షియగును. లోకమున వివాదమును పొందినవారు వివాదవిషయమును సాక్షికి జూపుదురు. అట్లే ప్రకృతియు బుద్ధిరూపమున పరిణమించి, తనకు గోచరమగు విషయమును పురుషునకు జూపును. అచేతనము విషయమునగునది చూచుటకు సమర్థము కాజాలదు. కాన నవిషయమును, చేతనుడు నగు పురుషుడు సాక్షాత్తుగ జూచుటవలన సాక్షియు, ద్రష్టయు నగుచున్నాడు. పురుషునకు సహజముగ సుఖదుఃఖమోహములు లేవు. కాన సుఖదుఃఖ మోహాభావ రూపమగు కైవల్యము పురుషునకు సహజ సిద్ధము.

లోకమున సుఖముకలవాడు సుఖముచే తృప్తుడగు చుండును. దుఃఖముకలవాడా దుఃఖమును ద్వేషించుచుండును. కాన వానికి మాధ్యస్థ్యము సిద్ధింపదు. పురుషునకు సహజముగ సుఖదుఃఖ సంబంధము లేనందున నాతడు మధ్యస్థుడగు చున్నాడు. మఱియు, పురుషునకు కలిసి పనిచేయు స్వభావము లేనందున నాతడు ఏకార్యమును పుట్టింపడు. కాన కర్తయు కాజాలడు.

లోకమున ప్రమాణములవలన చేయదగిన యర్థమును దెలిసికొని చేతనుడనగు నే నీ పనిని చేయుదునని నిశ్చయించి పిమ్మట పనుల నారంభించు చుండును. ఈ సాంఖ్యమతమున పురుషునకు కర్తృత్వము లేదు. ప్రకృతికి చైతన్యము లేదు.

కాన పై యనుభవమెట్లు పొసగును? అను శంక కిది సమా ధానము.

శ్లో॥ తస్మాత్తత్సంయోగాదచేతనం చేతనావ దివలింగమ్
గుణకర్తృత్వేచ యథా కర్తేవ భవత్యుదాసీనః॥ 20

పైనిజూపిన యుక్తులనుబట్టి చైతన్యము, కర్తృత్వము నొకదానియం దుండవని తేలినది. కాన మంకెనపువ్వుయొక్క సాన్నిధ్యమునుబట్టి స్ఫటికము ఎఱ్ఱగ నగుపడునట్లు పురుష సాన్నిధ్యమును బట్టి మహత్తత్త్వము మొదలు లింగశరీరము వఱకును చైతన్యభ్రాంతి కలుగుచున్నది. ఇట్లే సత్త్వాది గుణములందుండెడి కర్తృత్వమును ఉదాసీనుడగు పురుషునం దారోపింపబడు చున్నది. ప్రధాన పురుషుల కుండు సాన్నిధ్యమువలన పురుషధర్మమగు చైతన్యము లింగము నందును, లింగధర్మమగు కర్తృత్వము పురుషునియందును, నారోపితము లగుచున్నవని భావము. మహత్తత్త్వము మొదలు సూక్ష్మశరీరమువరకు లింగమనబడును. పరస్పర భిన్నములగు ప్రకృతిపురుషులకు పరస్పరాపేక్ష లేనినాడు ఉప కారాధీనమగు నపేక్షయు, అపేక్షాధీనమగు సంయోగమును సరిపడవు. కావున వానికి గల యుపకారము నిరూపింపబడు చున్నది.

శ్లో॥ పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం తథాప్రధానస్య।
పంగ్వంధవదుభయోరపి సంబంధస్తత్కృత స్సర్గః॥ 21

పురుషునకు కైవల్యముకొఱకును, ప్రధానమునకు దర్శనముకొఱకును పరస్పరాపేక్ష కలదు. అంధునకు కన్నుగల కుంటివాని యపేక్ష కలదు. కుంటివానికి కన్నులేక నడచుటకు తగిన శక్తికల అంధాపేక్షయు కలదు. వారిరువురును కలిసిన కార్యము సిద్ధించును. ఇట్లే భోగ్యస్త్రీ తన శృంగారమును జూచు పురుషు నపేక్షించునట్లు భోగ్యమగు ప్రధానము భోక్త యగు పురుషు నపేక్షించును. ఇక పురుషుడు ప్రధానముతో గలిసి, ప్రధానమందలి సుఖదుఃఖములను తనయం దారోపించు కొని చివరకు కైవల్యము నపేక్షించును. ఈ కైవల్యము ప్రకృతిపురుషు లత్యంత విలక్షణులను నిర్ణయమువలన సిద్ధించును. అట్టి నిర్ణయము ప్రకృతిసాపేక్షము. కాన పురుషుడు కైవల్యముకొఱకు ప్రకృతి నపేక్షించును. ఇట్లు పరస్పరాపేక్షనుబట్టి ప్రకృతిపురుషులకు, పంగ్వంధులకువలె సంబంధ మేర్పడును. దానివలన మహదాది సృష్టి బయలుదేరినది. ఈ ప్రకృతిపురుష సంబంధ మనాది. పురుషు డిదివఱకు భోగము కొఱకు ప్రకృతితో సంబంధించినను, ఇపుడు కైవల్యము కొఱకును సంబంధింపవచ్చును. కాగా ప్రకృతిపురుష సంబంధమే పురుషునికి బంధహేతువును, కైవల్యహేతువు నగుచున్నది. కేవల ప్రకృతిపురుష సంయోగమువలన పురుషునకు భోగము సిద్ధింపదు. కాన ఆ ప్రకృతిపురుష సంయోగమే మహదాదిసృష్టిని సాధించి పురుషునకు భోగమును సమకూర్చుచున్నది. ఈ విషయమే "తత్కృతః సర్గః" అను వాక్యముచే నిరూపింప బడినది.

ఇకసర్గక్రమము నిరూపింప బడుచున్నది.

శ్లో॥ ప్రకృతేర్మహాంస్తతో హంకారః తస్మాద్గణశ్చ షోడశకః।
తస్మాదపి షోడశకాత్పంచభ్యః పంచభూతాని ॥22॥

మూల ప్రకృతినుండి మహత్తత్త్వమును, దానినుండి యహంకారమును, ఈయహంకారమునుండి పదునొకండింద్రియ ములును, అయిదు తన్మాత్రలు, మొత్తము పదునారు వస్తువు లును, ఈ పదునారిటిలో చేరిన తన్మాత్రలనుండి అయిదు మహాభూతములును పుట్టుచున్నవి. మహదాదులు ముందు నిరూపింపబడును. తన్మాత్రలన శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ ములు. వీనినుండి యాకాశము మున్నగు భూతము లేర్పడు చున్నవి. అందు శబ్దమువలన శబ్దగుణకమగు నాకాశమును, శబ్దతన్మాత్రతో గూడిన స్పర్శతన్మాత్రవలన శబ్దము, స్పర్శ అను రెండు గుణములుకల వాయువును, శబ్ద స్పర్శ తన్మాత్రలతో గూడిన రూపతన్మాత్రవలన శబ్దస్పర్శ రూపములుగల తేజస్సును, పైమూడు తన్మాత్రలతో గూడిన రసతన్మాత్రవలన శబ్ద స్పర్శ రూప రసము లను నాలుగు గుణములుకల జలమును, పైనాలుగు తన్మాత్రలతో గూడిన గంధ తన్మాత్రవలన శబ్ద స్పర్శ రూప రస గంధములను అయిదు గుణములుగల పృథివియు బుట్టుచున్నవి.

ఇంతవరకును "తద్విపరీతమ్" అను కారికయందు సామాన్యముగను, "సత్వంలఘుప్రకాశకమ్" అను కారిక యందు విశేషముగను, నవ్యక్తము నిరూపింపబడినది. ఇక తత్త్వజ్ఞానమున కుపకరించును కాన, వ్యక్తవిశేషములలో నొకటి యగు బుద్ధి (మహత్తత్త్వము) నిరూపింపబడుచున్నది.

శ్లో॥ అధ్యవసాయో బుద్ధిర్ధర్మోజ్ఞానం విరాగ ఐశ్వర్యమ్
సాత్వికమే తద్రూపం తామసమస్మా ద్విపర్యస్తమ్ ॥23॥

అధ్యవసాన క్రియకును, తదాశ్రమమగు బుద్ధికిని, అభే దము నంగీకరించి నిశ్చయరూపమగు నధ్యవసాయము నే బుద్ధి యని చెప్పుచున్నారు. ప్రతి పురుషుడు నింద్రియములతో జూచి దానిని మనస్సునం దాలోచించి, పిమ్మట నే నీ పనిని చేయుటకు తగుదును కాన చేయుదునని యహంకారముకల యాత్మయందు యోగ్యతను స్థిరపఱచి, తరువాత పనులందు ప్రవేశించును. మంకెనపువ్వుయొక్క సాన్నిధ్యమువలన స్పటిక మెఱ్ఱవడినట్లు పురుషసన్నిధానమువలన చేతనమువలె భాసించు బుద్ధియందు "చేయుదును" అను నిశ్చయరూపమగు వ్యాపార ముదయించును. ఈ వ్యాపారము బుద్ధియొక్క అసాధారణ ధర్మము. కాన బుద్ధి కిది లక్షణము కానచ్చును. ఈవ్యాపారము నకును, బుద్ధికిని అభేదము నంగీకరించియే మొదట "అధ్యవ సాయో బుద్ధిః" అని చెప్పబడినది. లక్షణమన తనకన్న వేఱగువానియం దుండనిదియు, తనయం దంతటను ఉండెడిదియు అగు ధర్మము. తత్వజ్ఞానమున కుపకరించెడి మఱికొన్ని బుద్ధి ధర్మములు సయితము నిరూపింపబడు చున్నవి. ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, ఐశ్వర్యము అనునవి బుద్ధియొక్క సాత్వికధర్మములు. అధర్మము, అజ్ఞానము, అవైరాగ్యము అనైశ్వర్యము, బుద్ధియొక్క తామస ధర్మములు. ఇచ్ఛాద్వేష ప్రయత్నాదులు రాజసధర్మములు. వీనిలో సాత్విక ధర్మములు ఉపాదేయములు, తామసధర్మములు పరిహరణీయములు నగు

చున్నవి. అభ్యుదయమునకును నిశ్శ్రేయసమునకును కారణ మగునట్టి యదృష్టము ధర్మము. యాగాదులవలన బుట్టిన ధర్మము స్వర్గాద్యభ్యుదయ సాధనము. అష్టాంగయోగమువలన బుట్టిన యదృష్టము నిశ్శ్రేయసమునకు హేతువు. సన్నిధానము వలన నీరక్షీరములవలె కలిసిన బుద్ధికిని, పురుషునకును కల భేదమును నిశ్చయించుట జ్ఞానము. రాగము లేకుండుట వైరాగ్యము. రాగమన విషయములందలి యభిలాష. ఈ వైరాగ్యమునకు ప్రాచీన సాంఖ్యాచార్యులు యతమానసంజ్ఞ అనియు, వ్యతిరేక సంజ్ఞ అనియు, ఏకేంద్రియసంజ్ఞ అనియు, వశీకార సంజ్ఞ అనియు నాలుగు రకముల సంకేతములను బెట్టి వ్యవహరించిరి.

లోకమున గోరెంట మున్నగువానితో చేతియందు చుట్టలబెట్టి కొంతవఱకుంచి తరువాత నా గోరెంటను కడిగి వేయుదురు. అప్పుడా గోరెంట ముద్దపోయినను రంగుమాత్ర మా చేతియం దుండిపోవును. దీనిని కషాయమందురు. ఇట్లే రాగాదులు చిత్తమునం దుదయించి పిమ్మట నశించును. అవి నశించినను, వాని సంస్కారములు మాత్రము చిత్తమునం దుండిపోవును. కాన రాగాదులు చిత్తమునందుండెడి కషాయము లనబడును. ఈ రాగాదులే ఆ యా యింద్రియముల నా యా విషయములందు బ్రవర్తింప జేయుచున్నవి. "ఇంద్రియములు రాగాధీనములై, విషయములందు బ్రవర్తింపకుండుగాత" అని రాగాదులందుండెడి యింద్రియ ప్రవర్తకత్వమును తొలగించుటకొఱకు జేయు ప్రయత్నము యతమానసంజ్ఞ

యనబడును. దీనినే పరిపాచన ప్రయత్నమందురు. ఈ పాచనమువలన గొన్నికషాయములు పక్వములగును. అనగా నింద్రియ ప్రవర్తకములు గాక యూరకుండునని భావము. మఱికొన్ని కాలక్రమమున పక్వములగును. కషాయము లన్నియు నొకేసారి పక్వములగుట అసంభవము. కాగా పచ్యమాన కషాయములకన్న పక్వకషాయములను వేఱుచేసి, ఇవి పక్వములు, ఇవి పచ్యమానములని నిర్ణయించుటను వ్యతిరేకసంజ్ఞ యందురు. చూడబడినట్టియు, వినబడినట్టియు విషయమందౌత్సుక్యముగూడ కలుగకుండుటకు వశీకారసంజ్ఞ అని పేరు. ఈ వశీకారసంజ్ఞను, యోగదర్శనకారుడగు పతంజలియు, తన దర్శనమునందు జెప్పియున్నాడు. (అ॥ పా॥ 15 వ సూత్రమును జూడుడు.) ఈ వైరాగ్యము బుద్ధిధర్మము. అణిమాది కారణమగు నైశ్వర్యమును బుద్ధిధర్మమే యగుచున్నది. అణిమ, లఘిమ, మహిమ, ప్రాప్తి, వశిత్వము, ఈశత్వము కామావసాయిత్వము (సత్యసంకల్పము) మున్నగునవి యైశ్వర్యమువలన సిద్ధించును. అణిమవలన శిలలందును బ్రవేశింపవచ్చును. లఘిమవలన సూర్యమండలమును బొందవచ్చును. మహిమవలన వ్యాపకుడు కావచ్చును. ప్రాప్తివలన చంద్రుని గూడ స్పృశింపవచ్చును. వశిత్వమువలన ప్రపంచము వశమగును. ఈశత్వమువలన, తాను ప్రపంచమును పాలింపవచ్చును. కామావసాయిత్వమువలన భూతములు తన సంకల్పమునుబట్టి ప్రవర్తించుచుండును. ఇతరుల నిశ్చయము లర్థములనుబట్టి యుండును. యోగుల నిశ్చయములనుబట్టి

యుక్తములగుటను. బుద్ధియొక్క తామస రాజస ధర్మములు మొదటనే నిరూపింప బడినవి.

ఇక క్రమమునుబట్టి యహంకారము నిరూపింపబడుచున్నది.

శ్లో॥ అభిమానోఽహంకారః తస్మాద్ద్వివిధః ప్రవర్తతే సర్గః।
ఏకాదశ కశ్చగణః తన్మాత్ర పంచకంచైవ ॥24॥

లోకమునం దొక వస్తువునుచూచి నిశ్చయించిన పిదప "నే నీ పనిని జేయవలయును. నే నీ పనిని చేయగలను. ఈ వస్తువులు నాకొఱ కేర్పడినవి, నాకన్న మఱియొక డీ పనిని చేయరాదు కాన నేనే చేయుదును." అను నభిమానమే యహంకారము. ఈ యభిమాన మహంకారముయొక్క వ్యాపారము. ఈ వ్యాపారమునకును అహంకారమునకును అభేదము నంగీకరించి అభిమానమే యహంకారమని చెప్పబడినది. ఈ యహంకారమును బట్టియే బుద్ధియం దధ్యవసాయము సిద్ధించుచున్నది. ఈ యహంకారము వలన పదునొకం డింద్రియములును, అయిదు తన్మాత్రలును బుట్టుచున్నవి. మఱి యేదియు నహంకారమువలన బుట్టదు.

ఏకవిధమగు నహంకారమువలన జడమును, ప్రకాశకము నగు విరుద్ధకార్యము లెట్లు సిద్ధించుచున్నవి? అనిన—

శ్లో॥ సాత్త్విక ఏకాదశకః ప్రవర్తతే వైకృతాదహంకారాత్।
భూతాదేస్తన్మాత్రః సతామసా తైజసాదుభయమ్ ॥25॥

అహంకారమందలి రజస్తమస్సుల దిరస్కరించి సత్వ గుణ మభివ్యక్తమగునపు డా యహంకారము వైకృతమన బడును. అట్టి వైకృతాహంకారము వలన సత్వగుణ ప్రధాన మగు నింద్రియగణ ముద్భవించుచున్నది. సత్వ రజస్సుల దిరస్కరించి తమస్సభివృద్ధమగునపుడు తామసాహంకారము వలన పంచతన్మాత్ర లుద్భవించుచున్నవి. రజోగుణము లేని నాడు పై సత్వముకాని తమస్సుకాని కార్యకారులు కావు. కాన రజస్సు పై రెండు రకములగు కార్యములకును సహకారి కారణమగుచున్నది.

శ్లో॥ బుద్ధీంద్రియాణిచక్షుః శ్రోత్రఘ్రాణరసనత్వగాఖ్యాని ।
వాక్పాణి పాదపాయూపస్థాన్ కర్మేంద్రియాణ్యాహుః॥ 26

సాత్వికాహంకారమువలన జనించిన యింద్రియములు బుద్ధీంద్రియములనియు కర్మేంద్రియములనియు రెండు విధము లుగ నున్నవి. ఈ రెండును ఇంద్రుడు (ప్రభువు) అగు ఆత్మకు చిహ్నములగుటవలన వీని కింద్రియము లను పేరువచ్చినది. వానికి నామములు కారికయందే చెప్పబడినవి. వానిలో రూప మును గ్రహించునది చక్షుస్సు. శబ్దమును గ్రహించునది శ్రోత్రము. గంధమును గ్రహించునది ఘ్రాణము. రసమును గ్రహించునది రసన. స్పర్శమును గ్రహించునది త్వక్కును అగుచున్నవి. కర్మేంద్రియముల కార్యములు ముందు చెప్ప బడును.

శ్లో॥ ఉభయాత్మక మత్రమనః సంకల్పక మింద్రియంచ సాధర్మ్యాత్ । గుణపరిణామ విశేషాన్నానాత్వం బాహ్యభేదాశ్చ ॥ 27

మనస్సు పదునొకండవ యింద్రియము. చక్షురాది జ్ఞానేంద్రియములుకాని, వాగాది కర్మేంద్రియములు కాని మనస్సంబంధము లేనినాడు తమ తమ కార్యములందు సమర్థములు కాజాలవు. కాన నీ మనస్సు జ్ఞానేంద్రియము కర్మేంద్రియమునుగూడ నగుచున్నది. సంకల్పము మనస్సు యొక్క యసాధారణవ్యాపారము. చక్షురాదులచే సామాన్యముగ గ్రహింపబడిన వస్తువును విశేషధర్మముల ద్వారమున విశేషరూపముల గల్పించునవి మనస్సు. ఈ విశేష జ్ఞానమునకే సంకల్పమని పేరు. తొలుత విశేషగ్రహణము లేకుండ కేవలము వస్తుస్వరూపమే గ్రహించబడును. దీనినే నిర్వికల్పక మందురు. పిమ్మట దానియందలి సామాన్య విశేషధర్మములను నిరూపించి స్పష్టముగ గ్రహింతురు. మొదటి నిర్వికల్పకము బాలమూకాది విజ్ఞాన సదృశము. దానివెనుక జనించినది సంకల్పాత్మకజ్ఞానము. దీనినే ప్రత్యక్షప్రమాణ మందురు. ఈ సంకల్పాత్మక వ్యాపారము మనస్సుయొక్క యసాధారణధర్మ మగుటవలన నిది మనస్సునకు లక్షణమగుచున్నది. అసాధారణ వ్యాపారముగల మహత్తత్త్వము అహంకారమును ఎట్లింద్రియములు కాజాలవో అట్లే మనస్సును ఇంద్రియము కానేరదని శంకింపవలదు. మహత్తత్త్వాహంకారముల కింద్రియ సాధర్మ్యమగు సాత్త్వికాంశసంభూతి లేదు. కాన నవి యింద్రియములు కాజాలవు.

మనస్సునకు గట్టి యింద్రియ సాధర్మ్యము కలదు. కాన మన సింద్రియము కావచ్చును. ఇంద్రలింగత్వమను నింద్రియ సాధర్మ్యము మహదహంకారములకును గలదు. కాని అది ఇంద్రియ సాధర్మ్యము కాదు. లోకమున శబ్దమునకు వ్యుత్పత్తి నిమిత్తమనియు, ప్రవృత్తి నిమిత్తమనియు రెండు ధర్మములు కలవు. గో శబ్దమునకు నడచుట వ్యుత్పత్తినిమిత్తము. గోత్వము ప్రవృత్తినిమిత్తము. కాగా ప్రవృత్తినిమిత్తమునే సాధర్మ్యముగ దీసికొనవలెను కాని, వ్యుత్పత్తి నిమిత్తమును గ్రహింపరాదు. కాగా మనస్సు యింద్రియమనియు, బుద్ధ్యహంకారములు ఇంద్రియములు కావనియు స్పష్టము. ఒకసాత్త్వికాహంకారము వలన పదునొకండు విలక్షణములగు నింద్రియము లెట్లు పుట్టుచున్నవనిన గుణపరిణామ విశేషమువలన కార్యములగు నింద్రియములకు భేదము సిద్ధించుచున్నది. గుణపరిణామ విశేషమన విహితములు నిషిద్ధములు నగు కర్మల నాచరించుటవలన అంతఃకరణమునం దుండెడి సంస్కార రూపమగు నదృష్ట విశేషము. దానివలననే బాహ్యవస్తువులెట్లు విచిత్రము లగుచున్నవో అట్లే యింద్రియములును నానావిధములు కావచ్చును.

ఇట్లే పదునొకం డింద్రియముల స్వరూపమును జెప్పి వానిలో పదింటికి అసాధారణ వ్యాపారములు నిరూపింపబడు చున్నవి.

శ్లో॥ శబ్దాదిషు పంచానా మాలోచన మిష్యతేవృత్తిః।
వచనాదాన విహరణ ఉత్సర్గానందాశ్చ పంచానామ్ ॥28॥

జ్ఞానేంద్రియములగు శ్రోత్రాదులకా యా శబ్దాది విషయ స్వరూపమును దెలుపుట వ్యాపారము. వాగాది కర్మేంద్రియ ములకును మాటాడుట, స్వీకరించుట, నడచుట, విడచుట, సంతోషము, నసాధారణ వ్యాపారములు. కంఠము, తాలువు మున్నగునవి స్థానములుగా గలది వాగింద్రియము.

మనోబుద్ధ్యహంకారములు మూడును అంతఃకరణములు. వీని యసాధారణ వ్యాపారము నిరూపింపబడు చున్నది.

శ్లో॥ స్వాలక్షణ్యాం వృత్తిః త్రయస్యసైపా భవత్యసామాన్యా।
సామాన్య కరణవృత్తిః ప్రాణాద్యా వాయవఃపంచ ॥29॥

మనోబుద్ధ్యహంకారములు మూటికిని వెనుక లక్షణ ములుగ నిరూపింపబడిన సంకల్పము, అధ్యవసాయము, అభి మానమును క్రమముగ ఒక్కొకదానికి ఒక్కొకటి అసాధా రణ వ్యాపారము లగుచున్నవి. శరీరమునందుండు వాయు వును, ఆ యా స్థానమున నిలిపి, ఆ యా వాయువ్యాపారద్వార మున శరీరమును ధరించుట, యీ మూటికిని సాధారణవ్యాపా రము. ఈ ప్రాణాదిక్రియలు లేని నాడు, శరీరము ధరింపబడదు. కాన అంతఃకరణముల సమష్టివ్యాపారమగు యత్నమువలన ప్రాణాదిక్రియ లేర్పడుచున్నవి. వానిలో ప్రాణవాయువు, నాసాగ్ర, హృదయ, నాభి, పాదాంగుష్ఠములం దుండును. అపానవాయువు మెడయొక్క వెనుకభాగము, శరీరపృష్ఠభాగము, పాదములు, మలద్వారము, మూత్రద్వారము, శరీరపార్శ్వ ములు వీనియందుండును. హృదయము, నాభి, సర్వసంధు

లందును, సమానవాయువుండును. హృదయ, కంఠ, తాలువు
లందును, శిరోభ్రూమధ్యములందును, ఉదానవాయువుండును.
వ్యానవాయువు త్వక్కునం దుండును.

మనోబుద్ధ్యహంకారరూపము లగు నంతఃకరణముల,
అసాధారణవ్యాపారరూపములగు సంకల్పాధ్యవసాయాభిమాన
ముల కొకప్పుడు క్రమమును, ఒకప్పుడు సహభావము నుండు
నను విషయ మిట నిరూపింపబడుచున్నది.

శ్లో॥ యుగపచ్చతుష్టయస్యతువృత్తిః క్రమశశ్చతస్యనిర్దిష్టా ।
దృష్టేతథాప్య దృష్టేత్రయస్య తత్పూర్వికావృత్తిః॥ 30

ఆ నాలుగిటికిని ప్రత్యక్షమందు యుగపద్వృత్తియు,
క్రమవృత్తియు కలవు. బాహ్యేంద్రియములలో నొకదానితో
గూడిన యంతఃకరణత్రయమునకు నొకప్పుడు యుగపద్వృత్తులు
పుట్టును చూడుడు. చీకటిలో మెఱుపువలన సమీపమునం
దభిముఖముగనున్న వ్యాఘ్రమును జూచును. అప్పుడాలోచన
సంకల్పాధ్యవసాయము లొక్కమారు జనించును. కావుననే
యాస్థానమును విడిచి మఱియొకచోటునకు పారిపోవును. మఱి
యొకప్పుడు చిన్న వెలుతురునందు తొలుత నొకవస్తువును
జూచుచు, పిమ్మట బాగుగ నిదానించి, ఆలోచించి తన
యెదుట నొక క్రూరుడగు తస్కరుడున్నాడని నిశ్చయించును.
వాడు తనపైకి వచ్చుచున్నాడని తరువాత నభిమానము కలు
గును. ఇక నిటనుండరాదని నిశ్చయించును. ఇట్టియెడ నాలుగు
వృత్తులకును క్రమముకలదు. ఇది ప్రత్యక్షమునందలి పద్ధతి.

ఇక నప్రత్యక్షమగు దానియందు ప్రత్యక్షమూలకములగు వృత్తులు కలుగును. ఇక్కడను క్రమము, యౌగపద్యమును కలవు. అనుమానము, ఆగమము, స్మృతి యను పరోక్షవృత్తు లందు ప్రత్యక్షమే మూలము. అనుమానము హేతుప్రత్యక్ష పూర్వకము. ఆగమము శబ్దప్రత్యక్షమూలకము. స్మృతి విష యానుభవ మూలకము. కాన నీ మూడును ప్రత్యక్షపూర్వక ములే యగుచున్నవి. వీనియం దంతఃకరణవృత్తులు మూటి కిని యౌగపద్యమును జూడుడు. ఉన్నతపయోధరముల జూచి యిది కామినియని యనుమానించునపుడు సంకల్పాభిమానా ధ్యవసాయము లొక్కసారిగ నుదయించును. ఇది గోవను నాప్తోపదేశమందును, తాను జపముచేయు మంత్రము నుచ్చ రించునపుడు, ముందు వర్ణముయొక్క స్మృతియందును ఈ సంకల్పాభిమానాధ్యవసాయములకు యౌగపద్య ముండును. మఱియొక తావున పర్వతమునందు తొలుత ధూమవత్తని సంకల్పము పుట్టును. పిమ్మట వహ్నిలేని ధూమమును నే నెన్నడును జూచియుండుటలేదని యభిమానము కలుగును. తరువాత నిది వహ్నిమత్తను నధ్యవసాయము జనించును. ఇట్టియెడ నంతఃకరణ వృత్తులకు క్రమముండునని యెఱుంగ నది. బాహ్యేంద్రియములును, అంతఃకరణ త్రయమును, స్థిర మయిన వగుటవలనను వానివృత్తులు అస్థిరమయిన వగుట వలనను ఈ వృత్తులకు బాహ్యేంద్రియములు మాత్రమే కారణ మనుటకుగాని, అంతఃకరణత్రయమే కారణ మనుటకుగాని వీలులేదు. ఈ వృత్తులకు నియతమగు కారణము లేదనుటయు

సరికాదు. ఆ పక్షమునం దొక యింద్రియవృత్తి పుట్టునపుడు దానివలననే మఱియొక యింద్రియవృత్తియు పుట్టవలసివచ్చును. కాన ఈ వృత్తులకు నియతమయిన కారణము నిరూపింపబడు చున్నది.

శ్లో॥ స్వాంస్వాంప్రతిపద్యంతేపరస్పరాకూతహేతుకాం వృత్తిమ్।
పురుషార్థఏవ హేతుర్న కేన చిత్కార్యతే కరణమ్ ॥31॥

లోకమున శక్తిధరులు, దండధరులు, ధనుర్ధరులు, ఖడ్గధరులు నగు పురుషులు మనమందఱమును కలిసి శత్రువు నరి కట్టవలయునని సంప్రదించుకొని ప్రవర్తించునపుడు వారు పరస్పరాభిప్రాయము ననుసరించియే ప్రవర్తింతురు. అప్పుడు సయితము శక్తిధరుడు శక్తినే యుపయోగించును. ఖడ్గమును మాత్ర ముపయోగింపడు. అట్లే శరీరమునందలి యింద్రియములుగూడ పురుషున కుపయోగించునపుడు ఒక యింద్రియము యొక్క ప్రవృత్తినిబట్టి రెండవ యింద్రియము ప్రవర్తించు చుండును. అప్పుడు సయిత మా యింద్రియములు, తమ తమ యభ్యాసమునుబట్టి, యసంకీర్ణములగు వృత్తులనే పుట్టించు చుండును. పురుషులు చేతనులగుటవలన ఒకరి యభిప్రాయము నింకొకరు తెలిసికొని ప్రవర్తింపవచ్చును. కాని యచేతనములగు నింద్రియము లిట్లు ప్రవర్తించుట యెట్లు పొసగును? కాన నింద్రియముల కధిష్ఠాతయు, వీనియొక్క స్వరూప, సామర్థ్యోపయోగముల దెలిసిన చేతను డుండవలయునని శంకింపరాదు. పురుషార్థమే, యింద్రియములకు ప్రేరకము గాని, పురుషుడు కాడు. అనగా భోగజనకమగునట్టియు, అంతఃకరణము

నందుండు నట్టియు, నదృష్టమే, ఆ యా యింద్రియములను, ఆ యా సమయములందు, ఆ యా వృత్తులను పుట్టించునట్లు ప్రేరణచేయును. కాన నింద్రియస్వరూపోపయోగాభిజ్ఞుడగు పురుషు డక్కరలేదు. ఈ విషయము 57 వ కారికలో విపులముగ నిరూపింపబడును.

ఇక కరణవిభాగము చెప్పబడుచున్నది.

శ్లో॥ కరణంత్రయోదశవిధం తదాహరణ, ధారణ, ప్రకాశకరమ్।
కార్యంచ తస్యదశధాఽఽహార్యం ధార్యం ప్రకాశ్యంచ॥32॥

జ్ఞానేంద్రియపంచకము, కర్మేంద్రియపంచకము, మనోబుద్ధ్యహంకారములు, మొత్తము కరణములు పదుమూడు. వ్యాపారముతోగూడిన సాధనము కరణమనబడును. కాన వీనికి వ్యాపారము నిరూపింపబడుచున్నది. కర్మేంద్రియముల కాహరణము। వ్యాపారము. ఆహార్యము (తేబడిన వస్తువు) విషయము. అతఃకరణములకు ధారణము వ్యాపారము. ధార్యమగు శరీరము విషయము. జ్ఞానేంద్రియములకు ప్రకాశనక్రియ వ్యాపారము. ప్రకాశితమగునది విషయము. కర్మేంద్రియ విషయములగు వచనాదానగమన విసర్గానందములు దివ్యములనియు, అదివ్యములనియు రెండువిధములు. అందు యోగులవి దివ్యములు. తక్కినవారివి అదివ్యములు. కాగా కర్మేంద్రియ విషయము పదివిధము లగుచున్నది. అంతఃకరణత్రయ వ్యాపారము, ప్రాణాదివృత్తులచే ధార్యములగు పార్థివాది శరీరములు, పాంచభౌతికము. రూపరసగంధస్పర్శ శబ్దములయొక్క సమూహామే పృథివి. ఈ రూపాదులు దివ్యాదివ్య భేదమున పదియగు

చున్నవి. కాగా పాంచభౌతికమగు శరీరమును ధరించునపుడు దివ్యములగు తన్మాత్రలను, అదివ్యములగు స్థూలరూపాదులను, ధరించుటవలన, నంతఃకరణ వ్యాపారవిషయమును పదిరకము లగుచున్నది. ఇట్లే జ్ఞానేంద్రియ వ్యాపారవిషయమగు ప్రకాశ్యమును, దివ్యాదివ్య భేదమున దశవిధమని యెఱుంగునది. యోగి గోచరములు దివ్యములు. అస్మదాది గోచరములు అదివ్యములు అని యెఱుంగునది.

ఇక నీ పదుమూడు రకములగు కరణములకును మఱి యొక తీరున విభాగము చెప్పబడుచున్నది.

శ్లో॥ అంతఃకరణంత్రివిధందశధాబాహ్యంత్రయస్యవిషయాఖ్యమ్।
సాంప్రతకాలం బాహ్యం త్రికాలమాభ్యంతరం కరణమ్॥౩౩॥

మనోబుద్ధ్యహంకారములు మూడును శరీరములోపల నుండునవగుట వలన నంతఃకరణము లగుచున్నవి. ఈ బాహ్యేంద్రియము లంతఃకరణత్రయమునకును విషయమును సమర్పించుచుండును. ఈ బాహ్యేంద్రియములలో బుద్ధీంద్రియము లంతఃకరణములకు విషయాలోచనమున సాధనము లగుచున్నవి. కర్మేంద్రియములు తమతమ వ్యాపారముల వలన సాధనములగు చున్నవి. మఱియు బాహ్యేంద్రియములు వర్తమానకాలిక విషయమును గ్రహించును. వర్తమాన సమీపము నందుండు అనాగతమును, వర్తమానము గనే గ్రహింపబడినది. కాన వాగింద్రియమును, వర్తమాన కాలికమగు విషయమును గ్రహించుననుట యుక్తమగుచున్నది. అంతఃకరణములు, భూత భవిష్యద్వర్తమాన కాలికములగు

విషయములను గ్రహించుచుండును. చూడుడు. నది పూర్తిగ ప్రవహించుటను బట్టి భూతమగు వృష్టిని గ్రహింతుము. ధూమమునుబట్టి వర్తమానమగు వహ్నినిం గ్రహించుచున్నారము. ఇట్లే చీమల బారులనుబట్టి వర్షము కురియునని భవిష్యద్వృష్టిని గ్రహింతుము. ఇట నంతటను భూతభవిష్యద్వర్తమానముల కనువగు సంకల్పాభిమానాధ్యవసాయములు కలుగుచుండును. కాలము, నిత్యము - ఏకము - అఖండము నని వైశేషికు లనుచున్నారు. కాని ఇట్టి యఖండకాలమును బట్టి భూతభవిష్యద్వర్తమాన వ్యవహారము సరిపడదు. కావుననే ఏ కాలోపాధులగు క్రియావిశేషముల వలన భూతభవిష్యదాది వ్యవహారమును వైశేషికులు నిరూపింతురో, అట్టి కాలోపాధులవలననే భూతభవిష్యదాది వ్యవహార ముపపన్నమగుచుండ, వ్యర్థమగు నఖండకాలము నంగీకరింప బనిలేదని సాంఖ్యాచార్యులు పదార్థనిరూపణ సందర్భమున, కాలనిరూపణమును మానివేసిరి.

ఇక బాహ్యేంద్రియములకు విషయము నిరూపింపబడుచున్నది.

శ్లో॥ బుద్ధీంద్రియాణి తేషాం పంచవిశేషావిశేషవిషయాణి ।
వాగ్భవతి శబ్దవిషయా శేషాణితు పంచవిషయాణి ॥34॥

దశవిధేంద్రియములలోను, జ్ఞానేంద్రియము లయిదును విశేషావిశేష విషయములు కలవి. అనగా స్థూలములగు పృథివ్యాధులును, సూక్ష్మములగు భూతములును, విషయములుగా కలవని భావము. దేవతలయొక్కయు యోగుల

నయుక్తయు శ్రోత్రము స్థూల సూక్ష్మ శబ్దముల రెంటిని గ్రహించును. ఇట్లే దేవాదుల త్వగాదీంద్రియములు స్థూల సూక్ష్మములగు స్పర్శాదుల గ్రహించును. మన యింద్రియ ములు మాత్రము స్థూలములనే గ్రహించుచుండును. ఇక కర్మేంద్రియములలో వాగింద్రియము, స్థూలశబ్దమునకు కారణ మగుటవలన స్థూలశబ్దమునే గ్రహించును. అహంకార కార్య మగు శబ్దతన్మాత్రను మాత్రము గ్రహింపజాలదు. శబ్దతన్మాత్ర యోగులకును ప్రత్యక్షము కాదని భావము. తక్కిన నాలుగింద్రి యములును పాంచభౌతికములగు ఘటపటాదుల గ్రహించు చుండును.

ఇక పదుమూడు కరణములలోను, కొన్నిటికి ప్రాధా న్యము, కొన్నిటి కప్రాధాన్యము, సహేతుకముగ నిరూపింప బడును.

శ్లో॥ సాంతఃకరణా బుద్ధిః సర్వం విషయ మవగాహతే యస్మాత్ ।
తస్మాత్ త్రివిధం కరణం ద్వారి, ద్వారాణి శేషాణి ॥35॥

బాహ్యేంద్రియములచే సమర్పింపబడిన విషయములను మనోబుద్ధ్యహంకారములతో గూడిన బుద్ధి గ్రహించి నిర్ణ యించుచున్నది. కాన బాహ్యేంద్రియము లప్రధానము లనియు, మనోబుద్ధ్యహంకారములతో గూడిన బుద్ధి ప్రధాన మనియు నెఱుంగునది.

కేవల బాహ్యేంద్రియములను బట్టియే బుద్ధి ప్రధా నము కాదు. అంతఃకరణములగు మనోహంకారముల కన్నను బుద్ధి ప్రధానమే యగుచున్నది.

శ్లో॥ ఏతే ప్రదీపకల్పాః పరస్పరవిలక్షణా గుణవిశేషాః।
కృత్స్నం పురుషస్యార్థం ప్రకాశ్య బుద్ధౌ ప్రయచ్ఛంతి ॥36॥

బాహ్యేంద్రియ మనోహంకారములు, సత్వరజస్తమో గుణముల వికారములు. కావుననే పరస్పర విరుద్ధములు. అయినను ప్రదీపమువలె పురుషుని యుపభోగముకొఱకు అవిరుద్ధము లగుచున్నవి. పరస్పర విరుద్ధములగు వర్తితైల వహ్నులు కలిసి దీపమై చీకటిని పోగొట్టి రూపమును మన కగ పఱుచుచున్నట్లు, బాహ్యేంద్రియ మనోహంకారములు కలిసి పురుషోపభోగమునకు సాధనము లగుచున్నవి. అందును గ్రామాధికారి గ్రామస్థులనుండి పన్నును గ్రహించి, తన కన్నను పెద్దయగు నుద్యోగి కా సొమ్మును బంపుచుండును. అతడు మంత్రికి బంపును. అతడు రాజున కా సొమ్మును సమర్పించును. ఇట్లే బాహ్యేంద్రియములు తమతమ విషయములను మనస్సున కర్పించును. మనస్సు విషయముల నహంకారమునకు సమర్పించును. అహంకార మావిషయములం దభిమానమును గల్పించి, ప్రభుతుల్యమగు బుద్ధికి సమర్పించును.

మనోబుద్ధ్యహంకారములు బుద్ధియందే విషయములర్పించునుకాని, బుద్ధి మనోహంకారములందు విషయముల నర్పింపదనుటకు కారణము చెప్పబడుచున్నది.

శ్లో॥ సర్వం ప్రత్యుపభోగం యస్మాత్పురుషస్య సాధయతి బుద్ధిః।
సైవచ విశినష్టిపునః ప్రధాన పురుషాంతరం సూక్ష్మమ్॥37॥

బాహ్యేంద్రియ మనోబుద్ధ్యహంకారము లన్నియు పురుషార్థసాధనములే యగుచున్నవి. అయినను వానిలో బుద్ధి

సాక్షాత్తుగను, తక్కినవి బుద్ధిద్వారమునను పురుషార్థ సాధనములగుట వలన వీనిలో బుద్ధి ప్రధానమనియు, మిగిలినవి అప్రధానములనియు చెప్పబడినవి. లోకమునను రాజునకు సన్నిధానవర్తియగు నమాత్యుడు రాజునకు సాక్షాత్తుగ నుపయోగించుటవలన గ్రామాధిపతి దేశాధిపతులకన్నను ప్రధానుడగుచున్నాడు. అట్లే బుద్ధియు పురుష సన్నిధానమందుండి పురుష ప్రతిబింబమును గ్రహించి తాను చేతనునివలె భాసిల్లుచు పురుషునకు విషయోపభోగమును గల్పించును. కాన బుద్ధి కరణములన్నిటిలోను ప్రధానమగుచున్నది. భోగమన సుఖదుఃఖానుభవము. ఆ యనుభవము బుద్ధియందున్నది. ఈ బుద్ధి పురుషప్రతిబింబమును గ్రహించుటవలన పురుషునివలె (చేతనునివలె) భాసిల్లుచున్నది. కాగా బుద్ధికిని పురుషునకును భేదము సువ్యక్తము గాకుండుటవలన తనయందలి భోగము నాతనియందు కల్పించుచున్నది. గ్రామాధికారులందఱును తమతమ సైన్యములతోగూడి సర్వాధ్యక్షుని సైన్యమగుచుందురు. అట్లే బాహ్యేంద్రియ మనోహంకారములు తమతమ వ్యాపారములతోగలిసి బుద్ధియొక్క వ్యాపారరూపములగుచున్నవి. అనగా విషయాలోచనము సంకల్పరూపమునను, సంకల్పము అభిమానరూపమునను, అభిమానము అధ్యవసాయరూపమునను పరిణతములై మొత్తముమీద బుద్ధియందు సంక్రమించునని భావము.

ఇట్లు బుద్ధి శబ్దాది సర్వవిషయములందును పురుషునకు భోగమును గల్పించి పిమ్మట ప్రకృతిపురుషుల కుండెడి భేద

మునుగూడ తానే ప్రకాశింప జేయునని భావము. దీనివలన అపవర్గమునకు పురుషార్థత్వము నిరూపింపబడినది. అనగా దుఃఖాభావరూపమగు మోక్షము పురుషునకు సహజసిద్ధమయి నను ప్రకృతి పురుషుల కలయికవలన ప్రకృతిధర్మమగు దుఃఖము పురుషునియం దారోపితమైనందున పురుషుడు తాను దుఃఖము ననుభవించుచున్నాననియు ఈ దుఃఖమునుండి తాను బయట పడుట యెట్లా అనియు చింతించుచుండును. కాగా దుఃఖా భావరూపమయిన యపవర్గము పురుషునకు సహజసిద్ధమయి నను, అవివేకమువలన పురుషునకు కోరదగిన దగుచున్నదని భావము.........కరణవిభాగానంతరము విశేషావిశేషములు విభజించి నిరూపింపబడుచున్నవి.

శ్లో॥ తన్మాత్రాణ్యవిశేషాస్తేభ్యో భూతాని పంచపంచభ్యః ।
ఏతేస్మృతావిశేషాః శాంతాఘోరాశ్చ మూఢాశ్చ ॥38॥

శబ్దము మున్నగు తన్మాత్రలయిదును భోగయోగ్యము లగు శాంతత్వాది ధర్మములు లేనివగుటవలన అవిశేషము లగుచున్నవి. ఈ తన్మాత్రలవలన - క్రమముగ శబ్దమువలన నాకాశము, శబ్దస్పర్శములవలన వాయువు, శబ్దస్పర్శ రూపములవలన తేజస్సు, శబ్దస్పర్శరూపరసములవలన జలము, శబ్దస్పర్శరూపరసగంధముల వలన పృథివియు నను పంచమహాభూతములు ఉత్పన్నము లగుచున్నవి. వీనిలో కొన్ని సత్త్వగుణ ప్రధానము లగుటవలన శాంతములు ప్రసన్నములు సుఖావహములు నగుచున్నవి. మఱికొన్ని రజోగుణప్రధానము లగుటవలన ఘోరములు దుఃఖావ

హాములు నవ్యవస్థితములు నగుచున్నవి. మఱికొన్ని తమో గుణప్రధానములగుటవలన బరువయినవియు నిమ్నోన్నతము లయినవియు మోహమును గలిగించునవియు నగుచున్నవి. కాన నివి సవిశేషము లనబడుచున్నవి. తన్మాత్రలకుండెడి పరస్పర భేదము మనకు దెలియదు. కాన నవి అవిశేషములు. ఈ స్థూలభూతములకుండెడి భేదము మనకు దెలియును. కాన నివి సవిశేషము లగుచున్నవి.

ఈ స్థూలముల కింకొక విశేషమును కలదు.

శ్లో॥ సూక్ష్మా మాతాపితృజాః సహప్రభూతైస్త్రిధా విశేషాస్స్యుః।
సూక్ష్మాస్తేషాం నియతాః మాతాపితృజా నివర్తంతే ॥39॥

సూక్ష్మశరీరమనియు స్థూలశరీరమనియు మహాభూతములనియు పై సవిశేషము మూడువిధము లగుచున్నది. వానిలో సూక్ష్మశరీరము నిత్యము. స్థూలశరీరము పృథివిలో కలియునదిగాని, దగ్ధమై భస్మమగునదిగాని, నక్కలు మొదలగు వానిచే భక్షింపబడి మలరూపమగునదిగాని యగుచుండును. మాతాపితృజన్యమగు స్థూలశరీరమందు రోమములు, నెత్తురు, మాంసము అనునవి తల్లివలన సిద్ధించును. నరములు, ఎముకలు, మజ్జ అనునవి తండ్రివలన సిద్ధించును. కాన శరీరమును షాట్కౌశికము (ఆఱుకోశములుగలది) అందురు.

శ్లో॥ పూర్వోత్పన్న మసక్తం నియతం మహదాదిసూక్ష్మపర్యంతమ్।
సంసరతి నిరుపభోగ్యం భావైరధివాసితం లింగమ్ ॥40॥

సూక్ష్మశరీరము సృష్ట్యాదియందు పురుషుల సంఖ్యాను గుణముగ (అనంతముగ) మూలప్రకృతివలన సృజింపబడినది. మఱియు నిది యసక్తము. దేనివలనను నడ్డగింపబడదు. శిలలోగూడ నది నిరాఘాటముగ ప్రవేశించును. సృష్ట్యాది యం దుత్పన్నమై మహాప్రళయమువఱ కుండునది కాన నిత్యము. సూక్ష్మశరీరమన మహత్తత్త్వము అహంకారము పంచతన్మాత్రలు ఏకాదశేంద్రియములు, వీని సముదాయము. ఈ సూక్ష్మశరీరము శాంత - ఘోర - మూఢములగు నింద్రియ ములతో గూడినదగుటవలన నిది సవిశేషమే యగుచున్నది. ఈ సూక్ష్మశరీరము స్థూలశరీర సంబంధము లేనినాడు భోగ సాధనము కానేరదు. కాన ధర్మాధర్మ, జ్ఞానాజ్ఞాన, వైరాగ్యా వైరాగ్య, ఐశ్వర్యా నైశ్వర్య రూపములగు ధర్మములుకల బుద్ధితో గూడినదగుటవలన కస్తూరీసంపర్కమువలన వస్త్రము కస్తూరీగంధసంస్కారము కలదయినట్లు బుద్ధియొక్క ధర్మ సంస్కారములతో గూడినదై సుఖదుఃఖానుభవముకొఱకు స్థూలశరీరమును గ్రహించుచు విడుచుచు నుండును. ఇది సహేతుకము కాన ప్రధానమందు లీనమగును. అందువలన మహాప్రళయమందుండదు. కావున ప్రధానమువలె నిత్యము కానేరదు.

అహంకారముతోను ఇంద్రియములతోను గూడిన బుద్ధియే సంసారమును బొందుననక, ఆ బుద్ధిసంబంధమువలన బుద్ధిధర్మములగు సంస్కారములతో గూడిన సూక్ష్మశరీరము

సంసరించునని యెందుల కంగీకరింపవలయును ? అన సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ చిత్రంయథా౽౽శ్రయమృతే స్థాణ్వాదిభ్యోవినాయథాఛాయా ।
తద్వద్వినా౽విశేషైర్న తిష్ఠతి నిరాశ్రయం లింగమ్ ॥41॥

గోడలేని చిత్తరువు, కొమ్మలు మున్నగునవి లేని నీడయు ఎట్లు అసంభవమో, అట్లే ప్రకృతికి అనుమాపకములగు బుద్ధ్యాదులును నిరాశ్రయములై యెన్నడు నుండజాలవు. మఱియు నిపుడు మన బుద్ధ్యాదు లెట్లు స్థూలశరీరము నాశ్రయించినవో అట్లే బుద్ధ్యహంకారేంద్రియము లెప్పుడు నేదో యొక శరీరము నాశ్రయింపవలయును. కాన బుద్ధ్యాదుల కాశ్రయమును బుద్ధ్యాదులతో గూడినదియు నగు లింగశరీరము నంగీకరింపవలయును. మఱియు సత్యవంతుని శరీరము నుండి యంగుష్ఠమాత్ర పరిమాణముగల పురుషుని యముడు బలత్కారముగ లాగివేసెనని యాగమ మున్నది. ఇట నంగుష్ఠమాత్రమన సూక్ష్మశరీరమని యర్థము. కాగా జీవుని లింగశరీరమును యముడు గ్రహించునని భావము. ఈ లింగశరీరము గూడ స్థూలశరీరమం దుండుటవలన పురిశయనాత్ పురుషః అను వ్యుత్పత్తినిబట్టి పురుషపదమున కర్థము కావచ్చును. నిజమగు పురుషున కపకర్షమే సంభవింపదుగదా.

ఈ సూక్ష్మశరీర మెందువలన ఎట్లు సంసారమున ప్రవేశించునో ఆ విషయ మిక నిరూపింపబడును.

శ్లో॥ పురుషార్థహేతుకమిదం నిమిత్తనైమిత్తికప్రసంగేన ॥
ప్రకృతేర్విభుత్వయోగా న్నటవద్వ్యవతిష్ఠతే లింగమ్ ॥42॥

భోగాపవర్గరూపమయిన పురుషార్థము మూలముగా కల ఈ లింగశరీరము ధర్మాధర్మాది కారణములందును, ధర్మాధర్మాది మూలకమగు స్థూలశరీరమందును అనురాగముచే, నటుడాయా వేషముల వైచుకొని రాముడుకాని పరశురాముడుకాని, వత్సరాజుకాని యెట్లగుచున్నాడో, అట్లే ప్రవేశించి దేవుడుకాని, మనుష్యుడు కాని, పశువు కాని, వృక్షముకాని యగుచుండును. తనకు కారణమగు ప్రకృతి యొక్క వైభవమునుబట్టి, యీ లింగశరీరమునకు నిట్టి సామర్థ్యము సిద్ధింపవచ్చును. ఈ విషయము "ప్రకృతివైభవమును బట్టి అద్భుతపరిణామమేర్పడుచున్నది." అని యాగమమందును గలదు.

ఇక నిమిత్త నైమిత్తికములు విభజించి నిరూపింపబడుచున్నవి.

శ్లో॥ సాంసిద్ధికాశ్చభావాః ప్రాకృతికా వైకృతాశ్చ ధర్మాద్యాః।
దృష్టాకరణాశ్రయిణః కార్యాశ్రయిణశ్చ కలలాద్యాః ॥43॥

అంతఃకరణము నాశ్రయించిన ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యా ధర్మజ్ఞానావైరాగ్యానైశ్వర్యములను, ఎనిమిదిభావములలోను మొదటి నాలుగు స్వాభావికములు, నైమిత్తికములు గూడ నగుచున్నవి. ఆది విద్వాంసుడగు కపిలమహర్షి యొక్క ధర్మజ్ఞానాదులు స్వాభావికములు. వాల్మీకి మున్నగు మఱికొందఱియొక్క ధర్మజ్ఞానాదులు, తపస్సు మున్నగువాని వలన సిద్ధించినవి కాన నైమిత్తికములు. ఇక నధర్మాదులు నైమిత్తికములేకాని స్వాభావికములు కానేరవు. ఇక కార్యమగు

శరీరమునాశ్రయించిన కలల, బుద్బుద, మాంస, పేశీ, కరాంగు ళ్యాదులు స్వాభావికములు. బాల్య యౌవన కౌమార వార్ధకములు భోజనము, భోగము మున్నగువానివలన సిద్ధించు చున్నవికాన నైమిత్తికములు. కలలమన మాతృగర్భస్థ శుక్ల శోణితరాశికి నాచ్ఛాదకమగు పలుచని పొర. బుద్బుదమన శుక్ల శోణితములు చిక్కపడియుండెడి యవస్థ. మాంసపేశియన, రక్తముతో గూడిన ఘనీభూతమగు మాంసపిండము. దీని నుండియే కరచరణాదులును అంగుష్ఠము మున్నగునవియు నేర్పడును.

ఇంతవఱకు నిమిత్తములు నైమిత్తికములును నిరూపింప బడినవి. ఏనిలో నే నిమిత్తమువలన నెట్టి నైమిత్తికము సిద్ధించు నను విషయ మిట నిరూపింపబడుచున్నది.

శ్లో॥ ధర్మేణ గమనమూర్ధ్వం గమన మధస్తాద్భవత్యధర్మేణ ।
జ్ఞానేనచాపవర్గో విపర్యయాదిష్యతే బంధః ॥44॥

ధర్మమువలన స్వర్గాదిలోకముల నందును, అధర్మము వలన నధోగతి సంభవించును. ప్రకృతి పురుష వివేకము కలుగ నంతవఱకే ప్రకృతి పురుషునకు భోగమును గల్పించుచుండును. కాన వివేకజ్ఞానమువలన నపవర్గము సిద్ధించును. వివేకజ్ఞాన ముదయించిన పిదప వాని విషయమున ప్రకృతి కృతార్థమగుట వలన వానిని విడిచిపెట్టును. వివేకఖ్యాతి కలుగునంతవఱకే ప్రకృతి ప్రవర్తించునని పెద్దలు చెప్పియుండిరి. అజ్ఞానమువలన బంధము తప్పదు. ఈ బంధము ప్రాకృతికమనియు, వైకృతిక మనియు, దాక్షిణమనియు మూడువిధములు. ప్రకృతినే ఆత్మ

యనుకొని యెవరు ప్రకృత్యుపాసనమును జేయుదురో, వారికి ప్రాకృతబంధము. "ప్రకృత్యుపాసకులు వేయిసంవత్సరములు స్వర్గాదిలోకములం దుందురు" అని యీ విషయము పౌరాణికులచే జెప్పబడినది. ఎవరు భూతములనుగాని, ఇంద్రియములను గాని, అహంకారమునుగాని, బుద్ధినిగాని, ఆత్మయను భావముతో నుపాసింతురో, వారికి వైకృతబంధము. పికిలోనింద్రియో పాసకులు పదిమన్వంతరము లుందురు. భూతోపాసకులు నూఱు సంవత్సరము లుందురు. బుద్ధ్యుపాసకులు పదివేల సంవత్సరములు వ్యాధిలేనివారై యుందురు. అహంకారోపాసకులు వేయిసంవత్సరము లుందురు. ఈ వైకృతోపాసకులకు వైదేహులనియు వ్యవహారము కలదు. కేవలము ఇష్టాపూర్తాదికర్మలు అనగా యజ్ఞము, ఆరామ నిర్మాణము మున్నగు కర్మల జేసినవారికి దాక్షిణకబంధ ముండును. అనగా వీరు దక్షిణ మార్గమున పుణ్యలోకములందు తమ సుకృతఫలము ననుభవింతురు. ఇష్టాపూర్త కర్మల జేసినవారు ఆత్మతత్త్వము దెలియక కామాంధులయి యెప్పుడును బద్ధులే యగుచుందురు.

శ్లో॥ వైరాగ్యాత్ప్రకృతిలయః సంసారో భవతి రాజసాద్రాగాత్।
ఐశ్వర్యాద విఘాతో విపర్యయా త్తద్విపర్యాసః ॥45॥

పురుషుని తత్త్వమును గుర్తింపక కేవల వైరాగ్యమువలన ప్రకృతిలయము సిద్ధించును. అనగా ప్రకృతితోగాని తత్కార్యములగు భూతేంద్రియ మహదహంకారములలో నొక దానితోగాని కొంతకాల మేకీభావము సిద్ధించునని భావము. రజోగుణ కార్యమగు రాగమువలన సంసారము సిద్ధించును.

రజోగుణము దుఃఖమయము. కాన తత్కార్యమగు సంసార మును దుఃఖమయమే యగునని యెఱుంగునది. ప్రభువు దేనిని దలచిన దాని కడ్డులేకుండ జేయును. కాన నైశ్వర్యమున కిచ్ఛానుసారముగ బ్రవర్తించుట ఫలము. ఐశ్వర్యము లేనినా డంతటను ఇచ్ఛకు భంగమే వాటిల్లును...

ముముక్షువునకు బుద్ధిధర్మములలో కొన్ని హేయ ములు, కొన్ని ఉపాదేయములు. కాన వానిని సంగ్రహముగను విస్తరముగను నిరూపింపవలయును. కాన నిట సంగ్రహము, విస్తారమును చెప్పబడుచున్నవి.

శ్లో॥ ఏవప్రత్యయ సర్గో విపర్యయాశక్తి తుష్టి సిద్ధ్యాఖ్యః ।
గుణవైషమ్య విమర్దాత్తస్యచ భేదాస్తు పంచాశత్ ॥46॥

ప్రత్యయమన బుద్ధి. దానివలన బుట్టిన సర్గము ప్రత్యయ సర్గ మనబడును. ఇది విపర్యయాశక్తి తుష్టి సిద్ధి రూపమగు చున్నది. అనగా విపర్యయాదులు బుద్ధియొక్క పరిణామరూప ములు, ధర్మరూపములు నగుచున్నవి. అందు విపర్యయమన నజ్ఞానము. దీనినే అవిద్యయనియు జెప్పుదురు. ఇది బుద్ధియొక్క ధర్మము. సాధనవైకల్యమువలన నేర్పడిన అశక్తియు బుద్ధి ధర్మమే యగుచున్నది. ముందు నిరూపింపబడెడి తుష్టిసిద్ధు లును బుద్ధిధర్మములే యగుచున్నవి. బుద్ధిధర్మములగు ధర్మా దులు ఎనిమిదింటిలోను జ్ఞానమునకు సిద్ధియం దంతర్భావము. మిగిలిన యేడును, విపర్యయాశక్తి తుష్టులందు వీలునుబట్టి చేరుచుండును. అనగా నజ్ఞానమునకు విపర్యయమునం దంత ర్భావము. అధర్మా వైరాగ్యా నైశ్వర్యములకు అశక్తియం

దంతర్భావము. ధర్మవైరాగ్యైశ్వర్యములకు తుష్టియం దంతర్భావము.

ఇక విస్తారము నిరూపింపబడుచున్నది. సత్త్వరజస్తమోగుణములయొక్క తారతమ్యమునుబట్టి, ఒకగుణ మొకగుణమునకు విమర్దకమగుచున్నది. అందువలన ఏబది (50) భేదములు సిద్ధించుచున్నవి. అనగా నొకప్పుడు సత్త్వగుణము ప్రబలమై రజస్తమస్సుల దిరస్కరించి, తనకార్యము నారంభించును. అప్పుడు మిగిలిన రెండును బలహీనములు. ఒకప్పుడు రెండు గుణములు ప్రబలములై ఒక కార్యము నారంభించును. అపు డొక గుణమే దుర్బలమగును. గుణములయొక్క న్యూనత్వ ప్రాబల్యములను కార్యములందలి మందమధ్యమాధిక పరిణామములనుబట్టి నిర్ణయించుకొనవలయును. ఏ కార్యమునం దేగుణముయొక్క యంశము హెచ్చుగ నుండునో, ఆకార్యమునం దితరగుణములు మొదటిగుణముచే దిరస్కరింపబడినవని మన మూహించుకొనవలయును.

శ్లో॥ పంచవిపర్యయభేదా భవం త్యశక్తిశ్చ కరణవైకల్యాత్ ।
అష్టావింశతిభేదా, తుష్టిర్నవధా, ష్టధా సిద్ధిః ॥47॥

పైని జెప్పిన ఏబది భేదములు నిరూపింప బడుచున్నవి. 1. అవిద్య, 2. అస్మిత్వము, 3. రాగము, 4. ద్వేషము, 5. అభినివేశము అని విపర్యయము అయిదువిధము లగుచున్నది. వీనికే తమస్సు, మోహము, మహామోహము, తామిస్రము అంధతామిస్రము అనియు వ్యవహారము కలదు. ఆత్మ కానిదానిని ఆత్మ యనుకొనుట అవిద్య. ఇది (శరీరము)

నేనే యను నభిమానము అస్మిత్వము. విషయములం దభిలా షము రాగము. దుఃఖకరములగు వస్తువుల నావల బారవేయ వలయుననుజ్ఞానము, ద్వేషము. అభినివేశమన భయము. వీనిలో నవిద్యతప్ప తక్కినవి విపర్యయ విశేషము లెట్లగునని శంకింపరాదు. విపర్యయకార్యములగు నస్మితాద్యులును, విప ర్యయరూపకములు కావచ్చును. లేదా విపర్యయ విశేషమగు అవిద్యచే నే వస్తువు గ్రహింపబడుచున్నదో, యివియు నా వస్తు వునే గ్రహించుచున్నవి. కాన నివియు విపర్యయ విశేషములు కావచ్చును. కావుననే వార్షగణ్యాచార్యులు "అవిద్య అయిదు పర్వములు" (ప్రకారములు) కలది అని నిరూపించియున్నారు.

ఇక నయిదు విధములయిన విపర్యయ విశేషములం దవాంతరభేదము నిరూపింపబడుచున్నది.

శ్లో॥ భేద స్తమసోష్టవిధో మోహస్యచ, దశవిధో మహామోహః।
తామిస్రోష్టాదశధా తథాభవ త్యంధతామిస్రః ॥48॥

మూలప్రకృతి, మహత్తత్త్వము, అహంకారము, పంచ తన్మాత్రలు అను నీ ఎనిమిదింటియందును నాత్మయను బుద్ధికి అవిద్యా తమస్సని వ్యవహారము. ఇట విషయభేదమునుబట్టి ఈ అవిద్యాతమస్సు ఎనిమిదిరకము లగుచున్నది. దేవత లణి మాద్యష్టసిద్ధులనుబట్టి తమకు మరణములేదనియు, తమకీ యణి మాదులు శాశ్వతమనియు భావింతురు. దీనినే అస్మితామోహ మందురు. ఇదియు విషయభేదమునుబట్టి ఎనిమిదిరకము లగు చున్నది. శబ్దస్పర్శరూపరసగంధము లయిదును, దివ్యాదివ్య భేదమున పదిరకములగుచున్నవి. వీనియందలి రాగము (ఆసక్తి)

మహామోహము. దీని విషయము పదిరకము లగుటవలన నిదియు పదిరకము లగుచున్నది. ద్వేషరూపమగు తామిస్రము పదునెనిమిదివిధము లగుచున్నది. ఈ ద్వేషమునందు, దివ్యాదివ్య భేదమున దశవిధములగు శబ్దాదులు సహజముగనే విషయము లగుచున్నవి. అణిమాద్యష్టైశ్వర్యములు మాత్రము సహజముగ విషయములుగాక, విషయములగు శబ్దాదులకు సాధనములై, పరంపరగ విషయము లగుచున్నవి. శబ్దాదు లింద్రియగోచరములై ఒకప్పుడొకదాని నింకొకటి బాధించుచు కోపమును గలిగించును. చూడుడు. రమణీసంస్పర్శన కాలమున మధురమగు గీతము వినవచ్చును. అది యాస్పర్శముచే మర్దింపబడి కోపకారణమగును. ఇట్లే వాని సాధనములగు అణిమాదులును క్రోధమునే గలిగించుచున్నవి. కాగా శబ్దాదులు పది, అణిమాదు లెనిమిది కలిసి పదునెనిమిదియు ద్వేష విషయము లగుచున్నవి. ఇట్లు విషయభేదమునుబట్టి ద్వేషరూపమగు తామిస్రము పదునెనిమిది రకము లగుచున్నది. దేవతలు అణిమాద్యష్టైశ్వర్యములను పొంది పదిరకములగు శబ్దాదివిషయముల ననుభవించుచు, అసురులు తమ యణిమాద్యైశ్వర్యములను శబ్దాదివిషయములను అపహరింతురని భయపడుచుందురు. ఈ భయమే అభిమానమనియు అంధతామిస్రమనియు చెప్పబడుచున్నది. ఇట్లు తొలుత నయిదు రకములుగ నిరూపింపబడిన విపర్యయ మఱువదిరెండు విధములగుచున్నది.

ఇక నిరువదియెనిమిది రకములగు అశక్తి నిరూపింపబడుచున్నది.

శ్లో॥ ఏకాదశేంద్రియవధాః సహాబుద్ధివధైరశక్తిరుద్దిష్టా ।
సప్తదశవధాఃబుద్ధే ర్విపర్యయాతుష్టిసిద్ధీనామ్॥ ॥49॥

ఇంద్రియ దోషములు పదునొకండును, బుద్ధిదోషములు పదునేడును కలిసి యిరువదియెనిమిది అశక్తులగుచున్నవి. చెవుడు, స్పర్శజ్ఞానము లేకుండుట, గ్రుడ్డితనము, రుచి తెలియకుండుట, వాసన తెలియకుండుట, మూగతనము, చేతులు సొట్టవగుట, కాళ్లు కుంటివగుట, నపుంసకత్వము, ఉదావర్త మను మలమూత్ర ద్వారములందుండెడి దోషము, ఈ పదియు నింద్రియదోషములు. వీనివలన బుద్ధి తనపనిని చేయజాలదు. కార్యకారణముల కభేదము నంగీకరించుటవలన నింద్రియదోష మూలకమగు బుద్ధ్యశక్తిని, ఇంద్రియదోషములను ఏకముగ గ్రహించి, యీ పదునొకండు ఇంద్రియదోషములును బుద్ధ్య శక్తులని గ్రహింపబడినవి. తుష్టి తొమ్మిదిరకములు. సిద్ధి యెనిమిదిరకములు. కాగా తుష్టి వ్యతిరేకమువలనను, సిద్ధి వ్యతిరేకమువలనను మొత్తము పదునేడు రకములగు అశక్తులు బుద్ధికి సహజముగనే సంభవించుచుండును.

ఇక తొమ్మిదిరకముల తుష్టియు నిరూపింపబడుచున్నది.

శ్లో॥ ఆధ్యాత్మికాః చతస్రః ప్రకృత్యుపాదాన కాలభాగ్యాఖ్యాః।
బాహ్యావిషయో పరమాత్పంచచ నవతుష్టయోభిమతాః॥

ప్రకృతికన్న వేఱగు పురుషుడు కలడని యెరింగియు, ఆ పురుషుని స్వరూపమును దెలిసికొనుటకు బ్రయత్నింపవలయును. వంచకుడగువాని మాటల నమ్మరాదు. అట్లు ప్రయత్నింపక వంచకోపదేశము వలననే తుష్టిని బొందుటయు లోకమున

గలదు. ఈ తుష్టి ఆత్మవిషయకమగుటవలన నాధ్యాత్మిక మగుచున్నది. ఇది ప్రకృతి, ఉపాదాన, కాల, భాగ్యభేదమున నాలుగువిధము లగుచున్నది. ఒకనికి ప్రకృతికన్న వేఱగు నాత్మ కలదను జ్ఞానము కలిగినపిమ్మట, నొక వంచకుడువచ్చి వివేకజ్ఞానమువలన మోక్షముగలుగును. ఆ వివేకజ్ఞానమును ప్రకృతియొక్క పరిణామమేకాన వివేకజ్ఞానమును మనకు ప్రకృతి వలననే సిద్ధించును. కాన వివేకజ్ఞానముకొఱకు యత్నింప బనిలేదని చెప్పెను. వానిమాటను వినినపిమ్మట శిష్యునకు మనకు వివేకఖ్యాతిని గలిగించునది ప్రకృతియని, ప్రకృతియందు తుష్టికలుగును. దీనిని ప్రకృతితుష్టి యందురు. సాంఖ్యతంత్ర మందు దీనికి అంభః అనియు వ్యవహారము కలదు.

వివేకజ్ఞానము ప్రాకృతమయినను అది కేవల ప్రకృతి వలన సిద్ధింపదు. అట్లయినచో ప్రకృతి సర్వసాధారణము కాన దానివలన నందఱకును జ్ఞాన ముదయింపవలయును. కాన సన్న్యాస మవసరము. సన్న్యసించినవానికి ధ్యానాదు లక్కరలేదు. ప్రకృతివలననే వానికి వివేకజ్ఞాన ముదయించును. అను వంచ కోపదేశమువలన సన్న్యసించి ఆ సన్న్యాసమందు కలిగిన తుష్టి, ఉపాదానతుష్టి యనబడును. దీనికి సలిలమని సాంఖ్యమున నామాంతరము కలదు. “సన్న్యాసము వెంటనే వివేకఖ్యాతిని పుట్టింపదు. కొంతకాలమయిన పిమ్మట నీకు సన్న్యాసమువలన సిద్ధికలుగును. కావున నీవు పరితపింపకుము” అను ఉపదేశము వలన గలిగిన తుష్టికి కాలతుష్టియని పేరు. దీనినే మేఘమని సాంఖ్యు లందురు. కాలమువలనగాని, సన్న్యాసమువలనగాని,

వివేకఖ్యాతి కలుగదు. భాగ్యము (అదృష్టము) వలననే వివేక ఖ్యాతి కలుగును. చూడుము. మదాలసయను నామె తన బిడ్డలకు బాల్యముననే యుపదేశమును జేసెను. పిమ్మట వారు భాగ్యమువలన వివేకఖ్యాతికలవారైరి. ఇట్టి యుపదేశమువలన గలిగిన తుష్టికి భాగ్యతుష్టి యనిపేరు. దీనినే వృష్టి యందురు.

ఇక బాహ్యతుష్టులు నిరూపింప బడుచున్నవి. ఉపరమ మన వైరాగ్యము. భోగ్యములగు శబ్దాదులు విషయములు. ఇవి అయిదు కాన, విషయ వైరాగ్యములు నైదువిధములగుచున్నవి. ఆత్మభిన్నములగు ప్రకృతి మహదహంకారములనే ఆత్మయని తలంచువానికి విషయములందు వైరాగ్యము కలిగిన పిమ్మట గలిగెడి తుష్టులు బాహ్యతుష్టులు. ఆత్మజ్ఞానము లేనపుడు అనాత్మలగువానిని ఆధారముగ జేసికొని బయలుదేరినందున ఇవి బాహ్యము లగుచున్నవి. ఇవి విషయభేదమునుబట్టి అయిదువిధములగు వైరాగ్యములవలన సిద్ధించుచున్నవి. కాన నయిదువిధములగుచున్నవి. విషయములయొక్క ఆర్జనము, రక్షణము, భోగము, హింస, క్షయము అను వీనియందు దోషమును గ్రహించినపు డాయా విషయములందు వైరాగ్య ముదయించును. చూడుడు. ధనార్జనోపాయములగు సేవాదులు, సేవకులకు దుఃఖకరములగుచున్నవి. కావుననే ప్రాజ్ఞులు పరసేవయందు బ్రవర్తింపరు. ఇట్లు ధనార్జన కారణములగు సేవాదులు దుఃఖములేయను భావము కలవానికి గలిగిన వైరాగ్యము వలన బుట్టిన తుష్టికి, పారతుష్టియని పేరు. కష్టములకోర్చి సంపాదించిన ద్రవ్యమును రాజు, తస్కరుడు, అగ్ని, జలము

మున్నగువానివలన నశింపకుండ కాపాడవలయును. కాన తద్రక్షణమును దుఃఖమే యను భావనవలన గలిగిన వైరాగ్య మూలకమగు తుష్టి, సుపారతుష్టి యనబడును. మహాయాసము వలన సంపాదించిన ద్రవ్యము అనుభవమువలన క్షీణించిపోవును అను క్షయభావనవలన గలిగిన వైరాగ్యమూలకమగు తుష్టికి, పారాపార తుష్టియని పేరు. శబ్దాదివిషయములయొక్క భోగము వలన కామములు పెరుగునుకాని, తఱుగవను భావనవలన గలిగిన వైరాగ్యమూలక తుష్టికి అనుత్తమతుష్టియని పేరు. భూతములను హింసింపనినాడు విషయభోగము సిద్ధింపదు. కాన విషయభోగము హింసామూలకమను భావనవలన గలిగిన వైరాగ్యమూలకమగు తుష్టిని, ఉత్తమాంభస్తుష్టి యందురు. ఇట్లు బాహ్యతుష్టు లయిదును, ఆధ్యాత్మికతుష్టులు నాలుగును కలిసి తొమ్మిదివిధము లగుచున్నవి.

గౌణములనియు, ముఖ్యములనియు సిద్ధులు రెండు రక ములు. ఇపు డా రెండు రకములగు సిద్ధులు రూపింపబడుచున్నవి.

శ్లో॥ ఊహశ్శబ్దోధ్యయనం దుఃఖవిఘాతాస్త్రయఃసుహృత్ప్రాప్తిః।
దానంచ సిద్ధయోష్టౌసిద్ధేః పూర్వోంకుశస్త్రివిధః॥ ॥51॥

ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికభేదమున దుఃఖము త్రివిధము. కాన దుఃఖ విఘాతములును మూడు విధములగు చున్నవి. ఇవియే ముఖ్యసిద్ధులు. సిద్ధియే పురుషార్థము. కాగా దుఃఖవిఘాతములు మూడును ప్రధాన పురుషార్థములు. మిగిలి నవి అయిదును ఆ దుఃఖవిఘాతమునకు సాధనములగుటవలన గౌణసిద్ధులగుచున్నవి. వీనిలో కొన్ని కారణములే యగు

చున్నవి. కొన్ని కార్యములే యగుచున్నవి. కొన్ని కారణములు కార్యములుగూడ నగుచున్నవి. చూడుడు. అధ్యయన రూప మగు సిద్ధి కారణమేకాని కార్యముకానేరదు. ముఖ్యసిద్ధులు మూడును కార్యములేకాని కారణములు కానేరవు. మిగిలినవి శబ్ద, ఊహ, సుహృత్ప్రాప్తి, దానరూపములగు నాలుగు సిద్ధులును కార్యములు కారణములుగూడ కావచ్చును. సాంఖ్య శాస్త్ర నియమానుసారముగ ఆధ్యాత్మవిద్యలందలి యక్షరములను గురువులనుండి గ్రహించుట అధ్యయనము. ఇది మొదటిసిద్ధి. దీనినే తారసిద్ధియందురు. దీనివలన శబ్దసిద్ధి కలుగును. అనగా కార్యకారణముల కభేదమున్నది కాన శబ్దసిద్ధియన శబ్దమువలన గలిగిన యర్థజ్ఞానమనిభావము. దీనిని సుతారసిద్ధి యందురు. కాగా సాంఖ్యమతమున శబ్దరూపము అర్థజ్ఞానరూపమునని శ్రవణము రెండురకములగుచున్నది. సాంఖ్యావిరోధి న్యాయములచే నర్థపరీక్షణము ఊహ. పరీక్షణమన సంశయమును పూర్వపక్షమును దొలగించి ఉత్తరపక్షమును స్థిరపఱచుట, దీనినే మననమనియు చెప్పుదురు. దీనిని తార తారసిద్ధి యందురు. తాను స్వయముగజేసిన మనన మొకప్పుడు సరియగునది కాకపోవచ్చును. కావుననే తాను స్వయముగ పరీక్షించిన యర్థమును గురు, శిష్య, సహాయులతో సంప్రతించునంతవఱకు తన కా యర్థమునందు విశ్వాస మేర్పడదు. కాగా తనకు సమ్మతమగు సహాధ్యాయి మున్నగువారితో గలిసి చేయు ద్వితీయమననమే సుహృత్ప్రాప్తి. ఇది నాల్గవసిద్ధి. దీనిని రమ్యకమందురు. 'దైప్ – శోధనే' అను ధాతువువలన దానశబ్దమేర్పడినది, కాగా

దానమన తత్త్వజ్ఞానముయొక్క శుద్ధియని యెఱుంగునది. ఈ విషయమును "వివేకఖ్యాతిర విప్లవా దుఃఖత్రయస్యహానోపాయః" అను సందర్భమున పతంజలి చెప్పియున్నాడు. అవిప్లవా అను పదమునకు శుద్ధమని యర్థము. శుద్ధియన సంశయ, విపరీత జ్ఞానములను, వీని సంస్కారములను తొలగించుటవలన గలిగిన నిర్మలమగు ప్రకృతిపురుష వివేకధార యెడతెగకుండుట యని సాంఖ్యమతము. అట్టి శుద్ధి గురువాక్యములందు విశ్వాసముంచి, మధ్యను విచ్ఛేదము లేకుండ చిరకాలము గురూపదిష్టమగు అర్థ మననము చేయగా కలిగిన చిత్తపరిపాకమువలన సిద్ధించును. ఇది అయిదవసిద్ధి. దీనిని సదా ముదితసిద్ధి యందురు. ఇక మిగిలినమూడును ముఖ్యసిద్ధులు. వీనిని ప్రమోదమనియు, ముదితమనియు, మోదమానమనియు చెప్పుదురు.

మఱికొందఱంకొకతీరున నీ కారికకు వ్యాఖ్యానమును చేయుచున్నారు. గురూపదేశము లేకుండగనే జన్మాంతరాభ్యాసమువలన తత్త్వమును స్వయముగ నూహించుట ఊహాసిద్ధి యనబడును. మఱియొకడు సాంఖ్యశాస్త్రమును బఠించుచుండగ దనకుగలిగిన జ్ఞానము శబ్దమూలక మగుటవలన శబ్దసిద్ధి యనబడును. ఎవనికి గురుశిష్యసంబంధము నాశ్రయించి సాంఖ్యశాస్త్రమును చక్కగ జదివినపిదప జ్ఞాన ముదయించునో యధ్యయనమూలకమగు ఆ జ్ఞానము నధ్యయనసిద్ధి యందురు. సాంఖ్యతత్త్వము నెఱిగిన స్నేహితునివలన గలిగిన జ్ఞానమునే సుహృత్ప్రాప్తియందురు. ధన దానముచే నారాధింపబడిన పండితునివలన గలిగిన జ్ఞానము దానమూలకముగాన దానసిద్ధి

యనబడును. అని పిరి వ్యాఖ్యానము. ఇందలి గుణదోషము లను సహృదయులు గ్రహింతురుగాక. కేవల సిద్ధాంతము నే నిరూపింపదలచిన మాకు పరుల వ్యాఖ్యానమందలి గుణదోష నిరూపణ మనవసరము. ఇట్లు బుద్ధి ధర్మమగునట్టియు, సిద్ధితుష్టి విపర్యయరూపమగు నశక్తి పదునేడు రకము లగుచున్నది. ఈ సిద్ధికి విపర్యయాశక్తి తుష్టులు మూడును, నివారణ కారణములు కాన నివి యంకుశములనంటివి. అందువలన నీ మూడును ముము క్షువునకు పరిహరింపదగిన వగుచున్నవి.

సృష్టి పురుషుని యుపభోగమున కేర్పడినది. ఆ పురు షోపభోగము కేవల ప్రత్యయసర్గమువలనగాని కేవల తన్మాత్రల సర్గమువలనగాని సిద్ధించుచుండ, ఈ ద్వివిధసృష్టి నేల యంగీక రింపవలయునను శంక కిట సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ నవినాభావైర్లింగం నవినాభావేనలింగనిర్వృత్తిః।
లింగాఖ్యోభావాఖ్యః తస్మాద్ద్వివిధః ప్రవర్తతేసర్గః ॥52॥

ఇట లింగశబ్దముచేత తన్మాత్రల సర్గమును, భావశబ్దము చేత ప్రత్యయసర్గమును గ్రహింపవలయును. సుఖదుఃఖానుభవ రూపమగు భోగము పురుషార్థమనబడును. ఈ భోగము భోగ్య ములగు శబ్దాదులు, స్థూల సూక్ష్మశరీరములును లేనినాడు సిద్ధింపదు. కాన తన్మాత్రల సర్గమవసరమగుచున్నది. మఱియు ఈ భోగము ఇంద్రియములు, అంతఃకరణములును లేనినాడు సరిపడదు. ఇంద్రియాదులు ధర్మాదిసాధ్యములు. మఱియు మోక్షసాధనమగు వివేకఖ్యాతి ఉభయ విధమగు సర్గము వలన సిద్ధించుచున్నది. కాగా తన్మాత్రల సర్గము పురుషార్థ

సాధనము కావలయుననిన ప్రత్యయసర్గ మవసరమగుచున్నది. ఇట్లే ప్రత్యయసర్గ నిష్పత్తియు, ప్రత్యయసర్గమునకు పురుషార్థ సాధనత్వమును, తన్మాత్ర సర్గాధీనములు. కాన నుభయవిధ సర్గము నావశ్యకమగుచున్నది. శరీరము ధర్మాధర్మసాపేక్షము. ధర్మాధర్మములు శరీరసాపేక్షములు. కాగా పరస్పరాశ్రయ మని శంకింపరాదు. ఈ పరస్పరాశ్రయము బీజాంకుర న్యాయమున ప్రామాణికమగుటవలన దోషము కానేరదు. కల్పాది యందును, వెనుకటి కల్పమునందలి యంతఃకరణము లింగ శరీరమును సంస్కారరూపమున నుండుటవలన ఈ కల్పమునం దును తిరిగి అంతఃకరణ లింగశరీరము లేర్పడుచున్నవి కాన దోషము లేదు.

ఇట్లు ప్రత్యయసర్గము నిరూపింపబడినది. ఇక భూత సర్గము నిరూపింపబడుచున్నది.

శ్లో॥ అష్టవికల్పో దైవస్తైర్యగ్యోనశ్చ పంచధాభవతి।
మానుషశ్చైకవిధః సమాసతో భౌతికస్సర్గః ॥53॥

దేవయోని సంభూతులు, బ్రహ్మ, ప్రజాపతి, ఇంద్ర, పితృ, గంధర్వ, యక్ష, రాక్షస, పిశాచలోకములందుండుట వలన, దైవసర్గము ఎనిమిదివిధము లగుచున్నది. పశు, మృగ, పక్షి, సర్ప, స్థావర భేదమున తిర్యగ్యోనిసర్గము అయిదువిధము లగుచున్నది. అవయవసన్నివేశము మనుష్యు లందఱియందు నొకేతీరున నుండుటవలన బ్రాహ్మణత్వము మున్నగు నవాం తరజాతులను పరిగణింపనినాడు మానుషసర్గ మేకవిధమగు

చున్నది. ఘటపటాదులు, శరీరములో చేరకపోయినను స్థావరములలో చేరును.

ఈ భౌతికసర్గము చైతన్యముయొక్క ఉత్కర్షాపకర్షములనుబట్టి మూడువిధము లగుచున్నది.

శ్లో॥ ఊర్ధ్వంసత్త్వవిశాల స్తమో విశాలశ్చమూలతస్సర్గః।
మధ్యేరజోవిశాలో బ్రహ్మాది స్తంబపర్యంతః ॥54॥

స్వర్గము మొదలు బ్రహ్మలోక పర్యంత ముండెడివారు సత్వగుణప్రధానులు. దీనిని ఊర్ధ్వసర్గమందురు. పశువులు మొదలు వృక్షముల పర్యంత ముండెడి జీవులు తమోగుణ ప్రధానులు. దీనిని అధస్సర్గమందురు. ఇట నజ్ఞానము మెండగుటవలన నిది తమోగుణప్రధానము. సప్తద్వీపములతోడను, సముద్రములతోడను గూడిన భూలోకసర్గము మధ్యమసర్గము. ఈ భూలోకము ధర్మాధర్మ బహుళము; దుఃఖబహుళమును. ఈ ప్రాణివర్గము బ్రహ్మ మొదలు వృక్షమువఱకున్నది. మధ్యమ సర్గము రజోగుణ ప్రధానము.

ఇక మోక్షసాధనమగు వైరాగ్యమునకు సాధనమగుట వలన ఈ సర్గమంతయు దుఃఖరూపమని నిరూపింపబడుచున్నది.

శ్లో॥ తత్రజరామరణకృతం దుఃఖం ప్రాప్నోతిచేతనః పురుషః।
లింగస్యావినివృత్తేః తస్మాద్దుఃఖం స్వభావేన ॥55॥

లోకమున జీవులు వివిధములు విచిత్రములునగు భోగముల ననుభవించుచున్నారు. అయినను అందఱకును జన్మ జరామరణములు వానివలన గలిగెడి దుఃఖమును తప్పదు.

పురుగులకు సయితము తామిట్టే యుండవలయును. ఈ శరీరము మనకు పోరాదు అను తలంపుండును. ప్రాణులకు సహజ సిద్ధము కాన మరణము తప్పదు. ఆ మరణమువలని భయము తప్పదు. భయము దుఃఖకారణము. కావున జీవునకు శరీరాభిమానము వలన స్థూల సూక్ష్మ శరీరముల సంబంధ మున్నంతకాలము స్వాభావికమయిన దుఃఖము తప్పదు. జీవునకు దేహాభిమానమే దుఃఖకారణమని చెప్పుటవలన దుఃఖాదులు బుద్ధి ధర్మములుగదా, వీనికి చేతనునితో సంబంధ మెట్లను శంక కవకాశము లేదు. ఎంతవఱకు ప్రకృతిపురుష వివేకము కలుగదో, అంతవఱకును శరీరద్వయ సంబంధము తన్మూలకమగు దుఃఖమును పురుషునకు తప్పదు. శరీరసంబంధ మున్నంత వఱకును చేతనునికి "పురి-శయనాత్" (శరీరమందుండుటవలన) పురుషుడను వ్యవహారమును తప్పదు.

ఈ సర్గమునకు కారణము ప్రకృతియేకాని మఱియొకటి కానేరదు. ఇట వాదులకుమాత్ర మభిప్రాయభేదము కలదు. అవి ఇట నిరసింపబడుచున్నవి.

శ్లో॥ ఇత్యేష ప్రకృతికృతో మహదాది విశేషభూతపర్యంతః।
ప్రతిపురుషవిమోక్షార్థం స్వార్థఇవపరార్థ ఆరంభః ॥56॥

మహత్తత్త్వము మొదలుకొని ఘటము మున్నగు భూతవిశేష పర్యంతము ఏర్పడిన యీ సర్గము ప్రకృతిజన్యమే. ఇది నిర్హేతుకమని కాని ఈశ్వరహేతుకమని కాని చెప్పుటకు వీలులేదు. నిర్హేతుకమను పక్షమందు ఎల్లప్పుడు నుండుటయో లేకుండుటయో జరుగవలయును. ఈశ్వరుడు నిష్క్రియు

డగుటవలనను ఈశ్వరునకు పరిణామము లేకుండుటవలనను ఈశ్వర హేతుకమనుటయు సరికాదు.

వ్యాపారమేమియు లేనివానికి అధిష్ఠాతృత్వము సంభవింపదు. కాన నీశ్వరాధిష్ఠిత ప్రకృతిహేతుకమనుటయు సరికాదు. నిర్వ్యాపారుడై స్వస్థముగనున్న రథకారుడు అంపమమున్నగువాని కధిష్ఠాతకాడుగదా! "సర్గము ప్రకృతికృతమయినయెడల నిత్యమును ప్రవృత్తి స్వభావముకల ప్రకృతి వలన సర్గమును నిత్యమేకావలయును. కాగా పురుషునకు మోక్ష మెట్లు సిద్ధించును" అని శంకింపరాదు. అన్నమును కోరువాడు పాకమందు ప్రవర్తించును. అన్నము సిద్ధించిన మరి ప్రవర్తింపడు. అట్లే పురుషులనందఱను విడిపించుటకు ప్రవర్తించిన ప్రకృతి ఎవని విడిపించునో వానినిగురించి మరి ప్రవర్తింపదు.

"లోకమునందు స్వార్థమగు ప్రవృత్తికలదు. కాని పరార్థమగు ప్రవృత్తి లేదుగదా! కాగా ఈ ప్రకృతి పురుషుని విడిపించుట కెట్లు ప్రవర్తించుచున్నది" అని శంకింపరాదు. లోకమున స్వార్థప్రవృత్తివలె పరార్థప్రవృత్తియుకలదు. బద్ధుడై దుఃఖించుచున్న ఒక ప్రాణిని ఒక దయాళువు చూచి దానిని విడిపింప ప్రయత్నించును. ఇట్టియెడ స్వార్థమునందువలె పరార్థమందును ప్రవృత్తి యగపడుచున్నది. ఇట్లే ప్రకృతియు పురుషమోచనమందు ప్రవర్తించును.

"స్వార్థముకొఱకుగాని, పరార్థముకొఱకుగాని చేతనుడు ప్రవర్తింపవచ్చును. కాని యచేతనమగు ప్రకృతి కట్టి ప్రవృత్తి

సంభవింపదు. కాగా ప్రకృతి కధిష్ఠాతయగు చేతనుడుండవల యును. ప్రకృతియొక్క స్వభావమునే గుర్తెఱుంగని జీవులు అట్టి ప్రకృతికి అధిష్ఠాతలగుటకు వీలులేదు. కాన సర్వజ్ఞుడును ప్రకృతిస్వభావము నెఱిఁగినవాఁడును నగు పరమేశ్వరుడే ప్రకృతి కధిష్ఠాతకావలయునని శంకింపరాదు. ఏలయన—

శ్లో॥ వత్సవివృద్ధినిమిత్తం క్షీరస్యప్రవృత్తిరజ్ఞస్య ।
పురుషవిమోక్షనిమిత్తం తథాప్రవృత్తిః ప్రధానస్య ॥57॥

లోకమునందచేతనమునకు పరప్రయోజనము కొఱకు ప్రవృత్తి యగపడుచున్నది. చూడుడు. అచేతనమగు క్షీరము, దూడయొక్క యభివృద్ధికొఱకు ప్రవర్తించు చున్నది. అట్లే ప్రకృతియు పురుషుని విడిపించుటకొఱకు ప్రవర్తింప వచ్చును. 'క్షీరప్రవృత్తియు నీశ్వరాధిష్ఠితము కారాదా' అని శంకింప వలనుపడదు. చేతనుని ప్రవృత్తికి స్వార్థముకాని, కారుణ్యము కాని మూలము లగుచున్నవి. అవాప్తసకలకాముడును, నిష్కాముడును నగు పరమేశ్వరు నకు, స్వార్థముకొఱకు ప్రవృత్తి కవసరములేదు. ఇక కరుణచే ప్రవర్తించుచున్నాడనవలయును. సృష్టికన్నను ముందు జీవులకు శరీరేంద్రియవిషయ సంబంధము లేనందున దుఃఖమే లేదుగదా! ఇక దేనిని తొలగించుట కీశ్వరునకు కృప కలుగవలయును. సృష్టికి పిమ్మట దుఃఖము ననుభవించుచున్న జీవులందు కృప కలిగినదనుటయు సరికాదు. ఆ పక్షమున కరుణవలన సృష్టి, సృష్టివలన కరుణ, అను పరస్పరాశ్రయము తప్పదు. మఱియు కృపాప్రేరితుఁడగు పరమేశ్వరుడు ప్రాణుల నందఱను సుఖవం

తులుగనే సృజించునుకాని,దుఃఖముకలవారిగ సృజింపడుగదా! అట్టియెడ నీ జగద్వైచిత్రి ఎట్లు పొసగును? కర్మల వలన జగద్వైచిత్ర్య ముపపన్నము కావచ్చునందురేని, అప్పుడీశ్వరుడు కర్మముల కధిష్ఠాతయై, ప్రపంచమును రచించు చున్నాడన వలయును. కాగా నీశ్వరుడు కర్మల నధిష్ఠింపకుండిన యెడల నచేతనములగు కర్మలు, సహజముగ ప్రవర్తింపవు కానకర్మఫల మగు శరీరాదులును సిద్ధింపవు. శరీరము లేనినాడు దుఃఖమును సంభవింపదు. కాగా కర్మల నధిష్ఠించి శరీరాదుల సృజించి, జీవులకు దుఃఖమును కల్పించి, పిమ్మట దయచే నా దుఃఖముల దొలగించుటకన్న మొదటనే కర్మల నధిష్ఠింప కుండుట యుక్తముకదా!

అచేతనమగు ప్రకృతి ప్రవర్తించునను పక్షమున, స్వార్థముకాని, కారుణ్యముకాని యవసరములేదు. అచేతన ప్రవృత్తికి పరోపకారమే ఫలము. కాన నది యుపపన్నము కావచ్చును. కావున వత్సవివృద్ధికి క్షీరమువలె పురుషవిమోచనము కొఱకు ప్రకృతి ప్రవర్తింపవచ్చును.

**56** వ కారికయందు జెప్పబడిన "స్వార్థ ఇవ" అను దృష్టాంత మిట స్పష్టపఱుపబడుచున్నది.

శ్లో॥ ఔత్సుక్య నివృత్త్యర్థం యథాక్రియాసు ప్రవర్తతే లోకః ।
పురుషస్య విమోక్షార్థం ప్రవర్తతే తద్వదవ్యక్తమ్ ॥58॥

తనకు ఇష్టమగునదియే స్వార్థమనియు, ఫలమనియు జెప్పబడుచున్నది. అట్టి ఫలము సిద్ధించినతోడనే యిచ్ఛ నివర్తించును. కాన మనుజుడు ఇచ్ఛానివృత్తికొఱకు ఫలమందు

ఎట్లు ప్రవర్తించునో, అట్లే పురుషుని విమోచనముకొఱకు ప్రకృతియు ప్రవర్తించు చుండును.

ప్రకృతియొక్క ప్రవృత్తికి పురుషార్థము కారణమగు చున్నది. నివృత్తికి కారణ మేదియన నిరూపింపబడుచున్నది.

శ్లో॥ రంగస్య దర్శయిత్వా నివర్తతే యథా నర్తకీ నృత్యాత్ ।
పురుషస్య తథాత్మానం ప్రకాశ్య నివర్తతే ప్రకృతిః ॥59॥

ఇట రంగపదము రంగస్థులగు సభ్యులను బోధించును. కాగా నర్తకి సభ్యులకు తన నృత్యమును ప్రదర్శించినపిమ్మట మరలిపోవునట్లు, ప్రకృతి పురుషునకు తనరూపమును- అజ్ఞానావస్థయందు భోగమున కుపకరించెడి శబ్దాదిరూపమునను, జ్ఞానావస్థయందు మోక్షమున కనువగునట్లు పురుషునికన్న తనను భిన్నముగను ప్రదర్శించి పిమ్మట నివర్తించును. ప్రకృతి పురుషుని భోగాపవర్గములకొఱకు ప్రవర్తించి, పిదప తన ప్రవృత్తికి ఫలము సిద్ధింపగనే సహజముగ నివర్తించును. అనగా ఫలసిద్ధియే నివృత్తికి కారణమని భావము.

"ప్రకృతి పురుషుని యుపభోగము కొఱకు ప్రవర్తించు నపుడు తనవలన నుపకారమును పొందిన పురుషునివలన తిరిగి తానుసయితము నుపకారమును పొందవచ్చును. ప్రభువుయొక్క ఆజ్ఞను నెరవేర్చిన దాసి ప్రభువువలన నుపకారమును పొందును కదా! కాగా ప్రకృతియొక్క ప్రవృత్తి పరార్థమేకాని స్వార్థము కాదనుట యెట్లు పొసగును" అను శంకకు సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ నానావిధై రుపాయై రుపకారి ణ్యనుపకారిణః పుంసః ।
గుణవ త్యగుణస్యసతః తస్యార్థ మపార్థకం చరతి ॥60॥

లోకమున గుణవంతుడును ఉపకారియు నగు భృత్యుడు గుణహీనుడును అనుపకారియునగు స్వామిని ఫలము నపేక్షింప కయే సేవించుచుండును. అట్లే గుణవతియు, దిక్కు లేనిదియు నగు ప్రకృతి నిర్గుణుడును అనుపకారియు నగు పురుషునికి స్వార్థములేకుండగనే ఉపకారమును జేయవచ్చును.

లోకమున నటి సభ్యులయెదుట నృత్యమును ప్రదర్శించి వెళ్ళిపోవును. పిదప సభ్యుల వేడుకనుబట్టి మరల వచ్చి నటించును. అట్లే ప్రకృతియు పురుషునికి భోగముకొఱకుగాని, కైవల్యము కొఱకుగాని తనస్వరూపమును ప్రదర్శించి మరలిపోయిన పిదప మరల దన స్వరూపము నేల ప్రదర్శింపరాదు” అను శంక కిది సమాధానము.

శ్లో॥ ప్రకృతేః సుకుమారతరం నకించి దస్తీతిమే మతిర్భవతి ।
యాదృష్టాస్మీతి పునర్న దర్శనముపైతి పురుషస్య ॥61॥

ప్రకృతికన్నను సుకుమార స్వభావముకలది లోకమునం దింకొకటి లేదని నా నిర్ణయము. మిక్కిలి సిగ్గుకలదియు, పరపురుషున కగపడనిదియు నగు కులాంగన ప్రమాదమువలన జారిన మేలిముసుగు కలదై ఒకసారి పరపురుషుని కంట బడెనేని మరల వాని కగపడకుండునట్లు జాగరూకతతో నెట్లు ప్రవర్తించునో అట్లే ప్రకృతియు నొక్కసారి వివేకముగ (తన కంటె భిన్నముగ) జూడబడినచో, తిరిగి ఆ పురుషునికి గోచరము కానేరదు. అనగా నా పురుషుడు ముక్తుడే యన్నమాట.

"నిర్గుణుడును అపరిణామియు నగు పురుషునకు మోక్ష మెట్లు సిద్ధించును? బంధమునుండి బయట పడుటకదా మోక్షము. బంధమన నజ్ఞానము, సంసారము, క్లేశములు, ధర్మాధర్మములు, చిత్తము, వీని సంఘాతముతో సంబంధము గదా! ఇట్టి బంధము నిర్గుణుడగు పురుషున కెట్లు పొసగును? పురుషుడు నిష్క్రియుడు కావుననే చచ్చిపుట్టుట (సంసారము)యు నరిపడదు. కాన పురుషుని మోక్షము కొరకు, ప్రకృతి ప్రవర్తించుచున్నదనుట యసంగతము" అని కొందఱు శంకింతురు. నిజమే – కాని,

శ్లో॥ తస్మాన్న బధ్యతే ద్ధానముచ్యతే నాపిసంసరతి కశ్చిత్ ।
సంసరతి బధ్యతే ముచ్యతేచ నానాశ్రయా ప్రకృతిః ॥62॥

పురుషునకు నిజముగ బంధముగాని, మోక్షముగాని, సంసారముగాని లేదు. పురుషుని సాన్నిధ్యమువలన ప్రకృతియే బంధ మోక్ష సంసారముల ననుభవించు చున్నది. కాగా ప్రకృతి గతములగు బంధ మోక్ష సంసారములు పురుషునియం దారోపింపబడుచున్నవని భావము. లోకమున సేవకులు ప్రభువు నాశ్రయింతురు. కాన వారి జయాపజయములు గాని, వాని ఫలమగు ఆనంద శోకములుగాని, స్వామి భృత్యభావ రూపమగు సంబంధమును బట్టి ప్రభువును జెందుచున్నవి. ఇట్లే ప్రకృతియందుండెడి బంధమోక్షములు ప్రకృతిసంబంధ మునుబట్టి వివేకజ్ఞానములేని పురుషునం దారోపింప బడు చున్నవి.

సంసార బంధమోక్షములు ప్రకృతి గతములనియు పురుషునియం దారోపింపబడుచున్నవనియు, నిరూపించితిరే; ప్రకృతియం దీ సంసార బంధ మోక్షము లెట్లు సిద్ధించుచున్నవి? అను శంకకు సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ రూపైస్సప్తభిరేవం బధ్నాత్యాత్మాన మాత్మనా ప్రకృతిః।
సైవచ పురుషార్థం విమోచయత్యేకరూపేణ ॥63॥

ధర్మాధర్మ, జ్ఞానాజ్ఞాన, వైరాగ్యా వైరాగ్య, ఐశ్వర్యా నైశ్వర్యము లను ఎనిమిది భావములు ప్రకృతియందు కలవు. వీనిలో జ్ఞానమును విడిచిపెట్టి, మిగిలిన యేడుభావములచేతను, ప్రకృతి, పురుషుని భోగముకొఱకు తన్ను తానే బంధించుకొనుచున్నది. ఆ ప్రకృతియే శేషించిన ప్రకృతి పురుష వివేకఖ్యాతి రూపమగు జ్ఞానముచేత తన్ను తానే విడిపించుకొనుచున్నది. అనగా బంధము ధర్మాధర్మాది భావసప్తమున కధీనము. మోక్షము ప్రకృతి పురుష వివేకఖ్యాత్యధీనము నగుచున్నవి. వివేకఖ్యాతి కలిగిన పిమ్మట భోగాపవర్గములు లేవని భావము.

పైని నిరూపించిన తీరున ప్రకృతి పురుషవివేకము (భేదము) సిద్ధించినది. కాని దీనివలన ప్రయోజనమేమి? అను ప్రశ్నకునుత్తర మీయబడుచున్నది.

శ్లో॥ ఏవం తత్త్వాభ్యాసా న్నాస్మిన మేనాహ మిత్య పరిశేషమ్।
అవిపర్యయాద్విశుద్ధం కేవల ముత్పద్యతే జ్ఞానమ్ ॥64॥

తత్త్వమనగా వాస్తవమయినది. అభ్యాసమనగా ఆవృత్తి. ఈ యభ్యాసము సాధ్యమునకుగాని, సిద్ధమునకు సంభవింపదు. కాన తత్త్వశబ్దమునకు తత్త్వజ్ఞానమని యర్థము. కాగా ప్రకృతి

పురుష వివేకజ్ఞానము చిరకాలము తెంపులేకుండ నభ్యసింప బడినయెడల ప్రకృతి పురుషులందుండెడి భేదము ప్రత్యక్ష గోచర మగును. అనగా గురూపదేశమువలన ప్రకృతి పురుషులకు పరోక్షరూపమయిన వివేకజ్ఞానము కలుగును. అట్టి పరోక్ష జ్ఞానాభ్యాసమువలన అపరోక్ష (ప్రత్యక్ష)జ్ఞాన ముదయించును. ఇదియె మోక్షసాధనమని భావము. అభ్యాసమునందు ఏది విషయమగుచున్నదో అదియే సాక్షాత్కారమునందును విషయమగును. కాన తత్త్వాభ్యాసమువలన తత్త్వసాక్షాత్కారమే కలుగును. కావుననే సాక్షాత్కారము విశుద్ధమని చెప్ప బడినది. విశుద్ధమనగా యథార్థమని యర్థము. సంశయము, విపర్యాసము అనునవి జ్ఞానమందుండెడి యశుద్ధులు. ఏకరూప మగు వస్తువును అనేకరూపములుగ గ్రహించుటవలన సంశ యముగూడ విపర్యయమే అగుచున్నది. కాగా విపర్యాసము లేనందున అభ్యాసమువలన గలిగిన సాక్షాత్కారము విశుద్ధమే యగుచున్నది.

"మీరు చెప్పినట్లు తత్త్వాభ్యాసమువలన తత్త్వ సాక్షాత్కార ముదయించవచ్చును. అట్లే యనాదియగు మిథ్యాజ్ఞాన ముయొక్క సంస్కారమువలన మిథ్యాజ్ఞానమును పుట్టవచ్చును. కాగా దానివలన సంభవించెడి సంస్కార మెట్లుపోవును" అని శంకింపరాదు. మిథ్యాజ్ఞానము, తత్సంస్కారములును, అనాదు లయినను, తత్త్వాభ్యాసమువలన గలిగిన తత్త్వసంస్కారము తత్త్వసాక్షాత్కారమును బుట్టించి తద్ద్వారమున మిథ్యాజ్ఞాన మును తత్సంస్కారములను నిర్మూలించును. బుద్ధులకు వస్తువుల

నిజరూపమును గ్రహించుటయందే పక్షపాతము(అనురాగము) గదా! అనగా నొకసారి వస్తుతత్త్వమును గ్రహించిన బుద్ధి యెన్నడును ఆతత్త్వమునుండి విముఖము కానేరదని భావము. బుద్ధికి సత్యార్థమునందు పక్షపాతము కలదు. కాన మిథ్యాజ్ఞానము లెంత ప్రయత్నించినను, నిర్దుష్టమును, యథార్థము నగు వస్తువునకు మిథ్యాజ్ఞానములవలన బాధ లేదను విషయమును బౌద్ధులు సయితమంగీకరించియున్నారు. నాస్మి—నమే—నాహమ్—అని తత్త్వసాక్షాత్కారముయొక్క స్వరూపము చెప్పబడినది. అసధాతువు క్రియాసామాన్యమును బోధించును. కాన నాస్మి—అను పదమువలన ఆత్మనిష్క్రియమని దెలియవలయును. అహమ్—అనుపదము ఆత్మకు కర్తృత్వమును నిషేధించుచున్నది. కావుననే స్వామిత్వమును లేదు. కర్తయేగదా స్వామి యగుచున్నాడు. కాగా అధ్యవసాయము, అభిమానము, సంకల్పము, ఆలోచనము, అని ఆంతరక్రియలు నాలుగువిధములు. మిగిలినవి బాహ్యక్రియలు. పురుషు డీరెండు రకములగు క్రియలు లేనివాడు కాన, కర్త కాజాలడు. కావుననే స్వామియు కాడు. మఱి యెట్టివాడన, అసంగుడు, చిద్రూపుడు అనెడి జ్ఞానము తత్త్వజ్ఞానమని భావము. లేదా నా = పురుషుడు, అస్మి = అయితిని. అనగా నాకు ప్రసవమను ధర్మము లేదు ప్రసవము ప్రకృతి ధర్మమేకాని పురుషధర్మము కాదు. కావున నేను కర్తనుగూడ కాను. కాన నాకు దేనియందును స్వామిత్వము లేదు అను సాక్షాత్కారము తత్త్వసాక్షాత్కారము.

పైని నిరూపింపబడిన తత్వసాక్షాత్కార ముదయించి నను తనకు తెలియని వస్తువేదైన నుండవచ్చును. కాగా "అజ్ఞానము పూర్తిగ నశింపనందున ఆ మిగిలిపోయిన అజ్ఞానమే మనకు బాధకమేల కారాదు" అని శంకింపవలదు. ఆత్మ-అసంగము, చిద్రూపము, అకర్త, నిష్క్రియము, అను జ్ఞాన ముదయించినపుడు ఇక బంధహేతువగు అజ్ఞానము మిగులదు. కాన బంధము పీడదను భయమున కవకాశము లేదు. ఈ విషయము "నిరవశేషమ్" అను పదముచే నిరూపింపబడినది.

ఇక తత్వసాక్షాత్కారమునకు ఫలము నిరూపింపబడుచున్నది.

శ్లో॥ తేన నివృత్త ప్రసవా మర్థవశాత్సప్తరూపవినివృత్తామ్।
ప్రకృతింపశ్యతి పురుషః ప్రేక్షకవదవస్థితః సుస్థః ॥65॥

భోగము, వివేకఖ్యాతియు ప్రకృతివలన బుట్టుచుండును. ఆ రెండును ఇదివరకే ప్రకృతివలన సిద్ధించినవి. కాన ప్రకృతి భోగముకొఱకు ప్రవర్తింపక యూరకుండును. మఱియు ధర్మాధర్మ, జ్ఞానా జ్ఞాన, వైరాగ్యా వైరాగ్య, ఐశ్వర్యా నైశ్వర్యములు అజ్ఞానమూలకములు. కేవల తుష్టికలవారి వైరాగ్యమును అజ్ఞానమూలకమే యగును. కాన తత్వజ్ఞానము తనకు విరోధియగు అజ్ఞానమును బాధించును. తోడనే అజ్ఞానమూలకములగు పైని చెప్పిన యేడు భావములు నివర్తించును. కాగా ప్రకృతి సప్తరూప వినిర్ముక్తమై యుండును. అట్టి ప్రకృతిని నిష్క్రియుడును రజస్తమోగుణకలుషితమగు బుద్ధిసంబంధము లేనివాడును నగు పురుషుడు తటస్థునివలె జూచుచుండును.

కావుననే ఆ యవస్థయందును సాత్త్విక బుద్ధి సంబంధము కొద్దిగా నుండును. లేనియెడల నట్టి ప్రకృతిని జూచుట పొసగనేరదు.

"అయ్యా తాము నిరూపించిన యవస్థయందును పురుషునియందు భోక్తృత్వ యోగ్యతారూపమగు చైతన్యమును ప్రకృతియందు భోగ్యత్వ యోగ్యతారూపమగు జడత్వమును సహజము లగుటవలన నుండకతప్పదు. కాగా ప్రకృతికి ప్రసవశక్తి యెట్లు నివర్తించినది? ప్రసవశక్తి ఉన్నను ప్రసవింపదగిన దేదియు లేనందున, ప్రసవ ముండదనుటయు సరికాదు. ఇదివరకు ప్రసవించిన శబ్దాదులవంటి శబ్దాదులను కనవచ్చునుగదా" అను శంకకు సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ దృష్టామయేత్యుపేక్షక ఏకోదృష్టాహమిత్యుపరమత్యన్యా॥
సతిసంయోగే పితయోః ప్రయోజనం నాస్తిసర్గస్య ॥66॥

పురుషుడు, ప్రకృతి తనచే జూడబడినదని నిశ్చయించి, తిరిగి తానాప్రకృతిని జూడనొల్లడు. ప్రకృతియు, పురుషుడు తన్ను జూచినాడను తలంపున, తన్ను పురుషునకు జూపవలెనను యత్నమునుండి మరలును. కావున వారికి సాన్నిధ్యమున్నను సర్గము మాత్రముండదు. వివేకఖ్యాతి జనింపనంతదనుక, ప్రకృతి పురుషుని భోగముకొఱకు శబ్దాది విషయముల సృజించుచుండును. వివేకఖ్యాతి గలిగిన పిదప, మరి శబ్దాదుల సృజింపదు. ఏలయన వివేకఖ్యాతి కలుగునంతవఱకే పురుషుడు విషయముల ననుభవించుచుండును. వివేకఖ్యాతి కలిగినపిమ్మట బీజములేని యంకురమువలె విషయోపభోగమును పోవును. ప్రకృతిధర్మములును, సుఖదుఃఖమోహాత్మకములునగు, శబ్దాదివిషయములను

పురుషుడు తనకుగల యవివేకమునుబట్టి, తనవనుకొని వాని ననుభవించుచుండును. ఇట్లే ప్రకృతిసిద్ధమగు వివేకఖ్యాతిని గూడ ఇది తనకొఱ కేర్పడినదని తలంచుచుండును. వివేకము కలవాడు తనకును ప్రకృతికిని నిజమున కేమియు సంబంధము లేదని నిశ్చయించుకొని ప్రకృతిసిద్ధములగు శబ్దాది విషయము లనుకాని వివేకఖ్యాతినిగాని తనకు కావలయునని యిచ్ఛగింపడు. పురుషునికొఱ కేర్పడిన భోగవివేకములు రెండును ప్రకృతి సర్గమునకు ప్రేరకములు. పురుషుడు వానిని విడిచిన కోడనే, యవియు ప్రకృతికి ప్రేరకములు కానేరవు. కాగా సర్గమునకు ప్రేరకము లేనందున సర్గమును లేదు. ఈ విషయమే "ప్రయోజనం నాస్తిసర్గస్య" అను వాక్యముచే జెప్పబడినది. ప్రయోజనమన ప్రేరకమని యర్థము.

"తత్త్వజ్ఞానము కలిగినతోడనే మోక్షము సిద్ధించునందు వేని, వెంటనే శరీరము పడిపోవలయును. అప్పుడు 65వ-కారికలో చెప్పిన చొప్పున పురుషుడు ప్రకృతిని జూచుట సంభవింపదు. తత్త్వజ్ఞాన ముదయించినను, కర్మక్షయము కానంత వఱకు మోక్షము సిద్ధింపదందు వేని అపుడు కర్మక్షయము మోక్షసాధన మనవలెనుగాని తత్త్వజ్ఞానము మోక్షసాధన మనుట యెట్లుపొసగును? మఱియు అనంతమగుసట్టియు, ఏకకాలమున పక్వము కానట్టియు, కర్మలకు భోగమువలన నిశ్శేష క్షయము ఎన్నడును కలుగనేరదుగదా! కాగా కర్మక్షయము మోక్ష సాధన మనుటమాత్ర మెట్లు పొసంగును?" అను శంకకిట సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ సమ్యగ్జ్ఞానాధిగమా ద్ధర్మాదీనా మకారణ ప్రాప్తౌ ।
తిష్ఠతి సంస్కారవశా చ్చక్రభ్రమివ ద్ధృతశరీరః ॥67॥

అవిద్యాది క్లేశములనెడి నీటితో తడపబడిన బుద్ధి యనెడి క్షేత్రమున కర్మలనెడి బీజములవలన విషయములనెడి యంకురము లుద్భవించుచున్నవి. తత్త్వజ్ఞాన మనెడి గ్రీష్మముచే క్లేశసలిలము లింకిపోయినపుడు బుద్ధియను నూషరక్షేత్రమున కర్మబీజములవలన విషయాంకురము లెట్లుపుట్టును? కాన తత్త్వసాక్షాత్కారమువలన ననాదియు నేక కాలమున ఫలోన్ముఖము కానట్టియు కర్మసంస్కారసముదాయము నశించిన సామర్థ్యము కలదగును. అనగా బుద్ధియందుండెడి ధర్మాదులు కార్యోత్పాదకములు కానేరవని భావము. లోకమున కుమ్మరి కఱ్ఱతో నొకసారి చక్రమును ద్రిప్పి యూరకుండును. అయినను వేగమునుబట్టి కొంతకాల మా చక్రము తిరుగును. పిదప నిశ్చలముగ నుండును. అట్లే ఫలోన్ముఖములగు ధర్మాధర్మములు వర్తమాన శరీరము నారంభించును. వాని ననుభవించినగాని ఆ శరీరమునశింపదు. అంతవఱకు జ్ఞానికి శరీరసంబంధము తప్పదు. జ్ఞానమువలన నజ్ఞానము నశించినను అవిద్యాసంస్కారము వలన శరీరమును ధరించును. అప్పుడు జీవన్ముక్తుడనబడును. కొంతకాలమున కీ శరీరము పడిపోవును. అప్పుడు విదేహముక్తుడగును. ఈ విషయమే క్రింది కారికయందు నిరూపింపబడుచున్నది.

శ్లో॥ ప్రాప్తేశరీరభేదే చరితార్థత్వా త్ప్రధాన వినివృత్తౌ
ఐకాంతికమాత్యంతిక ముభయం కైవల్య మాప్నోతి ॥68॥

ఆరబ్ధకార్యములనియు, అనారబ్ధకార్యములనియు, కర్మలు రెండు విధములగుచున్నవి. వానిలో ననారబ్ధకార్యములగు కర్మలన్నియు తత్వజ్ఞానమువలన నశించును. ప్రారబ్ధము మాత్ర మనుభవమువలన నశించును. తరువాత శరీరము నశించును. ప్రకృతియు కృతార్థయగుటవలన నా పురుషుని విడిచిపెట్టును. కాగా నిశ్శేషముగ త్రివిధ దుఃఖములు నశించును. ఇదియే ఐకాంతికాత్యంతిక కైవల్యము.

ఇట్లు సప్రమాణముగ నిరూపింపబడిన యీ యర్థము మహర్షిచే నుపదేశింపబడినదని శ్రోతలకు శ్రద్ధకలుగుటకొఱకు నిరూపింపబడుచున్నది.

శ్లో॥ పురుషార్థజ్ఞానమిదం గుహ్యం పరమర్షిణా సమాఖ్యాతమ్ ।
స్థిత్యుత్పత్తి ప్రలయాః చింత్యంతే యత్రభూతానామ్ ॥69॥

ఏవివేక జ్ఞానసిద్ధికొఱకు భూతములయొక్క ఉత్పత్తిస్థితి లయములు నిరూపింపబడినవో స్థూలబుద్ధులకు గోచరముకానట్టి యీ ప్రకృతి పురుష వివేకఖ్యాతి కపిలమహర్షిచే తొల్లి నిరూపింపబడినది.

ఈ గ్రంథము కపిలమహర్షి ప్రణీతముకాదు. దీనిని ఈశ్వరకృష్ణుడు రచించెను. కాగా దీనియందు మాకెట్లు విశ్వాసముండు నను శంకకు సమాధానము చెప్పబడుచున్నది.

శ్లో॥ ఏతత్పవిత్రమగ్ర్యం మునిరాసురయే నుకంపయాప్రదదౌ ।
ఆసురిరపి పంచశిఖాయ తేనచ బహుధాకృతంతంత్రమ్ ॥70

దుఃఖత్రయ హేతువగు పాపమును తొలగించును కాన పవిత్రమగువానిలో ముఖ్యమగు నీ శాస్త్రమును కపిలమహర్షి

తన శిష్యుడగు నాసురికి దయతో నుపదేశించెను. అతడు తన శిష్యుడగు పంచశిఖాచార్యున కుపదేశించెను. ఆ పంచశిఖాచార్యు డీ తంత్రమును విపులముగ నిరూపించెను.

శ్లో॥ శిష్యపరంపరయాఽఽగత మీశ్వరకృష్ణేన చైతదార్యాభిః।
సంక్షిప్తమార్యమతినా సమ్యగ్విజ్ఞాయ సిద్ధాంతమ్ ॥71॥

శిష్యపరంపరా ప్రాప్తమగు ఈ తంత్రమును, సాంఖ్య సిద్ధాంతమును బాగుగ పరిశీలించిన ఈశ్వరకృష్ణుడు సంగ్రహముగ నిరూపించెను.

శ్లో॥ సప్తత్యాం కిల యేఽర్థాస్తేఽర్థాః కృత్స్నస్య షష్టి తంత్రస్య।
ఆఖ్యాయికా విరహితాః పరవాదవివర్జితాశ్చాపి ॥72॥

ఉపాఖ్యానములను నితర దర్శనకర్తలయొక్క వాదములను విడిచిపెట్టి యీ షష్టితంత్రమునందలి యర్థముల నన్నిటిని డెబ్బది యార్యాగీతులచే సులభముగ నిరూపించితిని. దీనికి షష్టితంత్రమను పే రిట్లువచ్చినది. 10 మౌలిక పదార్థములు 5 విపర్యయములు 9 తుష్టులు 8 సిద్ధులు 28 కరణాశక్తులు మొత్తము అఱువది పదార్థములు. వీనిలో మౌలికపదార్థములు తప్ప మిగిలినవన్నియు నిదివఱకే ఆయా సందర్భముల నిరూపింప బడినవి. మౌలికము లిట్లు భోజవార్తికమునందు జెప్ప బడినవి. 1 ప్రధాన సత్త, 2 ప్రధానైకత్వము, 3 ప్రధానమున కర్థవత్త్వము, 4 ప్రధానపురుష భేదము, 5 ప్రధానపరార్థత్వము 6 పురుష బహుత్వము, 7 ప్రధానపురుష సంయోగము, 8 ప్రధానపురుష వియోగము, 9 ప్రధానమునకు పురుష శేషత్వము, 10 పురుషున కకర్తృత్వము నను నీ పదియు

మూలికపదార్థములు. మూలికములన తొలుతటినుండియు నీ పదార్థములు నిరూపింపబడినవని భావము.

శ్లో॥ మనాంసి కుముదానీవ బోధయంతీ సతాంముదే।
శ్రీవాచస్పతి మిశ్రాణాం కృతిస్తాత్తత్వ కౌముదీ॥

వాచస్పతి మిశ్రునిచే వ్రాయబడిన యీ సాంఖ్య తత్వ కౌముది కలువలవంటి సత్పురుషుల మనస్సులను వికసింపజేయుచు వారలకానందము నొసంగుచు చిరకాలముండుగాత.

ఇట్లు ఆంధ్రీకృత సాంఖ్యతత్వ కౌముది ముగిసినది.

# టిప్పణము

## 1. కారిక.

1. సాంఖ్యదర్శనమునందీ సూత్రములను జూడుడు.
అ 1. 1–5.

2. ఆంతరోపాయ సాధ్యమనియు బాహ్యోపాయసాధ్య మనియు దుఃఖము రెండువిధములు. ఆంతరోపాయసాధ్యము ఆధ్యాత్మికము. బాహ్యోపాయసాధ్య మాధిభౌతికము, ఆధిదైవిక మని రెండువిధములు. 'ఆత్మానం-శరీరమ్, అంతఃకరణంచ, అధికృత్య జాయత ఇత్యాధ్యాత్మికమ్' అను వ్యుత్పత్తివలన నాధ్యాత్మికము శారీరమనియు, మానసికమనియు ద్వివిధము. మానసిక దుఃఖమునందు కామాదులు ఇష్టాదర్శనానిష్టదర్శనములును కారణములుగ వాచస్పతిచే జెప్పబడినవి.

ప్రియసంబంధ రాహిత్యమువలనను అప్రియ సంబంధము వలనను మానసికదుఃఖము పుట్టుచున్నదని గౌడపాదమతము.

కామాదులు దుఃఖమునకు సాక్షాత్కారణములు. ప్రియ సంబంధ రాహిత్యము అప్రియసంబంధమును కామాదులకు కారణములు కాగా వాచస్పతి దుఃఖకారణములగు కామాదులను తత్కారణములగు ప్రియసంబంధ రాహిత్యాదులను చెప్పెను. గౌడపాదులు కారణకారణములను (అన్యథాసిద్ధములను)మాత్రము చెప్పిరి.

ఆధిభౌతిక విషయమున వాచస్పతి గౌడపాదమాధరు లకు విశేషభేదములేదు. కాని ఉదాహరణ సందర్భమున గౌడ పాదులు జరాయుజములు, అండజములు, స్వేదజములు ఉద్భిజ్జ ములనెడి చతుర్విధభూతములవలన పుట్టినది ఆధిభౌతికమని వ్రాసిరి.

ఇట భూతపదము ప్రాణుల జెప్పును. కాగా వ్యాఘ్ర చోరాదిజన్యము ఆధిభౌతికమని నారాయణభట్టుడనుచున్నాడు.

విష్ణుపురాణమందు (VI-5) పిశాచ రాక్షసాదులవలన గలిగిన దుఃఖము ఆధిభౌతికాంతర్గతమని చెప్పబడినది.

'దేవానామిదమ్–దైవమ్, దివః ప్రభవతీతిదైవమ్' అను వ్యుత్పత్తులవలన దైవము యక్షరాక్షసాది జన్యమనియు విద్యు ద్వర్షాది జన్యమనియు రెండురకములు. ఇందు మొదటి యర్థ మును వాచస్పతి గ్రహించెను. రెండవ యర్థమును మాధరుడు గ్రహించెను. గౌడపాదులు రెండురకముల వ్యుత్పత్తిని వ్రాసిరి. కాని ఉదాహరణమును మాత్ర మొక్కదానికే చూపిరి. నారాయణుడు మాత్రము రెండురకముల ఉదాహరణమును చూపెను.

ఆధ్యాత్మికాధి దైవికాధిభౌతిక పదములకు రఘునాధుని యర్థమిది. 'ఆత్మానమ్–త్రయోదశకరణాని అధికృత్యజాయత ఇత్యాధ్యాత్మికమ్, భూతాని త్రయోదశకరణవిషయాణి అధికృత్య జాయత ఇ త్యాధి భౌతికమ్, దేవతాః ఇంద్రియా ధిష్ఠానదేవతాః అధికృత్య జాయత ఇ త్యాధి దైవికమ్' ఈ మత మున విషయేంద్రియ సంబంధమువలన బుట్టిన దుఃఖము

ఆధ్యాత్మికమును ఆధి భౌతికమును అగుచున్నది. ఇంద్రియాధిష్ఠాన దేవతలవలన బుట్టినది ఆధిదైవికము. భగవద్గీతలోని 8 వ అధ్యాయమునను, భాగవతము 11 స్కంధ 22 అధ్యాయమునను రఘునాథుని వ్యాఖ్యానుకూలముగ నాధ్యాత్మికాది పదార్థ నిర్వచనము కలదు.

దుఃఖమంతయు మానసికమే యగుచున్నది. అయినను మనోమాత్రజన్యమనియు తదితరజన్యమనియు విభాగము నెఱుంగునది. అని విజ్ఞానభిక్షునారాయణులు అనుచున్నారు.

3. అభిఘాతమన నసహ్యమగు సంబంధమని నారాయణుడనుచున్నాడు. దుఃఖవర్తగు నంతఃకరణమునందు చిత్త్వృత్తి ఫలనమని రమేశుని వ్యాఖ్య. వినాశమని మాధరవ్యాఖ్య. అభిభవమని వాచస్పతిటీక. అభిభవమన అనుత్పత్తియని వంశీధరుని యర్థము. భావిదుఃఖాసంబంధమని రమేశుని టీక. దుఃఖ మంతఃకరణ ధర్మము; ఆత్మధర్మము కాదని నిశ్చయించుట అని కృష్ణనాధుని వ్యాఖ్య.

సత్కార్యవాదియగు సాంఖ్యమతమం దభావ రూపములగు ధ్వంసప్రాగభావములు లేవు. వీరి మతమం దుత్పత్తియన నావిర్భావము. ఆవిర్భావముయొక్క పూర్వావస్థయే ప్రాగభావము. ఆవిర్భూత కార్యముయొక్క తిరోభావావస్థ ధ్వంసము. దుఃఖావిర్భావ పూర్వావస్థకు అసమాన కాలికమగు దుఃఖ తిరోభావావస్థ మోక్షము. కాగా మాధరుని వినాశశబ్దమునకు తిరోభావమని యర్థము.

4 దుఃఖత్రయమువలనబుట్టిన జిజ్ఞాస, దుఃఖత్రయము నెట్లు నశింపజేయు ననుశంకకు కర్కటమువలనను అశ్వతరి వలనను గలిగిన సంతతి కర్కటాశ్వతరులకు నాశకమగును. మఱియు సర్పముఖమునుండి వెలువడిన వహ్నివలన సర్పము తృణములును నశించునని మాధవుడు. వనమందు పుట్టిన దావాగ్ని వనమును నశింపజేయుచున్నది. అజ్ఞానజన్యమగు బ్రహ్మజ్ఞాన మజ్ఞానము నెట్లు నశింపజేయుననుశంకకు పటకార్య మగు పటాగ్నిసంయోగము పటమును దహించుచున్నదని ఉదాహరణము సిద్ధాంతలేశ సంగ్రహమందు 3 వ అధ్యాయ మున చెప్పబడినది.

## 2. కారిక

సాంఖ్యద = 1 . 6, 82, 83, సూత్రముల జూడుడు.

కౌముదిలోని 'సహస్రసంవత్సరః' అను నెడ సంవత్సర పదమునకు దినమర్థము. ఈవిషయమును పూర్వమీమాంసలో జూడుడు. (VI. 7 . 13)

అనైకాంతికత్వము, అనాత్యంతికత్వము, అవిశుద్ధి, క్షయము, అతిశయమును వైదిక లౌకిక కర్మలకు సాధారణ ధర్మములు. వీనిలో మొదటి రెంటికిని పై మూడును హేతువులు. ఆత్యంతిక ప్రతీకారమునకు ఆంగ్లమునందు (Radical cure) అనియు, ఐకాంతిక ప్రతీకారమునకు (infallible cure) అనియు వ్యవహారము. వైదికకర్మలు అనైకాంతికములు (తప్పక ఫలమునిచ్చునవికావు) అను విషయమున "మధ్యమపిండము సంతానప్రదమని మంత్రములోనున్నను దానిని భక్షించినవారి

కెల్లరకు సంతానము కలుగుటలేదు" అను దృష్టాంతమును మాఠరుడు చెప్పెను,

ఇట దార్శనికుల కభిప్రాయభేదము కలదు. పూర్వోత్తర మీమాంసలందును, న్యాయదర్శన మందును యాగాదులందలి హింస దుఃఖసాధనము కాదని కలదు. సాంఖ్యమందు ప్రతి హింసయు దుఃఖసాధనమే యగునని చెప్పబడినది. నాగేశుడును యాగమందలి హింసయు దుఃఖసాధనమే యగుననియు, పాయ సాన్నములచే భగవంతుని పూజించుటయే నిరుపద్రవమగు యాగమనియు మంజూషయందు జెప్పెను.

ప్రకృతిపురుషవివేకము మోక్షసాధన మను సాంఖ్య మతమందు పంచాగ్ని విద్య మున్నగు కర్మలవలన బ్రహ్మ లోకమును పొందినవారికి పునరావృత్తి లేదను వేదవాక్య ముతో విరోధమును శంకించి బ్రహ్మలోకమందును ప్రకృతి పురుషవివేకమువలననే మోక్షము సిద్ధించును. కర్మలవలన బ్రహ్మలోకమునకు వెళ్ళినంతమాత్రమున మోక్షము సిద్ధింపదు. అను విషయమును సాం. ద = 1.83 వ సూ॥ విజ్ఞాన భిక్షువు నిరూపించెను.

వ్యక్తమన కార్యము. ఈ వ్యక్తములోని ఘటపటాదులు మనకు ప్రత్యక్ష సిద్ధములు. బుద్ధి తన్మాత్రాదులు అనుమాన గమ్యములు. కాగా వ్యక్తము తనకు సజాతీయమగు కారణము కలది యను అనుమానము మొదిటిది. వ్యక్తావ్యక్తములు కలిసి పనిచేయునవి కాన గృహాదులవలె పరార్థములు అనునది

రెండవ యనుమానము. దీనివలన సత్త్వపురుషభేదజ్ఞానము సిద్ధించునని కృష్ణనాథు డనుచున్నాడు.

వ్యక్తమువలన గలిగిన యవ్యక్తజ్ఞానము, అవ్యక్తము వలన గలిగిన పురుషభేదజ్ఞానమును అనుమానరూపములు. వీనివలన గలిగిన ప్రకృతిపురుషవివేకజ్ఞానము మాత్రము సాక్షాత్కారరూపము. దీనివలననే మోక్షము సిద్ధించుచున్నది. దుఃఖతిరోభావావస్థ మోక్షము. ఆవిర్భావరూపావస్థ అనిత్యమయినను ఆత్యంతిక దుఃఖతిరోభావావస్థమాత్రము నిత్యము కావచ్చును. సాంఖ్యసారమును జూడుడు.

ఆత్మయందు ప్రకృతిభేదజ్ఞానమే మోక్షసాధనము. ప్రకృతియం దాత్మభేదజ్ఞానము మోక్షసాధనము కాజాలదను విషయము "ఆత్మావారే(ద్రష్టవ్యః" అను శ్రుతివలన దెలియుచున్నది. న్యాయమతమందును ఆత్మను అనాత్మకన్న భిన్నముగ దెలిసికొనుటవలననే మోక్షసిద్ధి అని కలదు. కాగా నైయాయికులకును, సాంఖ్యులకును ఈ విషయమునందు సామ్యము కలదు. ఆత్మయొక్క యథార్థజ్ఞానమువలన మోక్షము సిద్ధించును. ఆ జ్ఞానము నిర్వికల్పకమని వేదాంతులనుచున్నారు. అనాత్మయం దాత్మబుద్ధి అవిద్యయని యోగ సూత్రము. ఈ అవిద్య అనాత్మయం దాత్మభేదజ్ఞానమువలన నశించును. కాగా ఆత్మయం దనాత్మభేదజ్ఞానము, అనాత్మయం దాత్మభేదజ్ఞానమును సంపాదించి తద్ద్వారమున అవిద్యను నశింపజేయుచున్నది. కాన నిది అవిద్యానాశమందు ప్రయోజకమగుచున్నదని విజ్ఞానభిక్షువు.

"వ్యక్తావ్యక్తజ్ఞవిజ్ఞానాత్" అను పదమువలన, వ్యక్త విజ్ఞానము, అవ్యక్తవిజ్ఞానము జ్ఞవిజ్ఞానము అని మూడు విజ్ఞానములు సిద్ధించుచున్నవి,

3 కారిక

సాం. ద = 1.61 వ సూత్రమును జూడుడు.

సత్త్వరజస్తమస్సుల సామ్యావస్థ ప్రకృతికి ఉపలక్షణము. అనగా నొకప్పుడు సామ్యావస్థ ప్రకృతియందుండును. మఱియొకప్పుడు వైషమ్యావస్థయందు ఉండదని భావము. ఇట ప్రకృతికిని సామ్యావస్థకును భేదమా, అభేదమా అను విషయమాలోచింపవలసి యున్నది. సామ్యావస్థయన అకార్యావస్థ. సామ్యావస్థతో గూడిన సత్త్వరజస్తమస్సులే మూలప్రకృతి యనుటకు దగిన యుక్తిని పైసూత్రమున (1-61) జూడుడు. "అజామేకాం" అను శ్రుతివలన మూలప్రకృతికి మూలము లేదని తెలియుచున్నది.

4 కారిక

సాం. ద = 1.87 వ సూత్రమును జూడుడు.

ప్రమాణముల సంఖ్యయందు దార్శనికులకు మతభేదము కలదు. ప్రత్యక్ష మొక్కటియే ప్రమాణమని చార్వాకులు. ప్రత్యక్షానుమానములు రెండును ప్రమాణములని బౌద్ధులు వైశేషికులును. ప్రత్యక్షానుమాన శబ్దములు మూడును ప్రమాణములని సాంఖ్యులు పాతంజలులును. ఉపమానముతో గలిపి నాలుగు ప్రమాణములని నైయాయికులు. అర్థాపత్తితో

సహా అయిదు ప్రమాణములని ప్రభాకరుడు. అనుపలబ్ధితో ఆరు ప్రమాణములని భాట్టులు వేదాంతులును. సంభవ – ఐతిహ్యము లతో నెనిమిది ప్రమాణములని పౌరాణికులు. చేష్టతో తొమ్మిది ప్రమాణములని కొందరు. ప్రతిభతో పది ప్రమాణములని మఱికొందఱు ననుచున్నారు.

వాచస్పతి మతమం దుపమానమునకు, ప్రత్యక్షాను మాన శబ్దములం దంతర్భావము. జయమంగళ మతమం దను మాన శబ్దములం దంతర్భావము. మాఠరనారాయణభట్టుల మతమం దనుమానమునం దంతర్భావము. గౌడపాదమతమున శబ్దమునం దంతర్భావము. అర్థాపత్తి కందఱమతమునను అనుమానమునం దంతర్భావము. అనుపలబ్ధికి వాచస్పతిమత మున ప్రత్యక్షమునం దంతర్భావము. మాఠర గౌడపాదులమత మం దనుమానమునం దంతర్భావము. సస్యము ఎండిపోవుట వలన వర్షము కురియుటలేదని నిర్ణయింతుము. ఇది ప్రాగ భావముయొక్క అనుమానము. చంద్రికాకారుల మతమం దను లబ్ధి ప్రత్యక్షమునకు సహకారి. ఇది నైయాయిక మతము నకు సరిపోవుచున్నది. అనుపలబ్ధి విషయమున వాచస్పతి చంద్రికా కారులకు భేదములేదు. అనుపలిబ్ధి, సంభవ, ఐతిహ్య, ప్రతిభలకు గౌడపాద మతమున శబ్దమునం దంతర్భావము. దీనిని విచారింపవలయును. చంద్రికాకార, వాచస్పతి, గౌడ పాదుల మతమందు ఐతిహ్యమునకు శబ్దమునం దంతర్భావము. మాఠరమతమం దనుమానమునం దంతర్భావము. చేష్టను, మాఠర చంద్రికాకారులు మాత్రము గ్రహించిరి. దీనికి వీరి

మతమం దనుమానమునం దంతర్భావము. ఇది నైయాయిక మతసదృశము. ప్రతిభయన ఊహయని వాచస్పతి. అదృష్టమని వ్యోమశివ ప్రభృతులు ననుచున్నారు. యోగ దర్శన విభూతిపాదమున 33 వ సూత్రమును జూడుడు. ఈ ప్రతిభకు, మాఠరమతమందు అనుమానమునం దంతర్భావము. జయమంగళమతమున ప్రత్యక్షానుమానములందంతర్భావము. కాని ఊహారూపమును అదృష్టరూపమునగు ప్రతిభకు ప్రమాణములం దంతర్భావ ముపపన్నమగునా, కాదా, అని విచారింపవలసియున్నది.

అర్థాపత్తి, అభావము, ప్రతిభ, ఐతిహ్యము, సంభవము, ఉపమానము నను ఆఱు ప్రమాణములు జైమిని సమ్మతములని గౌడపాదమాఠర గ్రంథములందు కలదు. కాని మీమాంసకులచే నివి జైమినిసమ్మతములని వ్రాయబడుటలేదు. జైమిని గౌతమునివలె, ప్రత్యేకముగ ప్రమాణముల నిరూపించియుండ లేదు. కుమారిలభట్టు మున్నగువారే నిరూపించిరి. వారైనను ప్రత్యక్షానుమానోపమానాగమార్థాప త్యనుపలబ్ధులు ప్రమాణములని నిరూపించిరి. కాన గౌడపాదమాఠరగ్రంథములకు మూలమగు ప్రాచీనమీమాంసక మత మొకటి ఉండవలయునని తోచుచున్నది.

## 5. కారిక

సాం. ద = 1. 89, 90,101,104, సూత్రముల జూడుడు.

89, 90, సూత్రములందు ప్రత్యక్షలక్షణము నిరూపింప బడినది. 100|వ సూత్రమునం దనుమానలక్షణమును 101 వ

సూత్రమున శబ్దలక్షణమును నిరూపింపబడినవి. 104 వ సూత్రమందు అనుమాన విభాగము చూపబడినది.

చిత్తవృత్తి ప్రమాణమనుటవలన తార్కికసమ్మతములగు నింద్రియములు ప్రమాణములని సాంఖ్యమతము కాదు.

తార్కికమతమందు ఏది వ్యవసాయాత్మకజ్ఞానమో దానిని సాంఖ్యులు ప్రమాణమనుచున్నారు. ఏది అనువ్యవసాయాత్మకజ్ఞానమో, సాంఖ్యమతమందు అది ప్రమయగుచున్నదని పూర్ణచంద్రుని మతము.

తొలుత విషయేంద్రియ సంయోగము కలుగును. దీనినింద్రియవృత్తి యందురు. దీనివలన బుద్ధియందలి తమోగుణము అభిభూతమగును. పిమ్మట సత్వగుణము ప్రజ్వరిల్లును. దీనిని అధ్యవసాయమనియు, జ్ఞానమనియు, బుద్ధివృత్తియనియు వ్యవహరింతురు. ఇది విషయాకారము కలది. ఇదియే ప్రమాణము. ఇది జడమయినను స్వచ్ఛమయినది గాన దీనియందు పురుషుని ప్రతిబింబము కలుగును. అపుడీ బుద్ధి వృత్తి విషయమును ప్రకాశింపజేయును. అద్దమందు ముఖము ప్రతిఫలించినపుడద్దమందలి మాలిన్యము ముఖమునందువలె, బుద్ధి వృత్తియందు పురుషుడు ప్రతిఫలించిన తోడనే బుద్ధి ధర్మములు పురుషధర్మములవలె భాసించును. దీనినే చేతనానుగ్రహమనియు, పౌరుషేయ బోధయనియు చెప్పుదురు. ఇదియే ప్రమాణఫలమగు ప్రమయని వాచస్పతి మతము.

బుద్ధివృత్తియందు పురుషుడు ప్రతిబింబించినట్లే పురుషుని యందు బుద్ధివృత్తియు ప్రతిఫలించును. దీనినే ప్రమయందు రని విజ్ఞానభిక్షు వనుచున్నాడు.

"ప్రమాతా చేతనశ్శుద్ధః ప్రమాణం వృత్తిరేవనః ।
ప్రమార్థాకార వృత్తీనాం చేతనే ప్రతిబింబనమ్॥

అను యోగవార్తికము తన మతమున కనుకూలమని భిక్షు వనుచున్నాడు. వీరిరువురి మతములందును పరస్పరసాన్నిధ్య మును బట్టి, బుద్ధికి చైతన్యావభాసము, పురుషునకు బుద్ధి ధర్మావభాసమును సమానము. ఈ యవభాసము వాచస్పతి మతమునం దొకే ప్రతిబింబమువలన కలుగుచున్నది. పురుషు నకు పరిణామము లేనందున, అతనికి విషయగ్రహణసిద్ధి కొఱకు పురుషునియందు వృత్తి ప్రతిఫలన మంగీకరింపవలెనని భిక్షు మతము. అధ్యవసాయమునకును పురుషునకును గల సంబంధమే ప్రమయని కొందఱనుచున్నారు.

చేతనానుగ్రహము ప్రమ. అనుగ్రహమన నారోపిత మైన సంబంధము. అనగా బుద్ధివృత్తియందలి పురుష ప్రతి బింబమునకు పురుషుడు సాధకుడగుటయే ప్రమయని కొంద ఱనుచున్నారు. ఈ మతమున బుద్ధివృత్తులు రెండు. ఒకటి అధ్యవసాయ మను అనుద్భాస్యమానమగు వృత్తి. దీనికి చైతన్యసంబంధమువలన ఉద్భాస్యమానమగు మఱియొకవృత్తి పుట్టును. వీనిలో మొదటిది ప్రమాణము. రెండవది ప్రమయు నగుచున్నవి.

విషయాకారముకల చిత్తవృత్తియందు, చైతన్య ప్రతిబింబమువలన బుద్ధి ధర్మములకు జ్ఞానాదులందు ఆత్మీయత్వాభిమానముకాని, చైతన్యమునం దట్టి బుద్ధి వృత్తి ప్రతిబింబము కాని, ప్రమ అని కొందఱనుచున్నారు. (రమేశచంద్రుని టీకను జూడుడు.)

గౌడపాద భాష్యమందు విషయముల కింద్రియములతో నుండెడి సంబంధమే ప్రత్యక్ష ప్రమాణమని నిరూపింపబడినట్లు తోచుచున్నది.

ప్రమ పురుషధర్మమను పక్షమున బుద్ధి వృత్తియే ప్రమాణమగుచున్నది. ప్రమ బుద్ధిధర్మమను పక్షమునం దింద్రియసన్నికర్షయే ప్రమాణమగుచున్నది. పౌరుషేయ బోధ, బుద్ధివృత్తి, రెండును ప్రమ యను పక్షమున బుద్ధివృత్తి, ఇంద్రియ సన్నికర్ష, రెండును ప్రమాణములు కావచ్చును అని భిక్షువనుచున్నాడు.

సాంఖ్యమతమం దింద్రియములు ప్రమాణ మను వ్యవహారము, పరంపరను బట్టి కాని, సాక్షాత్తుగ కాదు. మఱియు బుద్ధివృత్తి ఇంద్రియములవలన పుట్టదు. బుద్ధివలన పుట్టిన బుద్ధివృత్తికి ఇంద్రియములవలన విషయాకారము సిద్ధించును. అని రామశాస్త్రి భాండారిగారనుచున్నారు. వీరి మతమందాంతర వృత్తులకు విషయాకార మెట్లు సిద్ధించునని విచారింపవలయును.

పూర్వవత్తనియు, శేషవత్తనియు, సామాన్యతోదృష్టమనియు ననుమానము మూడు విధములు. పూర్వవత్తన

కారణలింగకము. శేషవత్తన కార్యలింగకము. సామాన్యతో దృష్టమన కార్యకారణ భిన్నలింగకము అని యొకపద్ధతి. వీని కుదాహరణములు. మేఘోన్నతిచే వర్షము కురియగలదు అని పూర్వవత్తున కుదాహరణము. నదియొక్క సంపూర్ణప్రవాహమునుబట్టి, వర్షము కురిసినదని నిర్ణయించుట శేషవత్తున కుదాహరణము. ఒకతావునందుండిన మనుజు డింకొకతావునందుండుటకు గమనము కారణము. కాగా ఒక తావునందున్న సూర్యు డింకొక తావునం దుండుటను బట్టి సూర్యునందును గమనమున్నదని నిర్ణయించుట సామాన్యతోదృష్టము.

ఒకడు రెండు వస్తువులను మొదట చూచును. ఆ చూచిన రెండిటిలో నొకదానిని మఱియొకప్పుడు చూచి రెండవదాని నూహించుట పూర్వవత్తు. శేషవత్తన పరిశేషానుమానము. అనగా ఒక వస్తువు నాలుగింటియందు ప్రసక్తమయినపుడు మూటియందు నిషేధింపబడగా మిగిలినదానియందున్నదని స్థిరపఱుచుట.

సామాన్యతోదృష్టమన ఒక వస్తువుయొక్క సామ్యము ప్రకృతహేతువునందుండుటవలన ఆ సామ్యమునుబట్టి ప్రకృత హేతువుచే అప్రత్యక్షమగు దానిని సాధించుట. అని వేఱొక పద్ధతి. వీని కుదాహరణములు. ధూమమువలన వహ్ని కలదని నిర్ణయించుట పూర్వవత్తు. శబ్దము ద్రవ్యమా, గుణమా, క్రియయా అను సంశయము కలిగినపుడు ద్రవ్యమందును, క్రియయందును చేరదని నిషేధింపగా, మిగిలిన గుణమందు చేరునని ర్ణయించుట శేషవత్తు. ఇతరగుణములు (రూపాదులు)

ద్రవ్యము నాశ్రయించుచున్నవి ఈ సామ్యమునుబట్టి ఇచ్ఛాదిగుణములవలన ఆత్మను సాధించుట సామాన్యతో దృష్టము అని వాత్స్యాయన మతము.

సాంఖ్యమతమందును "త్రివిధమనుమానమ్" అని కలదు. త్రివిధము అను పదమునకు మూడవయవములు కలవనియు, మూడు విధములనియు, నర్థము మాఠరవృత్తియందు కలదు. వీనికిని పూర్వవత్తు, శేషవత్తు, సామాన్యతోదృష్టమనియే విభాగము. పూర్వవత్తునకు వాత్స్యాయనోదాహరణము గౌడపాదోదాహరణమును, సమానమే యగుచున్నది. శేషవత్తనుదానికి సముద్రైకదేశమును బట్టి సముద్రమంతయు నుప్పగనే యుండు ననునదియు, సామాన్యతోదృష్టమునకు ఒక మామిడిచెట్టు పూచిన, దాని సామాన్యము (సామ్యము) ను బట్టి స్థలాంతరమునందలి మామిడిచెట్టును పూయుననునదియు గౌడపాదమాఠరులచే నుదాహరణములుగ నీయబడినవి. మఱియు సామాన్యతోదృష్టమునకు వెలుపల వెలుతురుగా నున్నదని ఒకడనిన "చంద్రు డుదయించి యుండవలెనని మఱియొక డనునని" యుదాహరణము మాఠరవృత్తిలో కలదు. "తల్లింగ లింగిపూర్వకమ్" అను పదమునకు లింగపూర్వకమనియు, లింగిపూర్వకమనియు విభాగమునుచేసి దండమును బట్టి సన్యాసిని నిర్ణయించుట లింగపూర్వకమునకును, సన్యాసిని బట్టి దండమును నిర్ణయించుట లింగిపూర్వకమునకును ఉదాహరణములని గౌడపాదు లనుచున్నారు.

వాచస్పతి వ్రాతనుబట్టి సాంఖ్యమతమం దనుమానము వీతమనియు, అవీతమనియు ద్వివిధము. అందు వీతము పూర్వవత్తనియు, సామాన్యతోదృష్టమనియు రెండువిధములు. అవీతమన శేషవత్తు. అన్వయవ్యాప్తిమూలకము, భావసాధకమును అగునది వీతానుమానము. వ్యతిరేక వ్యాప్తి మూలకము, అభావసాధకమును అగునది అవీతాను మానము. ఈ వీతావీతవిభాగము శంకరాచార్యుల మాండూక్యకారికాభాష్యమందు మాత్రము కలదు. అంతకు పూర్వమం దెచ్చట నున్నదను విషయము పరిశీలింపవలసి ఉన్నది. ఉదాహరణముల బట్టి చూడ శేషవత్తను అనుమానమునందు, వాత్స్యాయన గౌడపాదదమాఠరులకు భేదము కనబడుచున్నది. పరిశేషానుమానము శేషవత్తని వాత్స్యాయనుడు. అంశమునుబట్టి అంశిని నిర్ణయించుట అని గౌడపాదులు. మాఠరవృత్తిలోని "సంభావ్యతే" అను పదమును బట్టి అనుమానము సంభావనారూపముగూడ కావచ్చునని తోచుచున్నది.

సాంఖ్యమతమున ప్రకృతిపురుషులకన్న వేఱగునదంతయు, అనిత్యము, కార్యమును అగుచున్నది. కాగా శ్రుతికి అపౌరుషేయత్వ మెట్లు పొసగును ? అను శంకకు "త్రయో వేదా అజాయంత" అను శ్రుతినిబట్టి, శ్రుతికి ప్రకృతివలన స్వతంత్ర పరిణామము నంగీకరింతుమని రమేశు డనుచున్నాడు.

సాంఖ్యమతమున ప్రత్యక్షానుమానాగమములు మూడును బుద్ధియొక్క వృత్తిరూపములగు పరిణామములే యగుచున్నవి. అయినను ఇంద్రియసన్నికర్షమువలన గలిగిన

బుద్ధి వృత్తిని ప్రత్యక్షప్రమాణమనియు, లింగజ్ఞానమువలన గలిగిన బుద్ధివృత్తిని అనుమానప్రమాణమనియు, శబ్దజ్ఞానము వలన గలిగిన బుద్ధివృత్తిని శబ్దప్రమాణమనియు అనుచున్నారు. మఱియు ప్రత్యక్షము సామాన్యవిశేషముల రెంటిని గోచరించును. అనుమానాగమములు, సామాన్యమును మాత్రము గోచరించును. ఇట్లీమూటికిని భేదము నెఱుంగునది.

(క) పదపదార్థసంబంధము ఈశ్వరేచ్ఛారూపమని న్యాయ మతము.

(ఖ) పదార్థాంతరమని ప్రాచీన మీమాంసక మతము.

(గ) భేదాభేదరూపమగు తాదాత్మ్యమని భాట్టమతము.

(ఘ) వాచ్యవాచక భావమునకు మూలమగు తాదాత్మ్య రూపమని, నాగేశ యోగభాష్యకారులమతము.

(ఙ) యోగ్యత అని భూషణకారుల మతము.

(చ) సామర్థ్యరూపమని వేదాంతుల మతము.

ఇందు భూషణకారుల యోగ్యత, వేదాంతుల సామర్థ్యమును ఒక్కటియే యనవచ్చును. భాట్టసమ్మత తాదాత్మ్యమునకును, నాగేశసమ్మత తాదాత్మ్యమునకును భేదమున్నది. నాగేశమతమున తాదాత్మ్యము భేదాభేదరూపము కాదు. కాగా పాతంజల సమ్మతమగు తాదాత్మ్యమే సాంఖ్యమత మందును, పదపదార్థసంబంధము కావచ్చును.

వేదాంతులు భాట్టులును అనుపలబ్ధిని ప్రమాణమని అంగీకరింతురు. అభావము ఇంద్రియమువలననే దెలియును కాన,

అనుపలబ్ధిప్రమాణాంతరము కానేరదని నైయాయిక, సాంఖ్య ప్రాభాకరుల మతము.

సాంఖ్యప్రాభాకరుల మతమం దభావము అధికరణము కన్న వేఱగు పదార్థాంతరము కాజాలదు. నైయాయిక మత మందు మాత్రము అభావము అతిరిక్తపదార్థము. ఈ అభావము "భూతలే ఘటాభావః" అనునపుడు అధికరణమునకు విశేష్యమగును. "భూతలంఘటాభావవత్" అనునపుడు విశేషణమగునని న్యాయమతము. న్యాయమతమందు అభావ ప్రతీతి యింద్రియమువలన గలుగుచున్నది. ఇంద్రియమునకు, యోగ్యానుపలబ్ధి సహకారియగుచున్నది. వేదాంతుల మతమం దనుపలబ్ధి స్వతంత్ర ప్రమాణము. అభావ ప్రమితియు ప్రత్యక్షరూపము కావచ్చును. కాని ప్రత్యక్షమందంతటను ఇంద్రియమే ప్రమాణము కాజాలదు. భావప్రత్యక్షమునం దింద్రియమును, అభావప్రత్యక్షమునందు అనుపలబ్ధియు, ప్రమాణము లగుచున్నవి. న్యాయమతమందును సాంఖ్యమతమందును, ప్రత్యక్షమునందంతటను ఇంద్రియమే ప్రమాణ మగుచున్నది.

కార్యమగు వ్యక్తమువలన కారణమగు అవ్యక్తానుమానము సామాన్యతోదృష్టమగు వీతానుమానము. అవ్యక్తమువలన పురుషానుమానము అవీతానుమానము.

## 6, కారిక

సాం. ద. 1 = 103 వ సూత్రమును జూడుడు.

ఇట కౌముదిలో నధ్యవసాయము రెండుమాఱులు చెప్పబడినది. అందు మొదటిది చిత్తవృత్తిరూప మగు

ప్రమాణము. రెండవది ఫలరూపమగు పౌరుషేయబోధరూప మని యెఱుంగునది.

వాచస్పతిమతమున సామాన్యతోదృష్టమువలన శేష వదనుమానమువలనను, అప్రత్యక్షమగు వస్తువు సిద్ధించును. జయమంగళమతమున సామాన్యతోదృష్టమువలన మాత్రమే అట్టి వస్తువు సిద్ధించును. అనుమానమువలన సిద్ధింపని అత్యంతా పరోక్షమగు వస్తువు ఆగమమువలననే సిద్ధించును.

## 7 కారిక

సాం. ద. 1.108 సూత్రమును జూడుడు.

శ్లో॥ గోయూథంసింహదృష్టిశ్చమండూక ప్లుతిరేవచ ।
గంగాస్రోతః ప్రవాహశ్చ అధికారశ్చతుర్విధః ॥

అనునార్యోక్తిని బట్టి అనుపలబ్ధివదమున కథ్యాహార మని యెఱుంగునది. సింహము పోవుచు మధ్యమధ్యను వెను కకు తిరిగి చూచుచుండును. అట్లే శ్లోకకర్త శ్లోకముల రచించుచు, ఉత్తరశ్లోకమందలి పదమును పూర్వశ్లోకమం దను వర్తింపజేయును. ఇదియె సింహావలోకన న్యాయముచే నధి కార మనబడును.

1. దేశదోషము, 2. ఇంద్రియ దోషము 3. విషయ దోషము 4. అర్థాంతర దోషము అను నాలుగు దోషముల వలన, విషయానుపలబ్ధి కలుగవచ్చును. దూరసామీప్యములు దేశదోషములు. ఇంద్రియఘాత– మనోనవస్థానము లింద్రియ

దోషము౩. సౌక్ష్మ్యము విషయ దోషము. మిగిలిన మూడును అర్థాంతర దోషములు అని జయమంగళమతము.

మాఠరవృత్తియం దెనిమిది దోషముల వలన సత్తగు విషయమునకు అనుపలబ్ధి. ప్రాగభావము, ప్రధ్వంసాభావము, ఇతరేతరాభావము, అత్యంతాభావము, అను నాల్గు దోషముల వలన అసత్తగు విషయమున కనుపలబ్ధి అని కలదు. ఉత్పత్తి కన్నను పూర్వము, ప్రాగభావము వలన ఘటమున కనుపలబ్ధి. నాశానంతరము, ప్రధ్వంసము వలన అసత్తగుఘటమున కనుపలబ్ధి. ఇతరేతరాభావము వలన గోవునం దశ్వమున కనుపలబ్ధి. అత్యంతాభావమువలన, శశవిషాణాదుల కనుపలబ్ధి. అని యెఱుంగునది. అసత్తునకు అనుపలబ్ధి విషయము లేనందు వలననే యుపపన్నము కావచ్చునని తార్కికమతము.

## 8 కారిక

సాం. ద = 1.109, 110, సూత్రముల జూడుడు.

బౌద్ధమతమునందు ప్రధ్వంసాభావరూపమగు కారణము వలన, భావరూపమగు కార్యము పుట్టును. నైయాయిక వైశేషికమతములందు భావరూపములగు అవయవములనుండి, ఉత్పత్తికి పూర్వమందు అసత్తును, ఉత్పత్త్యనంతరము సత్తును అగు కార్యము పుట్టును. ఇట్లనుటవలన నత్యంతా సత్తులగు వంధ్యాపుత్రాదుల కుత్పత్తి శంకకవకాశము లేదు. బీజమందు సూక్ష్మరూపమున నున్న అంకురమే అభివ్యక్త మగుచున్నదని సాంఖ్యమతము.

## 9 కారిక

సాం. ద = 1.114, 118 సూత్రముల జూడుడు.

ఇట కారికయందు "అకరణాత్" అనునది వ్యతిరేక దృష్టాంత ప్రదర్శనపరము. "ఉత్పత్తేఃపూర్వం, కార్యం – సత్ కార్యత్వాత్, యన్నైవం తన్నైవమ్, యథా అసత్" అని తెలియవలయును. ఇట కార్యత్వము సత్తకు వ్యాపకము. కాన వ్యాపకమగు సత్త లేనపుడు వ్యాప్యమగు కార్యత్వ ముండ నేరదు. కాగా సత్తారూపమగు సాధ్యముయొక్క వ్యతిరేక వ్యాప్తి (సత్తాభావ వ్యాపకీభూతాభావ ప్రతియోగిత్వము) కార్యత్వమందు సిద్ధించును. (అసదకరణాత్) అనునది కార్య మగు పక్షమునందుండదు. కాన ఇది హేతువనుటకు వీలులేదు. కావుననే వ్యతిరేకవ్యాప్తికి సూచకమగుచున్నది. కార్యము నకు సత్తను సాధించుటకు, కార్యత్వమే హేతు వనవలయును. ఇట కార్యమంతయు పక్షమగుటవలన అన్వయదృష్టాంతము సంభవింపదు. పటమునకును సత్త సిద్ధముకానందున ఘటమును పక్షముగ జేసి పటమును దృష్టాంతముగ జూపుటయు సరికాదు. కాన కార్యమునకు ఉత్పత్తికన్నను పూర్వము సత్తానుమాన మందును, కార్యకారణముల కభేదానుమానమందును, అన్వయ దృష్టాంతము దుర్లభమగుటవలన నీ యనుమానములు రెండును అవీతానుమానములనియే చెప్పవలయును.

"ఉపాదానగ్రహణాత్" అనుచోటున గ్రహణమన స్వీకార మని మాఠరమతము. సంబంధమని వాచస్పతి మతము. సాంఖ్య మతమున కార్యకారణములకు తాదాత్మ్యము సంబంధము.

వేదాంతుల మతమున భేదము మిథ్యారూపము కాన భేదసహిష్ణువగు అభేదము తాదాత్మ్యమని వారి మతము. సాంఖ్యమతమున మిథ్యారూపమగు భేదము లేనందున వీరి మతమం దభేదమే తాదాత్మ్య మనవలయును.

"స్యాత్మని క్రియానిరోధ...నైకాంతికం భేదం సాధయతి"

ఇట క్రియాశబ్దమువలననే ఉత్పత్తి - నిరోధక్రియలు సిద్ధించుచున్నవి. కాన నిరోధశబ్దముకన్న విరోధశబ్దము సమంజసమని పూర్ణచంద్రు డనుచున్నాడు.

## 10. కారిక

సాం. ద = 1.124 సూత్రమును జూడుడు.

ప్రధానమందు పరిణామ రూపమగు క్రియకలదు గాని పరిస్పంద రూపమగు క్రియలేదు. స్వస్థానమును విడిచి మరియొక స్థానమును పొందుట పరిస్పంద మనబడును. సాంఖ్యమతమున సదృశపరిణామమనియు విసదృశ పరిణామమనియు పరిణామము రెండు రకములు. ఈ విషయమును సాం. ద = 6.42 వ సూత్రమున జూడుడు. సృష్టికాలమందలి పరిణామమంతయు విసదృశము. ప్రళయకాలమందలి పరిణామము సదృశము. సత్త్వరజస్తమోగుణములు సామ్యమును విడువక తమలో తాము మారుచుండుట సదృశపరిణామము. వీనిలో నొక హెచ్చి ఒకటి తగ్గినచో విసదృశపరిణామము. పరిస్పంద రూపమగు పరిణామమును విసదృశపరిణామమే యగుచున్న. పాతంజల దర్శనమం దీ సదృశపరిణామము అలింగపరిణా

మని చెప్పబడినది. పురుషునకు లింగము (భోగసాధనము) కాని పరిణామమున లింగపరిణామందురు. విసదృశపరిణామము ధర్మపరిణామమనియు లక్షణపరిణామమనియు అవస్థాపరిణామమనియు మూడువిధములుగ జెప్పబడినది. ఘటపటాదులు పృథివియొక్క ధర్మపరిణామములు. ఘటము భవిష్యత్త్వమును వదలి వర్తమానలక్షణము కలదగుట లక్షణపరిణామము. వర్తమానములగు గవాశ్వాదులు బాల్యావస్థలను మారుట అవస్థాపరిణామము. ఈ విషయమున యోగదర్శన విభూతి పాదమందలి 15, 16, సూత్రముల జూడుడు.

కారకహేతువనియు జ్ఞాపకహేతువనియు హేతువు ద్వివిధము. అందు ప్రధానము మహత్తత్త్వము, అహంకారము, తన్మాత్రలు, కారకహేతువులు. విపర్యయము, అశక్తి, తుష్టి, సిద్ధి, అనుగ్రహము, జ్ఞాపకహేతువులు. ఇంద్రియములకును మనస్సునకును పైనిచెప్పిన జ్ఞాపకహేతువులందంతర్భావమూ లేక స్వతంత్రముగ జ్ఞాపకహేతుత్వమూ అనువిషయమాలోచింపవలసి యున్నది.

సక్రియము అనగా పరిస్పంద రూపక్రియ కలది అని వాచాస్పతివ్యాఖ్య. నియతకార్యకారిఅని భిక్షుమతము. ఈమతమున ప్రధానము సర్వకార్యకారి అనియు మహదాదికము నియతకార్యకారి అనియు భావము. పరిస్పంద రూపకమగు క్రియ ప్రధాన సాధారణముకాన వాచస్పతి మతమున ప్రధానమందతివ్యాప్తిఅని భిక్షువిట్లు వ్యాఖ్యానమును చేసెను. కాని క్షోభరూపమగు క్రియ ప్రధాన సాధారణమయినను

గమనాగమనాది రూపకమగుక్రియ ప్రధానమందు లేనందున వాచస్పతివ్యాఖ్యయు సంగతమే యగును.

'అనేకం' అనగా సజాతీయ భేదముకలది అని వాచస్పతి వ్యాఖ్య. సర్గభేదమునుబట్టి భిన్నమని భిక్షుమతము. భిక్షు మతమునను సజాతీయ భేదమే సిద్ధించుచున్నది కాని ఒక విశేషము మాత్రము కలదు. వేదాంతిమతమున పురుషున కేకత్వము. అంతఃకరణమునకు నానాత్వము. భిక్షువు వ్రాసిన టీకున సాంఖ్యమతమున పురుషునకు నానాత్వము. అంతఃకరణమున కేకత్వము సిద్ధించుచున్నది. లింగమన జ్ఞాపకమని వాచస్పతి మున్నగువారి మతము. లీనమగునదని గౌడపాదమాఠరుల మతము. కార్యమగు జ్ఞాపకమని భిక్షుమతము.

సావయవపదవ్యాఖ్యాన సందర్భమున వాచస్పతి వ్రాతను బట్టి అప్రాప్తప్రాప్తి రూపకమగు సంయోగము, పరిచ్ఛిన్నములగు బుద్ధ్యాదులకునుగలదని తోచుచున్నది. అవయములన శబ్దస్పర్శ రూప రస గంధములని గౌడపాదులు మున్నగువారి మతము. ఈ మతమున శబ్దాది రహితములగు బుద్ధ్యహంకారములకు సావయవత్వమెట్లు పొసగునని విచారింపవలయును.

## 11. కారిక

సాం. ద = 1.126 వ సూత్రమును జూడుడు.

త్రిగుణపదము సత్త్వాదిగుణపరమని గౌడపాదమతము. అవివేకి = వివేచనాశక్తి రహితము అని జయమంగళ మతము. భిక్షుమతమునందు "అవివేకి విషయః" అనునది కర్మధారయ

సమాసము. కొందఱి మతమున షష్ఠీతత్పురుష సమాసము. విషయ పదమునకు జ్ఞానముకన్నను భిన్నమని యర్థము. దీని వలన యోగాచార్యమతము నిరసింపబడినదని నారాయణభట్టు వ్యాఖ్య. వాచస్పతి మతమున సామాన్యపదము వలన యోగాచార్యమత నిరాస మని యెఱుఁగునది. నారాయణభట్టు మతమున సామాన్యపదము తుల్యార్థకము. గుణములనుబట్టి వ్యక్తావ్యక్తములు తుల్యములని భావము.

వాలంటినస్సు అను రోమక దార్శనికుని మతమున స్పిరిచియల్, సైకిటల్, మెటీరియల్ భేదమున మనుష్యాదులు త్రివిధములని కలదు. డేవిస్ అను సాంఖ్యకారికా వ్యాఖ్యాత పై వాలంటినస్సు మతము సాంఖ్యమత సదృశమని వ్రాసియున్నాడు. స్పిరిచియల్ సాత్వికసదృశమనియు, సైకిటల్ రాజసిక సదృశమనియు, మెటీరియల్ తామసిక సదృశమనియు ఈతనియభిప్రాయము. ఇట గౌడపాదమాఠర వ్యాఖ్యానములందు అవ్యక్త పురుషులందు వ్యక్త వైధర్మ్యమును చెప్పినపుడు ఏకత్వము చెప్పబడినది. కాగా ఈ ఏకత్వమున ఇహలోక పరలోకములందు ఏకరూపుఁడని యర్థము. దీనివలన క్షణికత్వవాదియగు బౌద్ధుని మతము నిరసింపబడినదని కొందఱిమతము. కాని నిత్యమనుటవలననే క్షణికత్వవాదము నిరాకృతము కావచ్చును. కాన సజాతీయభేద రాహిత్యమే ఏకత్వమనవలయును. కాగా అద్వైతమతమునకు వీరి మతము సరిపోవుచున్నది.

త్రైగుణ్యము, అవివేకిత్వము, విషయత్వము, సామాన్యత్వము, అచేతనత్వము, ప్రసవధర్మిత్వము, అను నీ యాఱును వ్యక్తావ్యక్తములకు సాధారణధర్మములు. అహేతుమత్త్వము, నిత్యత్వము, వ్యాపిత్వము, నిష్క్రియత్వము, అనాశ్రితత్వము, అలింగత్వము, నిరవయవత్వము, స్వాతంత్ర్యము, అను నీ యెనిమిదియు, అవ్యక్తమునకు, పురుషునకును, సాధారణములు. అనేకత్వము వ్యక్తమునకు పురుషునికి సాధారణము. ఏకత్వానేకత్వములు, అవ్యక్తమునకు, పురుషునికిగల వైధర్మ్యములు. వ్యక్తావ్యక్త పురుషులకు గల సాధర్మ్య వైధర్మ్యములను దెలుపు పట్టిక.

| | వ్యక్తము | అవ్యక్తము | పురుషుడు |
|---|---|---|---|
| 1 | హేతుమత్త్వము | అహేతుమత్త్వము | అహేతుమత్త్వము |
| 2 | అనిత్యత్వము | నిత్యత్వము | నిత్యత్వము |
| 3 | అవ్యాపిత్వము | వ్యాపిత్వము | వ్యాపిత్వము |
| 4 | సక్రియత్వము | నిష్క్రియత్వము | నిష్క్రియత్వము |
| 5 | అనేకత్వము | ఏకత్వము | అనేకత్వము |
| 6 | ఆశ్రితత్వము | అనాశ్రితత్వము | అనాశ్రితత్వము |
| 7 | లింగత్వము | అలింగత్వము | అలింగత్వము |
| 8 | సావయవత్వము | నిరవయవత్వము | నిరవయవత్వము |
| 9 | పారతంత్ర్యము | స్వాతంత్ర్యము | స్వాతంత్ర్యము |

అవివేకి యను పదమునకు, సత్త్వరజస్తమోగుణముల కన్న వేఱుచేయుటకు వీలులేనిదను నర్థము సర్వసమ్మతము. వాచస్పతి, సంభూయకార్యకారిత్వమని మఱియొక అర్థమును

గూడ వ్రాసెను. సంభూయకార్యకారిత్వమనగా సత్త్వరజ స్తమోగుణములు పరస్పరము నపేక్షించి కార్యమును సాధించుట. వీనిలో నొకదాని కుద్రేకమున్నపుడు విసదృశపరిణామమును ఉద్రేకములేనియెడల సదృశపరిణామమును కలుగును. ఈ సంభూయకార్యకారిత్వము వ్యక్తావ్యక్తములకు సాధారణ ధర్మము.

"అవివేకివిషయః" అనునది ఒకే పదమనియు, అజ్ఞానులకు భోగసాధనమని యర్థమనియు కొందఱనుచున్నారు.

సాంఖ్యమతమున వేదాంతిమతమునను పురుషుడు చైతన్యస్వరూపుడు. వైశేషికమతమున చైతన్యము సుఖదుఃఖాదులును పురుషధర్మములు. పురుషు డచేతనుడుగాని చైతన్యరూపుడుకాడు.

విషయశబ్దమునకు భోగ్యమనియు సామాన్యశబ్దమునకు సర్వపురుష సాధారణమనియు మాఠరవ్యాఖ్యానము.

విషయమనగా జ్ఞానముకన్న వేఱనియు, సామాన్యమనగా సర్వపురుషజ్ఞేయమనియు వాచస్పతిమతము.

సామాన్యమనగా సర్వపురుషభోగ్యము అని కౌముదీ వ్యాఖ్యానాథుడు.

"తద్విపరీత స్తథాచపుమాన్" అను కారికాభాగము వలన పురుషునకు వ్యక్తావ్యక్తవైధర్మ్యము సాధర్మ్యమును చెప్పబడినవి. "తద్విపరీతః" అనుదానివలన వైధర్మ్యమును, "తథాచ" అనుదాని వలన సాధర్మ్యమును చెప్పబడినవి. వ్యక్తావ్యక్తములకు సత్త్వరజ స్తమోగుణసంబంధము కలదు. పురుషునికి

అది లేదు. కాన అత్రైగుణ్యమునుబట్టి పురుషుడు వ్యక్తావ్యక్త విలక్షణుడు; ఆ హేతుకత్వమును బట్టి ప్రకృతికి సదృశుడు; అనేకత్వమునుబట్టి వ్యక్తసదృశుడు నగుచున్నాడని మాఠరవ్యాఖ్యానము.

## 12. కారిక

సాం. ద = 1.127 వ సూత్రమును జూడుడు.

ఈ కారికయందలి వృత్తి శబ్దము క్రియాపరము. ఈ క్రియ అభిభవాదిరూపము. కాగా అభిభవక్రియ, ఆశ్రయక్రియ, జననక్రియ, మిథునక్రియ, అను నాలుగు క్రియలుకలవి గుణములని వాచస్పతి మతము. అభిభవము, ఆశ్రయము, జననము, మిథునము, వృత్తిత్వము అను అయిదు ధర్మములు కలవని మాఠరగౌడపాదుల మతము. వీరిమతమున వృత్తిపదమునకు సుఖదుఃఖమోహరూప వృత్తులనియర్థము. అనగా సత్త్వము రజస్సునందు దుఃఖమును, తమస్సునందు మోహమును పుట్టించును. రజస్సు సత్త్వమునందు సుఖమును, తమస్సునందు మోహమును పుట్టించును. తమస్సు సత్త్వమునందు సుఖమును, రజస్సునందు దుఃఖమును పుట్టించునని భావము. ఇట జననమన పరస్పరము నుద్బోధించుట అని మాఠరమతము. పరిణామమని వాచస్పతి మతము.

సదృశపరిణామమనియు విసదృశపరిణామమనియు పరిణామము రెండువిధములు. సదృశపరిణామం దొక వస్తువు మఱియొక వస్తువుగ మాఱుటగాని, కార్యకారణభావము కాని

ఉండవు. విసదృశపరిణామము దీ రెండును ఉండును. కాగా నిట సదృశపరిణామము నంగీకరింపవలయును రజస్సువలన గలిగిన సత్త్వపరిణామము సత్త్వరూపమే యగునుకాని మఱియొక పదార్థరూపము కానేరదు. జననమన వృద్ధిరూప పరిణామము. కాగా జననమువలన వృద్ధిరూపపరిణామమును అభిభవమువలన అపకర్ష (తగ్గుట) రూపపరిణామమును కలుగనచ్చుననియు చెప్పవచ్చును. గుణముల కన్యోన్యాశ్రయము ద్వ్యణుకము లకు వలె నుండునని, మాఠరగౌడపాదుల వ్యాఖ్యానము. మేడ మున్నగువానియందలి కొన్ని యిటుకలు పరస్పరాశ్ర యము కలవయినట్లే గుణములు పరస్పరాశ్రయము కలవని యును చెప్పవచ్చును.

## 13. కారిక

సాం. ద = 1.128 వ సూత్రమును జూడుడు.

ఉపష్టంభమన విసుగుచెందిన దానిని ప్రోత్సహించుట అని వాచస్పతి ప్రేరకమని మాఠరగౌడపాదులు.

అర్థతః = ప్రయోజనమునుబట్టి, సాధనవ్యాపారముండు నని గౌడపాదులు. నికుంభునిపుత్రులగు సుందోపసుందులు తిలో త్తమకొఱ కొకరి నొకరు చంపుకొనిరని భారతమందు కలదు.

## 14. కారిక

సాం. ద = 1.129, 135, సూత్రముల జూడుడు.

"తద్విపర్యయాభావాత్" తయోః కార్యకారణములకు, విపర్యయాభావాత్ = భేదములేకపోవుటను బట్టి, అని యర్థము.

అనగా కార్యకారణములకు భేదము లేదు కాన త్రైగుణ్యమును బట్టి కార్యమందును కారణమందును అవివేకిత్వాదిప్రసవ పర్యాంతమయిన ధర్మములు సిద్ధించునని మాఠరగౌడపాదుల వ్యాఖ్యానము.

ఇట నవ్యక్తమును పక్షముగ జేసి త్రైగుణ్యహేతువుచే నవివేకిత్వమును సాధించినయెడల ఘటపటాదికము దృష్టాంతము కావచ్చును గాన నిది వీతానుమానము. వ్యక్తావ్యక్తముల రెంటిని పక్షముచేసినయెడల అన్వయదృష్టాంతము లభింపదు. పురుషునందు పై సాధ్యహేతువులు రెండును లేనందున పురుషుడు వ్యతిరేక దృష్టాంతము కావచ్చును. అప్పు డిది అవీతానుమాన మగును.

సాంఖ్యమతమున గుణములకు గుణికిని అభేదమే సంబంధము. తార్కికులకువలె సమవాయము కాదు. కావుననే "కారణగుణ విశిష్టత్వాత్" అని చెప్పక కారణగుణాత్మకత్వాత్కార్యస్య" అని కారికలో చెప్పబడెను. నైయాయికులు రూపాదిమత్తులగు పరమాణువులవలన పృథివిమున్నగు కార్యము లుత్పన్నములగుచున్నవని చెప్పుదురు. సాంఖ్యులు రూపాది రహితములగు సత్త్వరజస్తమోగుణములవలన కార్యజాత మభివ్యక్తమగు నందురు. కాగా నైయాయిక సమ్మతములగు పరమాణువులు సాంఖ్యమతమున తన్మాత్ర స్థానీయములు. కాన నైయాయికుల కన్నను సాంఖ్యులు జగత్తును సూక్ష్మదృష్టితో బరిశీలించిరని తోచుచున్నది.

## 15. కా రి క

సాం. ద = 1.130, 131, 132 సూత్రముల జూడుడు.

పరమాణువులందలి వ్యక్తత రూపాదిమత్త్వమే యగుచున్నది. ఈ విషయము "వ్యక్తాద్వ్యక్తానామ్ ప్రత్యక్ష ప్రామాణ్యాత్" అను గౌతమ సూత్రభాష్యమున వ్యక్తపదము వలన రూపాది మత్త్వమను అతీంద్రియములునగువానికి గ్రహణ మని చెప్పబడినది.

శక్తి పదార్థాంతరమని మీమాంసక మతము. న్యాయ మతమున కారణమందుండెడి కార్యప్రాగభావముకన్న నతిరిక్త మగు శక్తిలేదు. సాంఖ్యకారికయందలి శక్తిపదమునకు కార్యము యొక్క అవ్యక్తావస్థయని వాచస్పతి. సామర్థ్యమని గౌడపాద మాతరు లనుచున్నారు. ఈ సామర్థ్యము అవక్తావస్థకన్న వేఱా కాదా అను విషయము స్పష్టముగ జెప్పబడుటలేదు. కాని వారి యుదాహరణమునుబట్టి వేఱని తోచుచున్నది. వీనిచే కుమ్మరి కుండలు చేయ శక్తుడుకాని వస్త్రములనేయ శక్తుడు కాడని ఉదాహరణ మీయబడినది.

సమన్వయమువలన కారణసిద్ధి నైయాయిక సమ్మతము. వారును కార్యకారణములకు సమన్వయము నంగీకరింతురు. కాని సమన్వయ పదమున కర్థముమాత్రము వేఱు. సాంఖ్య మతమున కారణధర్మములు కార్యమునం దనువర్తించుట సమన్వయము. న్యాయమతమున కారణగుణములనుబట్టి కారణ గుణములవంటి గుణములు కార్యమునందుండుట సమన్వయము. సమన్వయము మాత్రము ఉభయసమ్మతము.

"అవిభాగాద్వైశ్వరూప్యస్య" అనుచోటున నవిద్యతే విభాగః అస్య అనువ్యుత్పత్తినిబట్టి అవిభాగ శబ్దమునకు అవిభక్త మని యర్థము. కాగా ఒక సాధారణ ద్రవ్యమునుండి అనేక విధములగు పదార్థములు పుట్టుచుండును. ఒక చెఱకుగడనుండి రసము, బెల్లము, పంచదార మున్నగునవి సిద్ధించుచున్నవి. ఇట్లే నానారూపమగు ఈప్రపంచమున కొక సాధారణ కారణ ముండవలయును. అదియే యవ్యక్తమని జయమంగళటీక.

విభాగమన నభివ్యక్తియనియు అవిభాగమన తిరోభావ మనియు గౌడపాదుల వ్యాఖ్య. కాగా కార్యముయొక్క అభివ్యక్తినిబట్టియు తిరోభావమునుబట్టియు కారణమగు నవ్యక్తము సిద్ధించునని భావము.

## 16. కా రి క

సాం. ద = 1.136 సూత్రమును జూడుడు.

పరిణామికారణమనియు అపరిణామికారణమనియు కారణము రెండువిధములు. ఇటప్రధానము పరిణామికారణమని నిరూపించుటకు కారికలో "పరిణామతః" అని చెప్పబడినది. ఏకవిధమగు ప్రధానమువలన ననేకవిధములగు కార్యములెట్లు పుట్టుచున్నవని శంకించి "త్రిగుణతః" అని చెప్పబడినది. కాగా ప్రధానమునందును సత్త్వము, రజస్సు, తమస్సు, అనెడి గుణములవలన బహుత్వముకలదు. కాన ననేకవిధమగు కార్యోత్పత్తికి భంగములేదని మాఠరవ్యాఖ్య.

అభివ్యక్తమగు మహదాది కార్యమునుబట్టి కారణమగు అవ్యక్తము సిద్ధించును. గుణత్రయమువలనను సముదాయము

వలనను పరిణామము ననుసరించి కార్యము ఉద్భవించును. అనగా రుద్రుని తలయందుబడిన మూడు గంగాప్రవాహముల వలనను ఒకే స్రోతస్సు ఏర్పడినట్లు గుణత్రయమువలన నొక వ్యక్తపరిణామ మేర్పడును. తంతుసముదాయమువలన పటము వలె గుణసముదాయమువలన మహదాది వ్యక్తము సిద్ధించును అని గౌడపాదుల టీక.

ఇట మొదటి గుణత్రయ పరిణామము వాచస్పతి చెప్పిన సదృశపరిణామమా ? లేక మఱియొకటియా? అని విచారింపవలసియున్నది. పూర్ణచంద్రునిటీకయందు మాత్రము గుణత్రయ పరిణామము సదృశపరిణామ మనియు సముదయ పరిణామము విసదృశపరిణామ మనియు స్పష్టముగ చెప్పబడినది.

## 17. కా రి క

సాం. ద = 1.140,144 సూత్రముల జూడుడు.

"సంఘాతపరార్థత్వాత్" ఇట సంఘాతశ్చాసౌపరార్థశ్చ" అని కర్మధారయ సమాసము. కాగా సంఘాతత్వము, పరార్థత్వమందు హేతువు. అనగా సంహతమగునది పరార్థమే యగునని భావము. సంహతత్వమన సుఖదుఃఖమోహాత్మకములగు సత్త్వరజస్తమోగుణముల కూడిక యని పూర్ణచంద్రునివ్యాఖ్య.

గుణములన్యోన్యము కలసి కార్యము నారంభించుట కాని ద్రవత్వకఠినత్వాది రూపముకాని సంహతత్వమని అనిరుద్ధుని టీక. ఈ విషయమును సాం. ద = 1.142 వ సూత్రమున జూడుడు.

కార్యారంభక సంయోగమే సంహతత్వమని వంశీధరుని వ్యాఖ్య. సాంఖ్యమతమున గుణముల మేళనము సంయోగ రూపమా, సంబంధాంతరమా, అని విచారింపవలసియున్నది.

"సంఘాతస్య పరార్థత్వాత్" అని కామాఖ్యనాథుని వ్యాఖ్య. వీరి మతమున ప్రకృతి మొదలు పృథివీ పర్యంతము అయిన సముదాయమే సంఘాత మనబడును.

సముదాయము సంఘాతమని మాఠరవ్యాఖ్యలో గలదు.

"త్రైగుణ్యవిపర్యయాత్ "అని పురుషునియందు అసంహతత్వమును జెప్పి "సంఘాతపరార్థత్వాత్" అని సంహతము కాన ప్రకృత్యాదికము పరార్థమగుచున్నది. త్రైగుణ్యము లేనందున పురుషుడు అసంహతుడు. అసంహతుడు కావుసనే పరార్థము కాడను విషయ మీకారిలో జెప్పబడినది.

"సత్త్వగుణః, కించిన్నిష్ఠాభావప్రతియోగీ, పరిచ్ఛిన్నత్వాత్" అను అనుమానముచే త్రైగుణ్యాభావాధికరణముగ పురుషుడు సిద్ధించునని "త్రైగుణ్యవిపర్యయాత్" అనుదాని కర్థమని గౌడపాదులు. వీరిమతమున నిది స్వతంత్ర హేతువు.

విపర్యయమన నభావము. కాగా త్రైగుణ్యాభావమున కాధారముగ పురుషుడు సిద్ధించునని కామాఖ్యనాథుని టీక.

ఆదిపదమువలన 11 వ కారికలో జెప్పిన అవివేకిత్వాదుల గ్రహింపవలెనని భిక్షుమతము.

అధిష్ఠానమన భోక్తృసంయోగము. ఇది ప్రకృత్యాదుల పరిణామమునకు కారణమని భిక్షుమతము.

ప్రతిబింబద్వారమున స్వాధీనమును చేసికొని అవస్థాన మని రమేశచంద్ర, కృష్ణనాథులు. పరంపరచే చైతన్యసంపాదక మని పూర్ణచంద్రుడు. దీనివలన "ప్రకృత్యాదికం, పరేణాధిష్ఠితమ్ సుఖదుఃఖమోహాత్మకత్వాత్, రథాదివత్" అని అనుమానము సిద్ధించుచున్నది. భోక్తృభావాత్ = భోక్తృత్వాత్ అని అర్థము.

పురుషునకు భోగమెట్లనిన ప్రమాణరూపమగు చిత్తవృత్తియందారూఢమయిన ప్రకృతి పురుషాదికము ప్రమేయ మనబడును. ఈ ప్రమేయము పురుషునియందు వృత్తితోగూడ ప్రతిబింబించి భాసించును. కాగా విషయముతోగూడిన వృత్తియొక్క ప్రతిబింబనముతోగూడిన స్వరూపమే పురుషునికి భోగము. ఇదియే ప్రమాణమునకు ఫలమును అగుచున్నదని భిక్షుమతము. పురుషునియందు విషయ ప్రతిఫలనము లేదు. విషయమునందే పురుషుడు ప్రతిబింబించును అను వాచస్పతి మతమున విషయమునందు ప్రతిబింబాధానమే భోగమనబడును. బిక్షుమతమున ప్రమేయము వృత్తితోగూడ పురుషుని యందు ప్రతిబింబించుటయే భోక్తృత్వము. వాచస్పతి మతమున ప్రకృతియందు పురుషుడు ప్రతిబింబించుటయే భోక్తృత్వము. కాగా పురుషునియందు కర్తృత్వమువలె భోక్తృత్వమును వాస్తవికము కానేరదని తోచుచున్నది.

"కైవల్యార్థం ప్రవృత్తేః" ప్రకృతియొక్క ప్రవృత్తి అవిరక్తునకు భోగముకొఱకును విరక్తునకు మోక్షముకొఱకును అగుచున్నది.

## 18. కారిక

సాం. ప. 1.149 వ సూత్రమును జూడుడు.

జన్మ మరణ కరణములయొక్క వ్యవస్థనుబట్టియు ప్రవృత్తి వ్యవస్థనుబట్టియు సుఖదుఃఖవ్యవస్థనుబట్టియు పురుష బహుత్వము సిద్ధించుచున్నదని కారికార్థము.

17 వ కారికయందలి విపర్యయ శబ్దము అభావపరము. ఇట పరిణామపరమని యెఱుంగునది.

పురుషబహుత్వము నంగీకరించిన సాంఖ్యమతమునందు అభేదశ్రుతులెట్లుపపన్నములగును అను శంకకు, అభేదమన అపృథక్త్వమనియు, భేదమన అన్యోన్యాభావమనియు జెప్పుదుము. కాగా పురుషులకు స్వాభావికభేద ముండుటవలన భేదశ్రుతులును, అపృథక్త్వమునుబట్టి అభేదశ్రుతులు ఉపపన్నములగునని, భిక్షువనుచున్నాడు. దీనివలన వీరికిని నైయాయికులకువలె పురుషునకు విభుత్వము సిద్ధించుచున్నది.

జన్మమరణవ్యవస్థనుబట్టి పురుషభేదము సిద్ధించుచున్నదనుటవలన ఈ జన్మమరణవ్యవస్థ స్వతస్సిద్ధమగు పురుషభేదమునకు జ్ఞాపకమగుచున్నది. వేదాంతిమతమున ఉపాధిభేదము పురుషభేదమునకు కారకము జ్ఞాపకముగూడ నగుచున్నది.

## 19. కారిక

సాం. ద = 1.148, 161, 162, 163, సూత్రముల జూడుడు.

పురుషునకు సాక్షిత్వము, ద్రష్టృత్వమును ఈ కారికయందు జెప్పబడినవి. సాక్షిత్వమన, ప్రతిబింబద్వారమున

బుద్ధిసుఖాదులతో సంబంధము కలిగియుండుట. బుద్ధివృత్తి ద్వారమున ఘటాదులను ప్రకాశింపజేయుట ద్రష్టృత్వము. అనగా బుద్ధితోగల సాక్షాత్సంబంధము సాక్షిత్వము. విషయములతోగల పరంపరాసంబంధము ద్రష్టృత్వమని భావము. 1.161 వ సూత్రమునందీ విషయము స్పష్టము. పురుషుడు బుద్ధికి సాక్షియగును. ఘటాదులకు ద్రష్టయగునని భిక్షువనుచున్నాడు.

"పశ్యతి శృణోతిసర్వం కరోతి స్థితిం ప్రసంగంచ ।
నాపిస్వతో నపరతో నో భయత శ్చాప్యుదాసీనః"

ఈ శ్లోకమునుబట్టి నపశ్యతి, నజిఘ్రతి, నశృణోతి, నస్పృశతి, నరస్యతి, నస్థితిం కరోతి, నప్రసంగం కరోతి అని పురుషునియందు ఔదాసీన్యము సప్తవిధము.

"బాలహుతాశనతరవః స్వయమకృతానాం యథా చ భోక్తారః । పురుషో విషయఫలానాం స్వయమకృతానాం తథా భోక్తా" అను నార్యోక్తినిబట్టి పురుషుడు కర్త కాకపోయినను భోక్త కావచ్చును అని జయమంగళుని వ్యాఖ్య.

## 20. కా రి క

సాం. ద = 1.164 సూత్రమును జూడుడు.

ప్రధానపురుష సంయోగము భోక్తృభోగ్యభావరూపమని వాచస్పతి. విలక్షణమని భిక్షువు. అనగా ప్రకృతియందు వికారాపాదకము, పురుషునియందు వికారానాపాదకము అని భావము.

ప్రకృతి పురుషులకు వాస్తవ సంయోగము సంభవింపదు కాన సాన్నిధ్యము నే సంయోగ మనవలయును. ఈ సాన్నిధ్య మును బట్టియే ప్రకృతియందు చైతన్య భ్రమయు, పురుషుని యందు కర్తృత్వభ్రమయు పుట్టుచున్నవి. దీనినే వేదాంతులు సోపాధిక భ్రమ యందురు.

వాచస్పతిమతమున ప్రధానమందు పురుష ప్రతిబింబము మాత్ర మంగీకరింపబడినది. కాన వీరి మతమందు ఈకారిక యందు చెప్పబడిన పరస్పరాధ్యాసము ఈ ప్రతిబింబమువలననే సిద్ధింపవలయును. భిక్షుమతమున పరస్పర ప్రతిఫలన మంగీక రింపబడినది. అయినను 1.164 వ సూత్ర వ్యాఖ్యానమందలి జల సూర్యోదాహరణమునుబట్టి వీరికిని ఒకే ప్రతిబింబమువలన పరస్పరాధ్యాసము సిద్ధింపవచ్చును. మఱియు అయోవహ్ను లను దృష్టాంతముగ జూపుటనుబట్టి ప్రతిబింబము లేకుండగనే అధ్యాసము సిద్ధింపవచ్చును.

## 21. కా రి క

సాం. ద = 11.1 వ సూత్రమును జూడుడు.

మాఠరవృత్తియందీ కారిక కవతరణమిట్లు వ్రాయబడినది.

ఏకకర్మజము ఉభయకర్మజము స్వాభావికము శక్తి హేతుకము ఆకస్మికము అర్థహేతుకము అని సంయోగము అయిదువిధములు. ప్రకృతిపురుషులకు అర్థహేతుకమగు సంయోగము తప్ప మఱియొక సంయోగము సరిపడదు. కాన అర్థహేతుకమగు సంయోగము నీ కారికయందు నిరూపించు చున్నాడు.

## 22. కారిక

సాం. ద = 11.10 వ సూత్రమును జూడుడు.

న్యాయమతమున శబ్దము ఆకాశగుణమే కాని వాయువు మున్నగువాని గుణము కానేరదు. మఱియు ఆకాశము మనస్సు నిత్యములు. సాంఖ్యమతమందు అహంకారము వలన ఇంద్రియములు పుట్టునని నిరూపింపబడినది. న్యాయమతమున భూతములవలన ఇంద్రియములు పుట్టినవని చెప్పబడినది. కాన సాంఖ్యులకును నైయాయికులకును ఇట భేదము కలదు.

సాంఖ్యమతమున ప్రకృతి సత్త్వరజస్తమో గుణాత్మకము. దీనినే బ్రహ్మయనియు అవ్యక్తమనియు చెప్పుదురు. వేదాంతి మతమున భావరూపమగు అజ్ఞానమే ప్రకృతి. సాంఖ్యులు చెప్పిన మహత్తత్త్వమునే పౌరాణికులు హరిహర హిరణ్యగర్భరూపమున వర్ణింతురు.

న్యాయమతమం దహంకారము జ్ఞానరూపము. సాంఖ్య మతమం దహంకార మిట్లు నిరూపింపబడినది. వర్ణములఱువది నాలుగు. వీనిలో అకారము మొదటిది. హకారము చివరది. ఈ రెంటికిని ప్రత్యాహారము చేసినయెడల 'అ-హ' అను రెండు వర్ణములవలనను మొత్తము వర్ణములన్నియు గ్రహింపబడును. ఈ అ-హ-లకు బిందువును చేర్చిన అహం, అని లభించును. "వర్ణాత్కారః" అను సూత్రమునుబట్టి అహంకారమని సిద్ధించును. కాగా అహంకార మన వర్ణమాల యని తేలినది. ఈ వర్ణమాలను యోగులు శాబ్దికులును పరా, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ యని వ్యవహరింతురు. ఈ వర్ణమాలా రూపకమగు

అహంకారమునుండి షోడశగణము (పంచమహా భూతములు, ఏకాదశేంద్రియములు) ఏర్పడుచున్నది. మఱియు ఈ యహంకారమునకు వైకృతమనియు, తైజసమనియు, తామసమనియు వ్యవహారము కలదు. తామసాహంకారమునకు భూతాదియని సాంఖ్యపరిభాష. అందు తామసాహంకారమువలన శబ్దము మున్నగు పంచతన్మాత్రలును సాత్వికమువలన మనస్సు, జ్ఞానేంద్రియములును, రాజసాహంకారమువలన మూర్ధా మూర్ధాత్మకములగు కర్మేంద్రియములును పుట్టుచుండునని మాఠర మతము.

కుంభకారశబ్దమువలె అహం అనువృత్తికి కారణమగుట వలన అహ మభిమాన వృత్తితో గూడిన అంతఃకరణము అహంకారమనబడునని భిక్షుమతము. ''అభిమానో అహంకారః'' అనుటవలన అంతఃకరణవృత్తి రూపమగు అభిమానమే అహంకార మని తత్వకౌముదియందు చెప్పబడినది.

రమేశచంద్రుడు మున్నగు టీకాకారులు వృత్తి వృత్తి మతుల కభేదము నంగీకరించి అభిమాన వృత్తికల అంతఃకరణమును అహంకారమనుచున్నారు. వాచస్పతిమాట న్యాయ వేదాంతిసమ్మతము. టీకలు భిక్షువుననుసరించినవి. పంచతన్మాత్రలును మహత్తత్త్వమువలన బుట్టినవని యోగదర్శనమున వ్యాసునిచే వ్రాయబడినది. అ 2.19 వ సూత్రమును జూడుడు. కాని 1 వ పాదమున 45 వ సూత్రమునందు అహంకారము వలన బుట్టినవనియు నాతని చేతనే చెప్పబడినది. మఱియు నీ సూత్రమున తన్మాత్రలనుండి అణువులు పుట్టినవనియు కలదు.

న్యాయమతమున పరమాణువులు నిత్యములు. కాగా పాతం జలసమ్మతములగు అణువులు నైయాయికసమ్మతత్ర్యణుకములు కాని పరమాణువులు మాత్రము కాజాలవు. శబ్దతన్మాత్రవలన నాకాశము, స్పర్శతన్మాత్రవలన వాయువు ఇట్లే ఒకొ్కక తన్మాత్రవలన నొకొ్కక భూతము పుట్టునని మాఠర గౌడ పాదులనుచున్నారు. వాచస్పతి మతమున ఆకాశము శబ్దమను ఒక తన్మాత్ర వలనను వాయువు శబ్దస్పర్శలను రెండు తన్మాత్రలవలనను పుట్టునని కలదు. 38 వ కారికను జూడుడు. వ్యాసమతము వాచస్పతి మతమును సరిపోవును. న్యాయమత మున భూతములవలన తన్మాత్రలు పుట్టును కాని తన్మాత్రల వలన భూతోత్పత్తి చెప్పబడుటలేదు.

## 23. కారిక

సాం. ద = 11.13, 14 సూత్రముల జూడుడు.

ఈ కారికయందు బుద్ధియొక్క సాత్త్వికరూపము తామస రూపమును నిరూపింపబడినవి కాని రాజసరూపము నిరూపింపబడుటలేదు. కాని పైనిచెప్పబడిన సాత్త్విక తామస రూపములు రెండును రజస్సుయొక్క సంబంధము లేనియెడల సిద్ధింపనేరవు గాన వీనినే రాజసరూపములని చెప్పవచ్చును. వీనికన్నను వేఱగు రాజసరూపములు బుద్ధికి లేవు.

వైరాగ్యము బాహ్యమనియు ఆభ్యంతరమనియు ద్వివిధ మని మాఠరగౌడపాదు లనుచున్నారు. పాతంజలులును పర వైరాగ్యమనియు అపరవైరాగ్యమనియు వైరాగ్యము రెండు

విధము లనుచున్నారు. వీరి అపరవైరాగ్యము మాఠరోక్త బాహ్య వైరాగ్యమును ఒక్కటియే. ఇదియే వశీకారసంజ్ఞయని కౌముదిలో చెప్పిరి. వాచస్పతి చేసిన విభాగము గౌడపాదాదుల గ్రంథములం దగపడుటలేదు.

"మోక్షేధీః జ్ఞానమన్యత్ర విజ్ఞానం శిల్పశాస్త్రయోః" అను అమరకోశమునుబట్టి ఆత్మజ్ఞానమే ఇట జ్ఞానశబ్దమున కర్థము. అమరమునందు చెప్పిన 8 ఐశ్వర్యములలో గరిమ కలదు. ఇట దానికి బదులు సత్యసంకల్పత్వము చెప్పబడినది.

## 24. కా రి క

సాం. ద = 11.16, 17 వ సూత్రముల జూడుడు.

సాంఖ్యమతమున మనస్సనియు, బుద్ధి అనియు, అహంకారమనియు, అంతఃకరణము త్రివిధము. వేదాంతుల మతమున మనోబుద్ధి చిత్తాహంకార భేదమున నాలుగువిధములు. వీరి చిత్తము సాంఖ్యమతమున బుద్ధిలో చేరును. తార్కికమతమున మనస్సు ఒక్కటియే అంతఃకరణము. బుద్ధి చిత్తాహంకారములు ఆత్మధర్మములు.

అందఱ మతమందును ఒక్కటియే అంతఃకరణమనియు దానినే క్రియాభేదమునుబట్టి మనోబుద్ధిచిత్తాహంకారములనెడి వ్యవహారము కలుగుచున్నదని చెప్పుట లెస్సయని తోచుచున్నది.

ఇట నింద్రియములకును తన్మాత్రలకును అహంకారము కారణమని చెప్పుటవలన ఇంద్రియములకును తన్మాత్రలకును పౌర్వాపౌర్య నియమము లేదు. ఇంద్రియములలో నొకదాని

కొకటి కారణము కాదు. తన్మాత్రలందు మాత్ర మట్టి కార్య కారణభావము కలదు. న్యాయమతమందు ఇంద్రియములు భూతములయొక్క కార్యములని చెప్పబడినది.

## 25. కా రి క

సాం. ద = 11. 18 వ సూత్రమును జూడుడు.

వేదాంతుల మతమున భూతసూక్ష్మముల సత్త్వభాగ ములనుండి జ్ఞానేంద్రియములయొక్కయు సముదాయము నుండి మనస్సు యొక్కయు రజోభాగ సముదాయమునుండి కర్మేంద్రియముల యొక్కయు ఉత్పత్తి చెప్పబడినది. సాంఖ్య మతమం దహంకారమునుండి ఇంద్రియోత్పత్తి చెప్పబడినది. కర్మేంద్రియములందు ప్రకాశమను ధర్మము లేదు. కాని లాఘవ మున్నది. కనుకనే వానినిగూడ సాత్త్వికాహంకార కార్యము లనుచున్నారు. నిజమునకు వీనిని రాజసాహంకార కార్యము లనుట మంచిది. ఇంద్రియములకు స్వస్వవిషయగ్రహణ సామ ర్థ్యమునుబట్టి సాత్త్వికములని వ్యవహారము. ఇంద్రియము లన్నియు సాత్త్వికాహంకార కార్యములని వాచస్పతి మతము.

మనస్సు ఇంద్రియాధిష్ఠాన దేవతలును సాత్త్వికాహం కార కార్యములు. ఇంద్రియములు పదియు రాజసాహంకార కార్యములని భిక్షుమతము. ఈతనికి కూర్మపురాణ మాధా రము, తామసాహంకారము వలన పంచతన్మాత్రలు పుట్టును.

## 26. కా రి క

సా. ద = 11.19 వ సూత్రమును జూడుడు.

న్యాయమతమున బుద్ధీంద్రియములే అంగీకరింపబడినవి కాని కర్మేంద్రియము లంగీకరింపబడుటలేదు. బుద్ధీంద్రియము లన బుద్ధి పరిణామమగు జ్ఞానసాధనములగు ఇంద్రియములని అర్థము. కర్మేంద్రియములన స్థూలములగు హస్తాదులుకావు. ఆదానము, గమనము మున్నగు సూక్ష్మమగు శక్తి అని పూర్ణచంద్రుని మతము.

"ఇంద్రోమాయాభిః" అను శ్రుతియందలి ఇంద్ర శబ్దము ఆత్మపరము. కాగా "ఇంద్రియము క్రియాసాధన మగుటవలన కుఠారాదులకువలె దీనికిని కర్తకావలయును. ఆ కర్తయే ఆత్మ" అని అనుమానమువలన ఆత్మ సిద్ధించును. ఇట్లింద్రియము ఆత్మకు చిహ్నమగుచున్నది. న్యాయమతమం దాత్మకు స్వాభావికమగు కర్తృత్వము కలదు. సాంఖ్యులు వేదాంతులును కర్తృత్వ మారోపితమనుచున్నారు. "త్వగాఖ్యాని" అను చోటున "స్పర్శనకాని" అని గౌడపాద వ్యాఖ్యాతమగు పాఠము. "శ్రోత్రత్వక్చక్షూరసననాసికాఖ్యాని" మాఠరసమ్మతమగు పాఠము.

## 27. కా రి క

సాం. ద = 11.26, 27 వ సూత్రముల జూడుడు.

"బాహ్యభేదాశ్చ" అని వాచస్పతి గ్రహించిన పాఠము. గ్రాహ్యభేదాత్" అనిమాఠరసమ్మతపాఠము. "బాహ్యభేదాశ్చ"

అనునది దృష్టాంతమని వాచస్పతి మతము. విషయభేద మునుబట్టి ఇంద్రియభేదము సిద్ధించుచున్నదని మాఠరుని మతము. మనస్సున కింద్రియత్వమును కొందఱు వేదాంతు లంగీకరించుటలేదు. మనస్సున కింద్రలింగత్వమే ఇంద్రియాంతర సాధర్మ్యమని జయమంగళుని మతము. దీనిని వాచస్పతి నిరా కరించుచున్నాడు. అదృష్టము గూడ గుణపరిణామమే యగుట వలన అదృష్టవిశేషమే గుణపరిణామ విశేషమని వాచస్పతి మతము. సత్త్వాదిగుణముల యొక్క ఉత్కర్షాపకర్షములే అదృష్టమని మాఠరవ్యాఖ్య.

## 28. కారిక

సాం. ద = 11.28 వ సూత్రమును జూడుడు.

ఇట నిర్వికల్పకజ్ఞాన మాలోచనశబ్దమున కర్థ మని వాచస్పతివ్యాఖ్య. నిర్వికల్పక సవికల్పములు రెండును అని భిక్షువ్యాఖ్య. వీరిరువురును తమతమ మతసమర్థనమునకు కుమారిలుని వార్తికముల నుదాహరించిరి. ఇంద్రియములం దుండెడి స్వస్వవిషయగ్రహణ సామర్థ్యమే ఆలోచన మని మాఠరమతము. యోగశాస్త్రమున సవికల్పకమున కింద్రియ జన్యత్వము చెప్పబడినది. కాన సవికల్పకము మనోమాత్ర జన్యమను మతము సరికాదని భిక్షువనుచున్నాడు. సాం.ద = 11.32 వ సూత్రమును జూడుడు. వీరి మతమున సంకల్ప వికల్పములు మనస్సు యొక్క వ్యాపారములు. సంకల్పము చికీర్షారూపము, వికల్పము సంశయ రూపమును అగుచున్నవి.

## 29. కారిక

సాం. ద = 11.30, 31 వ సూత్రముల జూడుడు.

ఈ కారికయందు "ప్రాణాద్యాః వాయవఃపంచ" అనుట వలన ప్రాణము వాయు రూపమని తెలుచున్నది. కాగా "ఏతస్మాజ్జాయతే ప్రాణః మనస్సర్వేంద్రియాణిచ ఖంవాయుర్జ్యోతిరాపః పృథివీవిశ్వస్యధారిణీ" అను శ్రుతియందు ప్రాణము వాయువు వేఱుగ జెప్పబడినందున ఆశ్రుతితో విరోధము వచ్చు ననుశంక కలుగవచ్చును. కాని ఈ కారికయందే "కరణవృత్తిః" అనుటవలన ప్రాణనము మున్నగు క్రియావిశేషమే ప్రాణశబ్దమున కర్థముకాని వాయువుకాదని రమేశచంద్రుడు. శ్రుతియందలి ప్రాణశబ్దముచే ఆంతరవాయువును వాయుశబ్దముచే బాహ్యవాయువును గ్రహింపవలయును. ఇట్లే మనశ్శబ్దముచే నంతరింద్రియమును ఇంద్రియశబ్దముచే బాహ్యేంద్రియములును చెప్పబడినవి కాన విరోధము లేదని కృష్ణనాథుని మతము. ఒకే ప్రాణవాయువు స్థానభేదమునుబట్టియు క్రియాభేదమును బట్టియు ప్రాణాపానాది సంజ్ఞల నందుచున్నది. కాన పంచ అను పదమునకు విరోధము లేదు. ఇది వైశేషిక సమ్మతము. ఇట "సామాన్యకరణవృత్తిః" అనునది మనోబుద్ధ్యహంకారముల సాధారణ వ్యాపారమని వాచస్పతి. ఇది మూతరసమ్మతము. ప్రాణనము మున్నగునది మొత్తము పదుమూడింద్రియములకును సాధారణ వ్యాపారమని గౌడపాదమతము. యోగ ద 3 పా, 39వ సూత్రమును జూడుడు. ప్రాణశబ్దముచే వాయువు గ్రహింపబడదు, అంతఃకరణత్రయముయొక్క శరీరధారణ

రూపమగు సామాన్య వ్యాపారమే చెప్పబడుచున్నది. ఇది వాయువువలె సంచరించునదగుటచే వాయువని చెప్పబడినది. అని భిక్షువు. వాయువు వేఱనియు ప్రాణము వేఱనియు శ్రుతియే చెప్పుచున్నది కాన ప్రాణము వాయురూపము కాదు. క్రియా రూపము. సాం. ద = 11.31 వ సూత్రమును జూడుడు. ప్రాణాదులు వాయువులే. అవి అంతఃకరణముయొక్క జీవన యోనియత్నము వలన ధరింపబడుచున్నవి. కాన ప్రాణాది వాయువులు అంతఃకరణ సామాన్య వ్యాపారము అని వాచస్పతి. ఈతని మతము భిక్షుచే నిరాకరింపబడినది.

## 30. కారిక

సాం. ద = 11.32 సూత్రమును జూడుడు.

28 వ కారికార్థము సయితే మీా సూత్రమునందు జేర్పబడినది.

"క్రమశోఽక్రమశశ్చేంద్రియ వృత్తిః" సాం. ద = 11. 31. ఈ సూత్రమునందు ఇంద్రియవృత్తులకు మాత్రమే క్రమికత్వ యౌగపద్యములు విచారింపబడినవి. ఇదియు మనస్సు అణువు కాన ఇంద్రియములకు క్రమికవృత్తులేకాని యుగపద్వృత్తులు లేవను నైయాయికమతనిరాకరణము కొఱకేర్పడినది. కాన బుద్ధ్యహంకార వృత్తులకిట ప్రసక్తిలేదు అని భిక్షువు.

కాని కారికయందు చతుష్టయ పదముండుటవలన కారికను వాచస్పతి చెప్పినట్లే వ్యాఖ్యానమును చేయవలయును. సూత్రమునందు చతుష్టయపదము లేదుకాన సూత్రమునకు

భిక్షువు చెప్పినట్లే వ్యాఖ్యానము చేయుట మంచిదని తోచు చున్నది. కాని విరోధము లేనందున వాచస్పతి వ్యాఖ్యానము వలన నైయాయికమత నిరాకరణము సిద్ధింపదు.

## 31. కా రి క

సాం. ద = 11. 37 సూత్రమును జూడుడు.

ఇట పురుషార్థ శబ్దమునకు పురుషునియొక్క భోగము కైవల్యమును అర్థమని వాచస్పతి మాతరులు. కాగా భోగాప వర్గములకు పూర్వభావియగు కరణవృత్తికి పశ్చాద్భావులగు భోగాపవర్గము లెట్లు కారణములగునని శంక కలుగుచున్నది. కాన భోగసాధనమును అంతఃకరణ గతమును అగు అదృష్టమే పురుషార్థ శబ్దమున కర్థమనికాని, ఇంద్రియ ప్రవృత్తికి ఫలమగు భోగమునకు హేతుత్వము నంగీకరించికాని "పురుషార్థ ఏవ హేతుః" అను కారికాభాగమును సరిపెట్టవలెను. భారతీయ దర్శనములందు ఫలమునకు వైవక్షిక హేతుత్వముమాత్ర మంగీకరింపబడినది కాని వాస్తవ హేతుత్వములేదు. గ్రీకు దార్శనికులందు ఆరిస్టాటల్ మహాశయుడు ఫలమునకునువాస్తవ హేతుత్వము నంగీకరించెను. ఫలరూపమగు కారణమునకు Final cause) అని వ్యవహారము. వీరిమతమందు ఉపా దాన కారణము నిమిత్తకారణము ఆకృతికారణము ఫలరూప కారణమని కారణము నాలుగు విధములు.

న్యాయమతమం దాత్మకు కర్తృత్వముకలదు. కాన నాత్మయందలి యత్నముచే నింద్రియములు ప్రవర్తించును.

సాంఖ్యమతమం దాత్మకు కర్తృత్వములేదు. కాన పురుషా ర్థమే ఇంద్రియములకు ప్రవర్తకము. మఱియు న్యాయమత మున ఇంద్రియ ప్రవృత్తినిబట్టి ఆత్మానుమానము. సాంఖ్య మతమున సంఘాతపదార్థత్వమునుబట్టి ఆత్మానుమానము. సాంఖ్యమతమం దాత్మకు వాస్తవ కర్తృత్వము లేకపోయినను అయస్కాంతమువలె సన్నిధానమునుబట్టి ఇంద్రియ ప్రేరకు డగుటవలన ఇంద్రియ ప్రేరకత్వరూపమగు కర్తృత్వముండ వచ్చును. కాని యత్నరూపమగు కర్తృత్వము మాత్రము లేదు. యుద్ధమునందు భటులది స్వాభావిక కర్తృత్వము. సన్నిధానమువలన రాజునందారోపితమగు కర్తృత్వము. ఇట్లే ఆత్మయం దారోపిత కర్తృత్వము నంగీకరించినను అంగీకరింప వచ్చును. కావుననే "అత ఆత్మని కర్తృత్వమకర్తృత్వంచ సంస్థి తమ్ । నిరిచ్ఛత్వా దకర్తృత్వం కర్తాసన్నిధిమాత్రతః" అను నార్యోక్తి సరిపోవుచున్నది అని భిక్షు మతము. ఇంద్రియ ప్రవృ త్తికి పురుషార్థరూపమగు నిమిత్తకారణముకలదు. కర్తమాత్రము లేడని మాఠరమతము. ఏరిమతమునం దింద్రియప్రవృత్తికి కర్తృరూపనిమిత్త కారణముగాని కరణరూప నిమిత్తకార ణముకాని లేవని తోచుచున్నది.

## 32. కారిక

సాం. ద = 11.38 వ సూత్రమును జూడుడు.

తార్కికమతమున కారణజన్యమై కార్యసాధకమగునది వ్యాపారము. ఎట్లన తంతుజన్యమై పటసాధకమగు తంతు

సంయోగము పటరూపకార్యమందు తంతువులకు వ్యాపారమగు చున్నది. సాంఖ్యులు క్రియావిశేషమునే వ్యాపారమందురు. కాని తార్కికులు చెప్పు సంయోగాదికమును వ్యాపారమని అంగీకరింపరు. ఇట్లే ప్రాగభావ ప్రతియోగి (పుట్టునది) కార్య మని తార్కికమతము. క్రియాజన్యఫలముతో కూడినది కార్య మని సాంఖ్యమతము.

"పం చాభిబుద్ధయః" అను 8 వ కాపిలసూత్రమునకు మనోబుద్ధ్యహంకారములు మూడు, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ ములు రెండు కలసి అయిదును అభిబుద్ధులు = ఇంద్రియములని మాధవస్వామి వ్యాఖ్య. అభిమానాదికము అభిబుద్ధయని రఘునాథునిటీక. కర్మేంద్రియము లయిదు, జ్ఞానేంద్రియము లయిదు, మనోబుద్ధ్యహంకారములు మూడును మొత్తము పదుమూడు కరణములని యిట జెప్పబడినది. ఆహరణ ధారణ ములు కర్మేంద్రియ వ్యాపారములు. ప్రకాశము బుద్ధిధర్మమని గౌడపాదులు. ఆహరణము సర్వేంద్రియ సాధారణము. ధారణ మహంకార ధర్మము. ప్రకాశనము బుద్ధిధర్మమని మాఠర మతము. ఆహరణము కర్మేంద్రియ ధర్మము. ధారణము బుద్ధ్యహంకార మనస్సుల ధర్మము. ప్రకాశనము బుద్ధీంద్రియ ధర్మ మనివాచస్పతిమతము.

## 33. కారిక

"బాహ్యేంద్రియస్యవిషయాఖ్యమ్" బాహ్యేంద్రియము లంతఃకరణ త్రయమునకు విషయసమర్పకములని అర్థము. బాహ్యేంద్రియములచే సమర్పింపబడిన విషయము లను

సంకల్పము అభిమానము అధ్యవసాయము అనువానిచే నంతః కరణ త్రయము గ్రహించునని భావము. నైయాయిక సమ్మత కాలోపాధి రూపమగు క్రియవలననే అతీతాది వ్యవహారము సరి పడును కాన కాలమును వేఱుగ నంగీకరింప బనిలేదని సాంఖ్య మతము. యోగుల మతమందును కాలము కల్పితముకాని అతిరిక్తముకాదు. యోగ ద. 3 పా. 52 వ సూత్రమును జూడుడు. కాంటుఅను జర్మను దార్శనికుని మతమందును కాలము కాల్పనికమనియే కలదు. బాహ్యసత్తా రహితమును బౌద్ధసత్తా విశిష్టము నగునది కాల్పనిక మనబడును.

## 35. కారిక

సాం. ద = 11.40, 41, 42, 43, 47, సూత్రముల జూడుడు.

33 వ కారికయందు మనోబుద్ధ్యహంకారముల మూటి కిని అంతఃకరణత్వము చెప్పబడినది. ఇట మనోహంకారము లకు మాత్ర మంతఃకరణత్వము చెప్పబడినది. దీనికి కారణము వీరిమతమున బుద్ధికే కర్తృత్వమంగీకరింపబడినది. "కర్తకును కరణమునకును భేదముండవలయును" అను సిద్ధాంతమునుబట్టి బుద్ధికి కరణత్వమునుమాని మనోహంకారములకే కరణత్వము చెప్పబడినది. బుద్ధి పురుషునకు ఉపకరించునదగుటచే బుద్ధికి కరణత్వము కర్తృత్వముగూడ నుండవచ్చునని 33 వ కారిక యందు బుద్ధికి కరణత్వము చెప్పబడినది.

బుద్ధికి ప్రాధాన్యము నంగీకరించిననాడు వెనుక జెప్పిన "ఉభయాత్మక మత్రమనః" అనునది యెట్లు పొసగును? అనగా క్రియాసాధనము జ్ఞానసాధనమును అగు మనస్సుకన్నను కేవలజ్ఞానసాధనమగు బుద్ధికి ప్రాధాన్యమెట్లు పొసగును, అని ప్రశ్నరాగా క్రియావిశేషమును బట్టి కరణములకు ప్రాధాన్యము. అనగా చక్షురాది వ్యాపారమందు మనస్సు ప్రధానము. మనోవ్యాపారమునం దహంకారము ప్రధానము. అహంకార వ్యాపారమున బుద్ధి ప్రధానము. కాన నిట బుద్ధికి ప్రాధాన్యము యుక్తమే యగునని భిక్షువనుచున్నాడు.

36 కారిక

సాం-ద = 11. 45 వ సూత్రమును జూడుడు.

37. కారిక

ఇట నిత్యమగు ప్రధానపురుష భేదమును బుద్ధి, విశినష్టి = బోధించుచున్నదని అర్థము. దీనివలన నిత్యమగుప్రధాన పురుష భేదమునకు బుద్ధి యెట్లు జనకమగునను శంక కవకాశము లేదు.

38. కారిక

సాం. ద = 111. 1 వ సూత్రమును జూడుడు.

నైయాయిక సమ్మతములగు పరమాణువులు సాంఖ్య మతమున తన్మాత్రలని వ్యవహరింపబడినవి. కాని వారిమతమున పరమాణువులు నిత్యములు, వీరి మతమున తన్మాత్రలు

జన్యము లను విశేషము మాత్రము కలదు. (22 వ కారికా టిప్పణమును జూడుడు.) ఇట నవిశేషపదమునకు శాంతత్వాది రహితములనియు సుఖదుఃఖ మోహాత్మకములుగ అస్మదాదులకు గోచరింపని వనియు వాచస్పతి వ్యాఖ్య.

ఉద్రిక్త సత్త్వగుణము కలవనియు దేవాదులకు సుఖదుఃఖ మోహాత్మకములుగ గోచరము లగుచున్నవనియు మాఠర వ్యాఖ్య.

యోగులచే కేవల సుఖరూపముగనే గ్రహింపబడును. కాని విశేషములందువలె సుఖాది తారతమ్యము తన్మాత్రలందు లేదని భిక్షుమతము. కాగా వాచస్పతి మతమున తన్మాత్రలందు శాంతత్వముగూడ లేదనియు మాఠరాదిమతమున దుఃఖమోహములు లేవు కాని శాంతత్వ ముండవచ్చుననియు దోచుచున్నది.

## 39. కారిక

సాం. ద = 111. 2 వ సూత్రమును జూడుడు.

ఇట సూక్ష్మశరీరమన లింగశరీరము. ఇది బుద్ధి పంచతన్మాత్రలు ఏకాదశేంద్రియములు మొత్తము పదునేడింటి సముదాయ రూపము. ఇందులో ఆఱు అవిశేషరూపములు. అయినను పదునొకండు ఇంద్రియములును భోగసాధనములగుట వలన విశేష బాహుళ్యమునుబట్టి లింగశరీరము విశేషములో జేర్పబడినదని వాచస్పతి.

మాఠర విజ్ఞానభిక్షువుల వ్యాఖ్యలనుబట్టి సూక్ష్మశరీరము లింగశరీరము స్థూలశరీరము అని శరీరము త్రివిధము. వీనిలో

సూక్ష్మశరీరము పంచతన్మాత్రలవలన పుట్టును. ఇదియే బుద్ధ్యహంకారేంద్రియ సంబంధమువలన లింగశరీరముగ మారును. దీనిని కాపాడుటకొఱకు స్థూలశరీర మేర్పడినది. స్థూలశరీరము నశించినపుడు తిరిగి స్థూలశరీర మేర్పడునంతవరకు లింగశరీరము సూక్ష్మశరీరము నాశ్రయించునని తేలుచున్నది.

## 40. కారిక

సాం. ద = 111. 3, 6, 7 సూత్రముల జూడుడు.

సమష్టిరూపమగు లింగశరీరము సర్గాదియందొక్కటియే. ఇది ఒక్కటియే అయినను పితృలింగ దేహమునుండి పుత్రకన్యాది లింగదేహములవలె పిమ్మట జీవభేదమునుబట్టి అనేక లింగశరీరములు పుట్టుచున్నవని భిక్షువు. ఇది సమష్టి లింగశరీరాభిమాని, హిరణ్యగర్భుడు అను వేదాంతి మతమునకు సరిపోవుచున్నది.

## 41. కారిక

సాం. ద = 111. 11, 12 సూత్రముల జూడుడు.

ఈ కారికావతరణమునుబట్టి అహంకారేంద్రియములతోగూడిన బుద్ధిని ఒక శరీరముక్రిందను సూక్ష్మశరీరమును దీనికన్న వేఱుగను అంగీకరించిన ట్లగపడుచున్నది. కాన నింతకు పూర్వమును సూక్ష్మ లింగ స్థూలశరీరము లున్నట్లు తోచుచున్నది.

ఈ కారికయందు "అవిశేషైః । విశేషైః" అని పాఠభేదము కలదు. అవిశేషైః అను పదమునకు తన్మాత్రలని

గౌడపాద మాఠరులవ్యాఖ్య. విశేషైః అనుదానికి సూక్ష్మశరీర మర్థమని వాచస్పతి టీక. కాగా సాంఖ్యమతమున శరీరత్రయము సిద్ధించుచున్నది. సూక్ష్మశరీరము లింగశరీరమునం దంతర్భూత మగుటవలన దానిని వాచస్పతి వేఱుగ గ్రహించుటలేదని తోచుచున్నది. పంచతన్మాత్రలతోగూడిన బుద్ధ్యహంకారము లకే సూక్ష్మశరీరమని వ్యవహారము. మరణానంతరముతిరిగి పుట్టు వఱకును స్థూలశరీరము లేనపుడు బుద్ధ్యాదుల కాశ్రయము సూక్ష్మ శరీరమే కాన సూక్ష్మశరీరము సిద్ధించుచున్నది.

## 42. కారిక

సాం. ద = 111. 16 వ సూత్రమును జూడుడు.

పురుషార్థహేతుకమ్ = పురుషార్థము ఫలముగాకలది అని అర్థము. నిమిత్తనైమిత్తిక ప్రసంగేన = ధర్మాదులయొక్కయు తత్కార్యమగు స్థూలశరీరముయొక్కయు సంబంధము చేతను అని అర్థము. ప్రకృతికి విభుత్వమన సర్వశక్తి సంపన్నత్వమనియర్థము. నైమిత్తికపదమునకు ఊర్ధ్వగమనాదిక మర్థమని మాఠరగౌడపాదులు.

## 43. కారిక

కపిలుని జ్ఞానాదులు జన్మాంతర తపస్సంస్కారము వలననే సిద్ధించినవి. అయినను వాల్మీకికివలె ఈ జన్మమందలి తపోమహిమవలన సిద్ధించినవి మాత్రముకావు. ఇట్టిభేదమును బట్టియే సాంసిద్ధికములనియు వైకృతికములనియు జెప్పబడినవి. ఇట భావములు స్వాభావికములనియు నైమిత్తికములనియు

రెండువిధములగుచున్నవి. వానిలో స్వాభావికములకే ప్రాకృతికములనియు వ్యవహారము; అని వాచస్పతి మతము.

స్వాభావికములనియు ప్రాకృతములనియు నైమిత్తికములనియు భావములు మూడువిధములని మాఠరగౌడపాదుల మతము. పుట్టుకతో సిద్ధించినవి స్వాభావికములు. ప్రకృతి పరిణామమునుబట్టి యేర్పడినవి ప్రాకృతికములు అని వీరి యభిప్రాయము. కపిలుని జ్ఞానవైరాగ్యాదులు స్వాభావికములు. సనకాదుల జ్ఞానవైరాగ్యములు పదునాఱవ సంవత్సరమున గలిగినందున అవి ప్రాకృతములనియు వీరి యభిప్రాయము. మాండూక్యకారికలందు అలాతశాంతి ప్రకరణమున 9 వ కారికయందు ప్రకృతి నాలుగువిధములుగ జెప్పబడినది. చూడుడు.

## 44. కా రి క

సాం. ద = 111. 23, 24 సూత్రముల జూడుడు.

ధర్మమువలన బ్రాహ్మ, ప్రాజాపత్య, ఐంద్ర, పైత్ర, గాంధర్వ, యక్ష, రాక్షస, పైశాచలోకముల జనియించును. పైత్రమునకుబదులు సౌమ్యము అని గౌడపాద భాష్యమందు కలదు. అధర్మమువలన పశు, పక్షి, సరీసృప, స్థావరరూపముల నొందునని మాఠరవ్యాఖ్య. పరహింసారహితములగు జపాదులు కేవల ధర్మములు. ప్రాణిహింసతో గూడిన యాగాదులు శుక్లకృష్ణ ధర్మములు. శాస్త్రనిషిద్ధములు హింసాబహుళములు నగునవి అధర్మములని జయమంగళటీక.

ధర్మమువలన స్వర్గ, మహాలోక, జనోలోక, తపోలోక, సత్యలోకములందు పుట్టును. అధర్మమువలన సుతల, రసాతల, తలాతల మహాతల పాతాళలోకములందు పుట్టును. ధర్మాధర్మముల సమ్మేళనమువలన భూః, భువః, అతల, వితల లోకముల పుట్టును. అని పూర్ణచంద్రుని వ్యాఖ్య. వైకృతోపాసకులకు విదేహోపాసకులని పేరువచ్చుటకు "విగతజ్వరాః" అని పురాణములందు చెప్పుట కారణమని రమేశచంద్రు డనుచున్నాడు. కాని యిది ఆలోచింపవలసి యున్నది. వైకృతిక బంధము కలవారలకు స్థూలదేహము లేదు. కాన విదేహులనుట సమంజసమని తోచుచున్నది.

పూర్ణచంద్రుని టీకను జూడుడు. ఈ బంధములు యోగదర్శన సమాధి పాదవ్యాస భాష్యమున 24 వ సూత్రమున నిరూపింపబడినవి. దాక్షిణిక బంధమునందు విరక్తుడగువానికి భూతేంద్రియాద్యుపాసల వలన వైకృతబంధము సిద్ధించును. దానియందు విరక్తుడై భూతేంద్రియ కారణమగు ప్రకృతి నుపాసించు వానికి ప్రాకృతిక బంధము సిద్ధించును. ఎవరు దేని నుపాసింతురో వారి కా యుపాస్యముతో నేకీభావము "తత్క్రతు న్యాయమున" సిద్ధించును.

## 45. కారిక

తన యదృష్టమున సంభవించిన శరీరమును పొందుటయే సంసారము. శ్రీకృష్ణాదులకు అదృష్టములేనందున లీలకొఱకు స్వీకరించిన శరీరసంబంధము సంసారము కానేరదు. గౌడపాదులు ప్రకృతి శబ్దముచే తన్మాత్రలనుకూడ గ్రహించిరి.

## 46. కా రి క

సాం. ద = 111.37,38 సూత్రముల జూడుడు.

ప్రత్యయసర్గము విపర్యాయము, అశక్తి, తుష్టి, సిద్ధి అని నాలుగు విధములగుచున్నది. ఒక స్థాణువును (మొద్దును) చూచి ఇది స్థాణువా లేక పురుషుడా! అని సందేహించును. ఇది బుద్ధియందలి విపర్యయసర్గము. పిదప నిదానించియు స్థాణువనికాని పురుషుడనికాని నిర్ణయింపజాలనపుడు అశక్తి సర్గము. మనకీ నిర్ణయముతో నేమిపనియని ఊరకుండుట తుష్టి యనబడును. పిదప నా స్థాణువునం దొక పక్షినిజూచి ఇది స్థాణువే యని నిర్ణయించును. ఇదియే సిద్ధిసర్గమని మాఠర గౌడపాదులనుచున్నారు.

ఈ కారికయందలి "ఏషః" అను పదముచే 44, 45 వ కారికలందు చెప్పబడిన ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యములు అధర్మాజ్ఞానావైరాగ్యానైశ్వర్యములును అను ఎనిమిదియు వీని ఫలములగు ఊర్ధ్వగమనాదు లెనిమిదియు మొత్తము 16 ను గ్రహింపవలయును. ఇందు జ్ఞానమువలన మోక్షమును మిగిలిన యేడింటివలన బంధమును సిద్ధించును. పై పదునాఱు విధములగు ప్రత్యయ సర్గము నిట సంగ్రహముగ నిరూపించుచున్నాడని జయమంగళునిటీక. 23, 44, 45 కారికలందు ప్రత్యయ సర్గము చెప్పబడినది కాన 46 మొదలు 51 వ కారిక వఱకును ప్రక్షిప్తమని కీతుమహాశయుడనుచున్నాడు.

## 47. కారిక

సాం. ద = 111.39, 40 వ సూత్రముల జూడుడు.

విపర్యయ మయిదు విధములను విషయము పాతంజల దర్శనమున నిరూపింపబడినది. సమాధిపాదము 8 వ సూత్రమును జూడుడు. ఈ విపర్యయములు దుఃఖకారణములగుట వలన వీనిని పాతంజలులు క్లేశములని చెప్పెదురు. కౌముదిలో చెప్పబడిన వార్షగణ్యులు పతంజలియే కాని మఱియొకరు కారు. అవిద్యయన నంతఃకరణము నందుండెడి భ్రమ సంస్కారము. దీనివలన బుట్టిన దేహాత్మభ్రమకు అస్మితయని వ్యవహారము. పాతంజల దర్శన-సాధనపాద, 6 వ సూత్రమున తత్త్వవైశారదిని జూడుడు. 7 వ సూత్రమున రాగము 8 వ సూత్రమున ద్వేషము 9 వ సూత్రమునం దభినివేశమును నిరూపింపబడినవి.

"తమో మోహః మహామోహః తామిస్రోహ్యంధసంజ్ఞకః ।
అవిద్యా పంచపర్వైషా ప్రాదుర్భూతా మహాత్మనః"
అని విష్ణుపురాణము.

## 48. కారిక

సాం. ద = 111.41, సూత్రమును జూడుడు.

"అభూత సంప్లవంస్థాన మమృతత్వం హిభాష్యతే" అను నార్యోక్తినిబట్టి దేవతలు ప్రళయము వఱకును మరణము లేనివారు, ఇంతియేకాని ఎన్నడును మరణము లేనివారనిమాత్రము

కాదు. ఈ అమరత్వమునే "అమరా నిర్జరా దేవాః" అని నామ లింగానుశాసనమునం దమరుడు చెప్పియున్నాడు.

మరణము వలనకాని ధనహానివలనకాని భయము మనుష్యులకు కలుగును. కాన మనుష్యాభినివేశము ద్వివిధము. దేవతలకు స్వకీయ ధనహానివలన కలిగెడి భయము అభినివేశము. ఇదియె దేవాభినివేశ మనుష్యాభినివేశముల కుండెడి భేదము.

దేవాదులకు విషయములగు పంచతన్మాత్రలును కేవల సుఖరూపములు, దివ్యములును. మనుష్యులకు గోచరమగు శబ్దాదులు స్థూలములు కాన నివి సుఖదుఃఖ మోహాత్మకము లగుటవలన సుఖదుఃఖ రూపములును అదివ్యములును నగుచున్నవని మాఠర వ్యాఖ్య.

## 49. కారిక

సాం. ద = 111.39, సూత్రమును జూడుడు.

ఇంద్రియ వధములు ప్రత్యయసర్గ మెట్లగుననిన ఇంద్రియ వధము ప్రత్యయపధకు కారణమగుటవలన కారణమగు నింద్రియ వధనుగూడ ప్రత్యయసర్గమున చేర్చెనని పూర్ణచంద్రుని వ్యాఖ్య.

అహంకారము ప్రత్యయకార్యము గాన అహంకారసర్గ మగు నింద్రియవధను ప్రత్యయసర్గమున జేర్చిరని జయమంగళ వ్యాఖ్య. గౌడపాద భాష్యమందు 'కష్ట' అనునెడ ప్రసుప్తి అనియు జడతకు బదులు ఉపజిహ్వాక అనియు కలదు.

## 50. కా రి క

సాం. ద = 111.43 వ సూత్రమును జూడుడు.

ఉపాదాన మన సన్యాసము. అంకురమునకు సలిలమె ట్లవసరమో అట్లే వివేక ఖ్యాతికి సన్యాస మవసరము. కాన సన్యాసమును సలిలమని చెప్పిరి. ఇట వాచస్పతి నిరూపించిన తుష్టులు వంచ కోపదేశరూపము లగుచున్నవి. కాన వీనివలన వివేకఖ్యాతి జనించుట కవకాశము లేదు. ఈ తుష్టుల వ్యతిరేకము (అభావము) వివేకఖ్యాతి కనుకూలముకాగా నట్టి వ్యతిరేక మును అశక్తిలో జేర్చుట యెట్లు? ఆత్మ సాక్షాత్కారమువఱకు గలిగిన పరిణామము ప్రకృతివలన గలుగుచున్నది. దానితో నాకు సంబంధము లేదు. నేను నిర్వికారుడను అను తుష్టి అంభస్సనబడును. ఈ తుష్టివలన సన్యసించినపిదవ గలిగిన ఉపాదానతుష్టి సలిలము. పిమ్మట సన్యాసమునందు చిరకాలము సమాధి నభ్యసించుచు ఆ సమాధియందలి తుష్టి కాలతుష్టి. ఇదియే మేఘమనియు ఓఘమనియు చెప్పబడుచున్నది. ఇట్లు సమాధియందు వరమకాష్ఠను పొంది వివేకఖ్యాతికి సమీపించి నపుడు కలిగినతుష్టి భాగ్యతుష్టి. ఇదియె వర్షమని భిక్షు వను చున్నాడు. ఈ వ్యాఖ్యానము వాచస్పతి వ్యాఖ్యానమునకు విరుద్ధముగ నున్నది. కాని వాచస్పతి హేయతుష్టులను నిరూ పించెను. భిక్షువు ఉపాదేయ తుష్టులను నిరూపించెను. ఇపు డీ రెండు వ్యాఖ్యానములును సరిపడును. ఈ విభాగము గౌడ పాద టీకలో సూచింపబడినది.

## 51. కారిక

సాం. ద = 111. 44 సూత్రమును జూడుడు.

"ఆత్మావారే ద్రష్టవ్యః, శ్రోతవ్యః, మంతవ్యః, నిధిధ్యాసితవ్యః" అను శ్రుతిచే శ్రవణ, మనన, నిధిధ్యాసలు జ్ఞానోత్పత్తికి సాధనములని నిరూపింప బడినది. ఈ కారికయందును శబ్దః, అధ్యయనమ్ అను పదములచే శ్రవణమును, ఊహాశబ్దము చేత మననమును, దానశబ్దముచే నిధిధ్యాసయు నిరూపింపబడినవి. ప్రకృతిపురుష వివేకజ్ఞానము అవిద్యా సంబంధ మున్నంత వఱకు అపరిశుద్ధముగ నుండును. వశీకార సంజ్ఞకల పరవైరాగ్యావస్థ యందుండెడి చిత్తమునందు వివేకజ్ఞానము శుద్ధమగును. ఈ శుద్ధియే దానశబ్దముచే జెప్పబడినది. ఇట్లు దానశబ్దముచే నిధిధ్యాస చెప్పబడినది. ఈ విషయమే యోగదర్శన—సాధనపాద, 26 వ సూత్రమున నిరూపింప బడినది. ఆ సూత్రమునే వాచస్పతి కౌముదిలో నుదాహరించెను. అనిరుద్ధుడు ఊహాను తార మనుచున్నాడు. వాచస్పతి తారతార మనుచున్నాడు.

శబ్దము, సుతారము, అధ్యయనము, తారతారము, సుహృత్ప్రాప్తిః రమ్యకము, బాహ్యాంతశ్శుద్ధి, సదాముదితము, ఆధ్యాత్మిక దుఃఖవిఘాతము, ప్రమోదము, అధిభౌతికదుఃఖ విఘాతము, ముదితము, ఆధిదైవికదుఃఖ విఘాతము, మోదమానము అని అనిరుద్ధుని వృత్తిలో కలదు. కాగా ఊహావద్ద, వాచస్పతికిని అనిరుద్ధునకును సంజ్ఞయందు భేద మగపడుచున్నది.

దీనిలో దుఃఖవిఘాత రూపములగు చివర మూడును ఫలరూపములు; మొదటి అయిదును సాధనరూపములు నగుచున్నవి. కాగా పురుషార్థ సాధనములగు ధర్మార్థములకు పురుషార్థత్వమువలె నిట సిద్ధిసాధనములను సిద్ధులని వ్యవహరించిరి. వాచస్పతి వ్రాసిన పరమతము భిక్షుమతము. ఇట సంకుశమన నాకర్షకము. కాగా ఊహ, శబ్దము, అధ్యయనము సిద్ధుల కాకర్షకములనియు భిక్షువు.

## 52. కారిక

సాం. ద = 111.45 వ సూత్రమును జూడుడు.

ఇట లింగశబ్దమునకు అతీంద్రియములగు మహదాదుల సర్గమనియు భావశబ్దమునకు ప్రత్యక్షవిషయములగు భూతాదుల సర్గమనియు నారాయణతీర్థు లనుచున్నారు. లింగమన మహత్తత్త్వము (బుద్ధి) అనియు భావమనబుద్ధిధర్మమగు జ్ఞానాది సంస్కారమనియు భిక్షువు. కాగా తీర్థులమతమున నింద్రియములు విషయములును కలిసి భోగసాధనములు. భిక్షుమతమున మహత్తత్త్వమును దానియందుండెడి సంస్కారములును బీజాంకురన్యాయమున పరస్పరము కారణములై భోగసాధనములని సిద్ధించుచున్నది. 'భావనివృత్తిః' అని జయమంగళ పాఠము.

## 53. కారిక

సాం. ద = 111.46, 47 సూత్రముల జూడుడు.

జనస్తపస్సత్యము లను మూడులోకములకును బ్రహ్మలోకమనియు వానియందుండెడివారికి బ్రాహ్మణులనియు వ్యవ

హారము. మహర్లోకవాసులకు ప్రాజాపత్యులనియు స్వర్గలోక వాసులకు ఐంద్రులనియు దేవతలనియు వ్యవహారము.

## 54. కా రి క

సాం. ద = 111.48, 49, 50 సూత్రముల జూడుడు.

లింగసర్గము, భూతసర్గము, భౌతికసర్గమని, మొదట సర్గము మూడువిధములు. వీనిలో బ్రహ్మాది స్తంబపర్యంత మయిన భౌతికసర్గము పైకారికయందు నిరూపించిన తీరున 14 విధములగుచున్నది. కాగా లింగభూతసర్గములతో గలిపి మొత్తము ప్రాకృతసర్గము 16 విధములు. ఈ కారికయందు విశాలపదము నుపయోగించుటవలన ప్రతిసర్గమందును సత్వరజ స్తమోగుణములు మూడును కలవని స్పష్టమగుచున్నదని గౌడపాదుల వాఖ్య.

## 55. కా రి క

సాం. ద = 111.53 వ సూత్రమును జూడుడు.

"తస్మాద్దుఃఖం స్వభావేన" అనుటవలన సర్గమంతయు వివేకికి దుఃఖమయము. దీనివలన మోక్షసాధనమగు వైరాగ్యము సూచింపబడినది. పాతంజల దర్శనమందును "పరిణామ తాప సంస్కారదుఃఖైర్గుణవృత్తి విరోధాచ్చ దుఃఖమేవసర్వం వివేకినః" అను సూత్రమం దీ విషయమే నిరూపింపబడినది. దేవాదులకును మరణము తప్పదని యీ కారికవలన స్పష్టమగు చున్నది.

## 56. కారిక

సాం. ద = 111.58 వ సూత్రమును జూడుడు.

"పరార్థః" అను చోటున అర్థము రెండు విధములు. శబ్దాది విషయోపలబ్ధి మొదటిది. సత్త్వాదిగుణములకును పురుషునకునుగల భేదోపలబ్ధి రెండవది. ప్రకృతి మొదట శబ్దాది విషయములందు పురుషుని ప్రవృత్తింపజేసి తన్మూలక దుఃఖానుభవము కలిగిన పిమ్మట గుణపురుషులను గల భేదోపలబ్ధిని కలిగించునని మాఠరవృత్తి. ఈ విషయము పాతంజల దర్శనమున సాధన పాదమందు 21, 22 సూత్రముల నిరూపింపబడినది.

మరియు "సంఘాత పరార్థత్వాత్" అను 17 వ కారికను జూడుడు.

వాచస్పతిచే నీయబడిన పాచకోదాహరణము న్యాయ దర్శన 3 అ. 63 వ సూత్రమునం దీయబడినది. ఈ సందర్భమున గౌడపాదులు కుంభమెట్లు పురుషకార్యమును ముగించి నివర్తించునో అట్లే ప్రధానము ప్రకృతిపురుష వివేకమును కలిగించి నివర్తించునని ఉదాహరణమును చెప్పిరి. అచేతనమగు ప్రధానమున కచేతనమగు కుంభమును ఉదాహరణముగ నిచ్చుటయే యుక్తము. కాన వాచస్పతి మాఠరోదాహరణములకన్న గౌడపాదోదాహరణమే యుక్తమని తోచుచున్నది. ఈ కారికా వ్యాఖ్యాన సందర్భమున వాచస్పతిచే కేవల బ్రహ్మ కారణతావాదము (వేదాంతుల మతము) పాతాంజల మతము, చార్వాక మతమును నిరసింపబడినవి.

## 57. కా రి క

వాచస్పతి మతమం దీకారిక ప్రవృత్తిపరముగ నిరూపింప బడినది. మాఠర గౌడపాదుల మతమందు వత్సవృద్ధిని పొందునంతదనుక క్షీరము ప్రవర్తించి పిమ్మట నివర్తించు నట్లే అని ప్రవృత్తికి నివృత్తికిని గూడ కావచ్చునని నిరూపింప బడినది. సాం. ద = 3 అ. 59 వ సూత్రమందలి అనిరుద్ధవృత్తి వాచస్పతికి అనుకూలము. ఈ సూత్రమందు "అచేతనత్వేపిక్షీర వచ్చేష్టితం ప్రధానస్య" అనుటవలన క్షీరము దధిరూపముగ మాఱినట్లు ప్రధానము మహదాదిరూపముగ మాఱును అని కలదు. రెండవ అధ్యాయమునందు 37 వ సూత్రమున ధేనువు వత్సను పోషించును అని అనిరుద్ధవృత్తిలో కలదు. కాని ఆ సూత్రమందలి ధేనుపదము చేతనమగు గోవును బోధింపదు. గోవునలన గలిగెడి పాలనే చెప్పును. అట్లుకానియెడల ఆదృష్టాంతము సరిపడదు. కాగా ఈ సూత్రమేల ? అని శంకింపరాదు. 2.37 వ. సూత్రమున పాలు కొన్నిటియందు స్వయముగ స్రవించును. మఱికొన్నిటియందు వత్సప్రయత్నమువలన లభించును. అని చెప్పబడినది కాన పునరుక్తి లేదు. మఱియు 2.37 వ సూత్రముచే క్షీరముయొక్క ప్రవృత్తి చెప్పబడినది. 3.59 వ సూత్రముచే అచేతనమునకు స్వాభావిక ప్రవృత్తి చెప్పబడినది. కావుననే చేతనమగు గోవు వత్సకొఱకు పాలను చేపుచున్నది. కాని అచేతనమగు క్షీరము స్వయముగ ప్రవర్తించుటలేదు. కాన అచేతనమగు ప్రధానమునకు సహజ పరిణామము సరిపడదు అను శంక కవకాశము లేదు. గోవుయొక్క

ప్రయత్నము లేకుండగనే కొన్ని యావులకు పాలు సహజముగ స్రవించును. పురుష ప్రయత్నము లేకుండగనే క్షీరము దధి రూపముగ మాఱును. ఇట్లే ప్రధానము యొక్క ప్రవృత్తియు పరిణామమును స్వాభావికములు కావచ్చును. అచేతనములకు సప్రయోజన ప్రవృత్తి కలదను విషయము పాశ్చాత్యదర్శనము లందును (ఘోపెన్‌హాక్, హార్ట్ మెన్ను), మున్నగువారిచేతను సమర్థింపబడినది.

## 58. కారిక

లోకమందు పిల్లల వేడుకనుబట్టి తల్లులు తమకు ఫలము లేకున్నను ప్రవర్తింతురు. అట్లే ప్రధానము స్వార్థము లేకున్నను ప్రవర్తించును.

## 59. కారిక

ప్రకృతి మహదాదిరూపమున పురుషున కగపడి పురుషునకు భోగమును కలిగించి విరక్తుడై పిదప వివేకఖ్యాతిని పుట్టించి తాను నివర్తించును. పిమ్మట దుఃఖసాధనము లేకుండుటవలన పురుషునకు మోక్షము సిద్ధించును. సాం. ద = 3 అ. 69 వ సూత్రమును జూడుడు.

## 60. కారిక

ఇట ప్రకృతి స్వార్థము లేకుండగనే పురుషార్థమునుచేయు చున్నదని వాచస్పతి. తొలుత స్వార్థము లేకుండగనే పురుషున కుపకారమునుజేసి పిదప నీవు వేఱు, నేను వేఱని బోధించి నివర్తించును. మఱియు గుణవతియగు ప్రకృతి నిర్గుణుడగు

పురుషునికి స్వార్థము లేకుండగనే ఉపకారమును చేయుచున్నది కాన నెమలి తోకయందలి కన్నునవలె ప్రకృతివైపుననే చిత్రము. పురుషునివైపు చిత్రమేమియును లేదని మాఠర వృత్తి. "చరతి" అనునెడ "కురుతే" అని పాఠభేదము కలదు.

## 61. కా రి క

ఇట "మే" అను పదమునకు పురుషు డర్థమని మాఠర వ్యాఖ్య. కారికాకారుడని వాచస్పతి. ప్రకృతి అని జయమంగళ టీక. ఈ మతమున సుకుమారతరమన సూక్ష్మతరమని యర్థము. పురుషునకు జ్ఞానోదయ మయినపిదప ఇక నాయొద్ద పురుషుడు జూడదగిన దేదియులేదు అను బుద్ధివృత్తి ప్రకృతికి కలుగును. కావుననే తిరిగి పురుషునకు గోచరముకాదు. 'సుకుమారతరమ్" అను పదమునకు సుభోగ్యతరమని గౌడపాదుల వ్యాఖ్య. వీరి మతమున ప్రకృతికన్న వేఱగు కారణము మఱియొకటి లేదని అర్థము. "భోగ్యతరమ్" అనుటవలన కారణముగూడ పురుషునకు భోగ్యమని తోచుచున్నది. ప్రకృతి అనేకులగు పురుషులను తనవశమం దుంచుకొని బంధించుచున్నది. కాన ద్రష్టయగును కాని సుకుమార కాజాలదని న్యాయమంజరీకారు లనుచున్నారు. "లోకమున కులాంగనకు స్వీయపురుషుడు పరపురుషుడను భేదము కలదు. ప్రకృతికి పురుషులందఱును స్వీయులే యగుచున్నారు. కాగా కులాంగనా దృష్టాంత మెట్లు సరిపడును ? ఒకసారి అగపడినను మరల నగపడకుండుట యెట్లు"అని శంకింపదగదు. అజ్ఞానావస్థయందు ప్రకృతికిగాని పురుషునకుగాని

పరత్వజ్ఞానమే లేదు. కావుననే ప్రకృతి పురుషు లిరువురునుకలసి మెలసి యుండిరి. వివేకజ్ఞాన ముదయించిన పిదప వివేకియగు పురుషుడు ప్రకృతికి పరుడే యగును. కాన వానికి మరల గోచరింపదు. ఈసందర్భమున సాం. ద = 3అ. 70 వ సూత్రమును జూడుడు. ఈ సూత్రమునుబట్టి ఉత్తరార్ధమునకు దోషము కలదిగా జూడబడిన కులాంగన యెట్లు నాథునికంట బడదో అని అర్థము చేయవచ్చును.

అచేతనమగు ప్రకృతికి చేతనమగు కులాంగనాదృష్టాంత మెట్లు పొసగుననని శంకింపరాదు. చేతన సాన్నిధ్యమువలన చేతనమువలె భాసించెడి శరీరేంద్రియ బుద్ధ్యాదులే కులాంగనా శబ్దార్థము. కాన దృష్టాంత వైషమ్యము లేదు. వివేకఖ్యాతి వలన అవివేక మూలకమగు ప్రకృతిపురుష సంయోగము నశించును. కాన వివేకి విషయమున ప్రకృతి ప్రవర్తింపదని సాంఖ్య సిద్ధాంత రహస్యము..

## 62. కారిక

సాం. ద = 111. 71, 72 సూత్రముల జూడుడు.

అవివేకియగు పురుషుని గురించి ప్రవర్తించుటయే ప్రకృతికి బంధము. వివేకియగు పురుషుని గురించి ప్రవర్తింపకుండుటయే మోక్షము. అని అనిరుద్ధుని వ్యాఖ్య. కారికయందలి "తస్మాత్" అను పదమునకు పురుషుడు అపరిణామి, నిర్గుణుడు అగుటవలన అని అర్థము.

## 63. కా రి క

సాం. ద = 111.73 వ. సూత్రమును జూడుడు.

వివేకిని గుఱించి ప్రవర్తింపకుండుట ప్రకృతియొక్క అపవర్గము. తనయం దారోపింపబడిన దుఃఖము నివర్తించుట పురుషున కపవర్గము. ఈ కారికయందలి "పురుషార్థ" పదము దేహళీదత్తదీపన్యాయమున బంధమందును, మోక్షమందును, ఉపయోగించుచున్నది. 73 వ సూత్రమున కోశకారము దృష్టాంతముగ నిరూపింపబడినది. కోశకారమన పట్టుపురుగు. అది తన్ను తానే బంధించుకొనునని భిక్షుమతము. ఇచ్చటి ఆత్మానమ్ అను పదమునకు పురుషుని అని నారాయణతీర్థులు చేసిన అర్థము.

## 64. కా రి క

సాం. ద = 111.75 సూత్రమును జూడుడు.

ఇట నాస్మి అను పదమువలన కర్తృత్వమును, నమే అను పదమువలన సంబంధమును, నాహమ్ అను పదము వలన తాదాత్మ్యమును నిషేధింపబడినవని భిక్షుమతము. ఈ సందర్భమున భిక్షువునకు మాఠరునకును సామ్య మగపడుచున్నది. నాస్మి అని క్రియానిషేధము, నాహమ్ అని కర్తృత్వ నిషేధము, నమే అని స్వామిత్వనిషేధము చెప్పబడినవని వాచస్పతి. నాస్మి అని ఆశ్రయత్వము, నమే అని సంబంధము, నాహమ్ అని పరస్పర తాదాత్మ్యము నిషేధింపబడినవని జయమంగళ టీక. నాస్మి, నమే, నాహమ్ అను మూడిటివలన కర్తృత్వ,

భోక్తృత్వ, జ్ఞాతృత్వములు నిషేధింపబడినవనియు జెప్ప వచ్చును. ఈ విషయము పాతంజల–దర్శనసాధనపాద– 26 వ సూత్రమునను జెప్పబడినది.

## 65. కా రి క

సాం. ద = 111. 77, 78 సూత్రముల జూడుడు.

ఈ కారికయందు సుస్థః అనునెడ స్వస్థః అని పాఠము కలదు. దీనినే మాఠరాదులు వ్యాఖ్యానముచేసిరి. స్వస్థః= స్వస్వభావమం దుండువాడు. బుద్ధియొక్క ధర్మములగు సుఖ దుఃఖాదుల సంబంధములేక కేవల చిద్రూపమున నున్నవాడు అని మాఠరగౌడపాద జయమంగళుల వ్యాఖ్యానము. కాగా వీరి మతమం దాసమయమున సాత్త్విక బుద్ధి సంబంధముగూడ లేదని తోచుచున్నది. వాచస్పతి మతమునం దప్పుడు సాత్త్విక బుద్ధిసంబంధము కలదని నిరూపింపబడినది. ఈ విషయము పాతంజలదర్శన–సమాధి పాద 3 వ సూత్రమున నిరూపింపబడినది. "తదా ద్రష్టుః స్వరూపే అవస్థానమ్" అను పాతంజల సూత్రము మాఠర సమ్మత పాఠమున కనుకూలము. తేన = జ్ఞానముచేతను అని అర్థము.

## 66. కా రి క

ఈ కారికావ్యాఖ్యాన సందర్భమున నటీసభ్యులను ఋణ దాతృప్రతిగ్రహీతలను వృద్ధదంపతులను మాఠరు డుదాహరించెను. నటి యెట్లు రంగమున నృత్యముసంతను జూపి, ఇక పనిలేదని నివర్తించునో, పురుషు డెట్లుపేక్షించునో, అట్లు కాని

ఋణదాతకును గ్రహీతకును ఋణసంబంధము తీరిన పిమ్మట కలయిక ఉన్నను ఎట్లు తాటస్థ్యమో, వృద్ధదంపతులకు కలయిక ఉన్నను యెట్లు నిరుపయోగమో, అట్లే వివేకఖ్యాతి కలిగిన పిమ్మట ప్రకృతిపురుషులకు సాన్నిధ్యమున్నను సర్గము మాత్రము ఉండనేరదని భావము.

## 67. కారిక

సాం. ద = 111. 82, 83 సూత్రముల జూడుడు.

ధర్మాదీనా మకారణప్రాప్తౌ = ధర్మాదులకు అకారణత్వము సిద్ధింపగా అని వాచస్పతి వ్యాఖ్య. వివేకఖ్యాతి కలిగిన పిమ్మట ప్రారబ్ధకర్మవేశముయొక్క అనువృత్తి వలననే జీవన్ముక్తునికి శరీరధారణము సంభవించుచున్నది. ఈజీవన్ముక్తావస్థయందు జ్ఞానికి భోగాభాసమేకాని భోగములేదు. కొందఱు అవిద్యావేశానువృత్తివలన జీవన్ముక్తునికి శరీరధారణ మనుచున్నారు. కాని అవిద్య జన్మకు కారణమగు కర్మలను ఫలోన్ముఖములుగ జేయును. ఇంతియెకాని కర్మవలన పుట్టిన శరీరమును నిలుపుటకు హేతువు కానేరదు. ఈ విషయము యోగదర్శన వ్యాసభాష్యమున కలదు. కాన వీరిమతము సరికాదని భిక్షువు.

"జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్కురుతేఽర్జున" నాభుక్తం క్షీయతే కర్మ" అని రెండు విరుద్ధార్థములుగల వచనములున్నవి. ఇట సర్వకర్మ లన ప్రారబ్ధముకన్న మిగిలిన కర్మలని యర్థము. కాగా ప్రారబ్ధము భోగమువలన నశించును. సంచితము తత్త్వజ్ఞానము వలన నశించును. కావుననే జీవన్ముక్తావస్థ

ఉపపన్న మగుచున్నదని కొందఱనుచున్నారు. జీవన్ముక్తావస్థ లేదనియు, జ్ఞానము అన్నికర్మలను దహించుననియు సర్వజ్ఞముని ప్రభృతుల మతము. "నాభుక్తమ్" అను వచనము అజ్ఞాని విషయమని వీరి యభిప్రాయము. "తస్యతావదేవచిరమ్" అను శ్రుతి జ్ఞానస్తావకముకాని జీవన్ముక్తావస్థను చెప్పదని వీరందురు.

సాంఖ్యమతమున యోగమతమందును జ్ఞానము అజ్ఞానమును నశింపజేయును; కర్మలను నశింపజేయదు. అయినను జ్ఞానమువలన కర్మలకు సహకారియగు క్లేశాదిరూపమగు అజ్ఞానము నశించినందున సంచితకర్మలు దంచిన వడ్లవలె ఫలసాధనములు కాజాలవు. ప్రారబ్ధమువలన శరీరముమాత్రము కొంతకాల ముండవచ్చును. ఇదియె జీవన్ముక్తావస్థయని నిరూపింప బడినది. ఈ విషయమును యోగదర్శన సాధనపాద 13 వ సూత్రమున జూడుడు. నైయాయిక సాంఖ్యయోగ చైతన్య మతానుయాయులు కొందరు అద్వైతులును జీవన్ముక్తి నంగీకరింతురు. సర్వజ్ఞముని సముచ్చయవాదియగు రామానుజులును అంగీకరింపరు.

## 68. కారిక

సాం. ద = 111.84 వ సూత్రమును జూడుడు.

ఐకాంతికము = అవశ్యంభావి, ఆత్యంతికము = నిత్యము అని యర్థము. ఔషధము ఒకప్పుడు రోగమును తొలగించును. ఒకప్పుడు తొలగింపజాలదు. మఱియు నౌషధమువలన నశించిన రోగము తిరిగి మఱియొకప్పు డుదయింపవచ్చును. అట్లు

గాక తప్పక నిశ్శేషముగ దుఃఖనివృత్తిరూపమగు మోక్షము వివేకఖ్యాతివలన సిద్ధించునని చెప్పుటకు ఐకాంతికాత్యంతికపదములు కారికలో గ్రహింపబడినవని మాఠరవృత్తి. ఈవిషయము 1 వ కారికా టిప్పణిలో వ్రాయబడినది.

## 69. కారిక

"యత్ర" అనుచోటున నిమిత్తసప్తమి. యచ్ఛబ్దమునకు జ్ఞానమర్థము. కాగా ఏ జ్ఞానముకొరకు అని అర్థము సిద్ధించుచున్నది. "నిమిత్తాత్కర్మయోగే" అను వార్తికమువలన నిట సప్తమి సిద్ధింపవలయును. కాని కర్మసంబంధ మేమియు లేదు. అందువలన "అంతర్ధానేనా దర్శనమిచ్ఛతి" అను జ్ఞాపకమును బట్టి నిమిత్తసామాన్యమందు సప్తమి అని గ్రహింపవలయును. కావుననే పాతంజల దర్శనమున 1 పాద. 13వ సూ. "తత్రస్థితౌ యత్నో అభ్యాసః" అనునెడ నిమిత్తసప్తమి వాచస్పతి మొదలగువారిచే నంగీకరింపబడినది.

## 70. కారిక

ఈ కారికయందు 3 వ పాదమున యతిభంగము కనబడుచున్నది.

## 71. కారిక

"యస్యాఃపాదేప్రథమే ద్వాదశమాత్రాః తథాతృతీయేపి ।
అష్టాదశద్వితీయే, చతుర్థకేపంచదశ సాఆర్యా"
అను కాళిదాసునిశ్రుతబోధనుబట్టి ఆర్యాలక్షణము నెఱుంగునది.

## 72. కారిక

70, 71, 72, కారికలకు గౌడపాదులు వ్యాఖ్యానమును చేయుటలేదు. ఈ కారికల సంఖ్యలో మతభేదముకలదు. నారాయణభట్ట– జయమంగళుల వ్యాఖ్యనుబట్టి 72 కారికలు సిద్ధించుచున్నవి. గౌడపాద టీకనుబట్టి 69 కారికలు సిద్ధించుచున్నవి. మాఠరమతమున 73 కారిక లగపడుచున్నవి. "తస్మాత్సమాస దృష్టం శాస్త్రమిదం నార్థతః పరిహీనమ్ I తంత్రస్య బృహన్మూర్తేః దర్పణసంక్రాంత మివబింబమ్" అను కారిక గూడ మాఠరవృత్తిలో కలదు. గౌడపాదభాష్యమున కారికలు 70 అని కలదు. కాని భాష్యము 69 కి మాత్రమే కలదు. కాన "కారణమీశ్వరమేకే బ్రువతేకాలంపరే స్వభావంవా I ప్రజాః కథం నిర్గుణతో వ్యక్తః కాలః స్వభావశ్చ" అను కారికను జేర్చి 70, అను సంఖ్యను తిలకు మహాశయుడు పూర్తిచేసియున్నాడు.

"సంసరతిభోగ్యభావాత్తన్నివృత్త్యాతుమోక్షదాప్రకృతిః I స్వాత్మన ఏవనపుంసోలోపో (క్లో) సా నస్వయంవేద" అని ఈ కారిక రామకంఠభట్టుని మోక్షకారికా గ్రంథమున సాంఖ్య కారికగ వ్రాయబడినది. కాన నిదియే 70 వ కారిక కావచ్చునని మద్రపురీవిశ్వవిద్యాలయ పరిశోధకమండలిలో నొక రగు సూర్యనారాయణశాస్త్రిగారు వ్రాసిరి.

# ప రి శి ష్ట ము

## (క)

సాంఖ్యాచార్యుల పేరు, మతము, మున్నగువానిని జూపు పట్టిక.

### పంచశిఖాచార్యులు

సాం. ద = అ-5. సూ. 32, ఆధేయశక్తియోగః పంచశిఖః॥

సాం. ద = అ-6. సూ. 68, అవివేకనిమిత్తోవా పంచశిఖః॥

"పంచవింశతితత్త్వజ్ఞో యత్రకుత్రాశ్రమేరతః ।
జటీముండీ శిఖీవాపి ముచ్యతేనాత్ర సంశయః" ॥

ఈ శ్లోకము గౌడపాద భాష్యమున 1 వ కారిక యందును, మాఠరవృత్తిలో 22 వ కారికయందును కలదు. ఇది పంచశిఖాచార్య విరచితమని హరిభద్రసూరి శాస్త్రవాద సముచ్చయ మను గ్రంథమునందు కలదు.

యోగదర్శన 1 వ పాద, 4 వ సూత్రభాష్యమందు "ఏకమేవదర్శనమ్, ఖ్యాతిరేవదర్శనమ్" అని వ్యాసు లుదాహరించిరి. ఈ సూత్రము పంచశిఖాచార్యులదని తత్త్వవైశారదీ కారులనుచున్నారు. యోగదర్శన 1 వ పాద, 25 వ సూత్ర భాష్యమున "ఆదివిద్వాన్నిర్మాణచిత్త మధిష్ఠాయ, కారుణ్యాద్భగవాన్ పరమర్షి రాసురయే జిజ్ఞాసమానాయ తంత్రం ప్రోవాచ" అని కలదు. ఈ వచనము పంచశిఖాచార్యులదని

తత్త్వవైశారదీకారు లనుచున్నారు. అందే 36 వ సూత్రభాష్య మున "తమణుమాత్రమాత్మాన మను విద్యాస్మి, ఇత్యేవంతా వత్సం ప్రజానీతే" అని కలదు. ఇదియు పంచశిఖాచార్యుల వచనమే అని తత్త్వవైశారది.

యోగదర్శ 2 వ పాద, 5 వ సూత్రభాష్యమున "వ్యక్త మవ్యక్తం వాసత్త్వమాత్మత్వేనాభిప్రతీత్య, తస్యసంపదమనునం దత్యాత్మసంపదంమన్వానః, తస్యవిపదమనుశోచ త్యాత్మవ్యా పదం మన్వానః, ససర్వోఽప్రతిబుద్ధః" అని కలదు. ఇది పంచ శిఖాచార్య వచనమని వాచస్పతి చెప్పుచున్నాడు.

అందే 6 వ సూత్రభాష్యమున "బుద్ధితః పరంపురుష మాకారశీల విద్యాదిభిర్విభక్త మపశ్యన్ కుర్యాత్తత్రాత్మ బుద్ధింమోహేన" అని కలదు. ఇది పంచశిఖుల వచనమని వాచస్పతి.

అందే 13 వ సూత్రభాష్యమున "స్యాత్స్వల్ప సంకరః సపరిహారః సప్రత్యవమర్శః కుశలస్య నాపకర్షాయాలమ్, కస్మాత్కుశలంహిమే బహ్వన్యదస్తి యత్రాయమావాపంగతః, స్వర్గేప్యపకర్ష మల్పం కరిష్యతి" అనికలదు. ఇదియు పంచశిఖుల వచనమే అని వాచస్పతి తత్త్వవైశారదియందును సాంఖ్యతత్త్వ కౌముది 2 వ కారికయందును చెప్పుచున్నాడు.

యోగదర్శన 3 వ పాద. 13 వ సూత్రభాష్యమున 'రూపాతిశయ వృత్త్యతిశయాశ్చ పరస్పరేణ విరుధ్యంతే సామాన్యానితు అతిశయైస్సహ ప్రవర్తంతే' అనికలదు. ఇది పంచశిఖుల వచనమని వాచస్పతి.

అందే 41 వ సూత్రభాష్యమున "తుల్యదేశ శ్రవణానా మేకదేశశ్రుతిత్వం సర్వేషాంభవతి" అనికలదు. ఇదియు వచననే అని వాచస్పతి.

సాం. ద = అ 1. సూ 127, భాష్యమున "సత్వంనామ ప్రసాద లాఘు వాభిష్వంగ ప్రీతి తితిక్షా సంతోషాదిరూపానంత భేదమ్, సమాసత స్సుఖాత్మకమ్, ఏవంరజోపి శోకాది నానా భేదమ్, సమాసతో దుఃఖాత్మకమ్, ఏవంతమోపి నిద్రాది నానా భేదమ్, సమాసతో మోహాత్మకమ్" అని పంచశిఖ వచనముదాహరింపబడినది. "తత్సంయోగ హేతువివర్జనా త్స్యాదయమాత్యంతికో దుఃఖప్రతీకారః" ఇది పంచశిఖవచనమని బ్రహ్మసూత్రశాంకర భాష్యభామతీకారు లనుచున్నారు. 2-2-10 వ సూత్రమును జూడుడు.

## ఆ సు రి

"వివిక్తేదృక్పరిణతౌ బుద్ధౌభోగోస్య కథ్యతే |
ప్రతిబింబోదయః స్వచ్ఛేయథా చంద్రమసోంభసి"

ఇది ఆసురివచనమని హరిభద్రసూరి షడ్దర్శన సముచ్చయటీకలో చెప్పుచున్నాడు.

## వార్షగణ్యులు

"పంచపర్వా అవిద్యేత్యాహ భగవాన్ వార్షగణ్యః" అని సాంఖ్యతత్త్వ కౌముది 47 వ కారికలో కలదు.

"గుణానాం పరమం రూపం న దృష్టిపథమృచ్ఛతి ।
యత్తుదృష్టిపథ ప్రాప్తం తన్మాయైవ సుతుచ్ఛకమ్"

ఇది వార్షగణ్య వచనమని భామతీకారు లనుచున్నారు. బ్ర. సూ. శాం 2-1-3 వ సూత్ర భామతిని జూడుడు. మఱియు పై శ్లోకము యోగదర్శన 4 వ పాద 13 వ సూత్రభాష్యమం దుదాహరింపబడినది. అచటి తత్త్వవైశారదియం దీ శ్లోకము షష్టితంత్ర మందలిదని కలదు. దీనినిబట్టి షష్టితంత్రము వార్షగణ్యనిర్మితమని వాచస్పతి మతమని తోచుచున్నది.

యోగదర్శన 3 వ పాద 53 వ సూత్రభాష్యమున "మూర్తివ్యవధి జాతిభేదాభావాన్నాస్తి మూలపృథక్త్వమ్" అని వార్షగణ్య వచన ముదాహరింపబడినది.

17 వ సాంఖ్యకారికా గౌడపాద భాష్యమందు "తథా చోక్తం షష్టితంత్రే పురుషాధిష్ఠితం ప్రధానాం ప్రవర్తతే" అని కలదు. వాచస్పతి మతమునుబట్టి ఇదియు వార్షగణ్యవచనమే కావచ్చును.

## జైగీషవ్యులు

"చిత్తైకాగ్ర్యా దప్రతిపత్తి రేవేతి జైగీషవ్యః" యోగ-ద = 2 పాద, 55 సూత్రభాష్యమును జూడుడు. యోగ-ద =

3 పా, 18 వ సూత్రభాష్యమందు "విషయసుఖాపేక్షయైవేద మనుత్తమం సంతోషసుఖముక్తమ్ । కైవల్యాపేక్షయా దుఃఖమేవ" అని జైగీషవ్యవచన ముదాహరింపబడినది. మఱియు నీ సూత్రభాష్యముననే జైగీషవ్యావట్య సంవాదము చెప్పబడినది. అశ్వఘోషుని బుద్ధచరితమందు జైగీషవ్యుడు సాంఖ్య మతావలంబి అని చెప్పబడినది. న్యాయవార్తిక తాత్పర్య టీకలో జైగీషవ్యుడు ధారణాశాస్త్రకారుడని చెప్పబడినది. 3–2–43 వ సూత్రమును జూడుడు.

## వింధ్యవాసులు

"అంతరాభవదేహస్తు నిషిద్ధో వింధ్యవాసినా" అని కుమారిలభట్టు శ్లోకవార్తికమునందు వింధ్యవాసుని మతమును చెప్పియున్నాడు. మనుస్మృతి వ్యాఖ్యానమున మేధాతిథిచే కుమారిల మతము సమర్థింపబడినది. అ 1.55 వ శ్లోకమును జూడుడు.

## సనందనాచార్యులు

"లింగశరీర నిమిత్తిక ఇతిసనందనః" అని సనందమతము సాం = ద. అ6.69 వ సూత్రమున చెప్పబడినది.

## (ఖ)

న్యాయసూత్ర, వాత్స్యాయన భాష్యములందు నిరూపింపబడిన ప్రాచీనసాంఖ్య సిద్ధాంతములు.

అ 3. ఆ1.63 వ సూత్రమున "త్వగ్వ్యతిరేకాత్" అని కలదు. ఇట త్వగింద్రియ మొక్కటియే, బుద్ధీంద్రియమని,

ప్రాచీన సాంఖ్యమతము చెప్పబడినది. బ్రహ్మసూత్రభాష్యభామతియందును, ఈ విషయము చెప్పబడియున్నది. 2.2.10 వ సూత్రమును జూడుడు.

అ 3. ఆ2.1 వ సూత్ర వాత్స్యాయన భాష్యమున "ఏవం హి పశ్యంతః ప్రవదంతి సాంఖ్యాః। పురుషస్యాంతః కరణభూతా నిత్యాబుద్ధిరితి" సాధనంచ ప్రచక్షతే। విషయప్రత్యభిజ్ఞానాత్" అని సాంఖ్యమతము చెప్పబడినది.

అ 3. ఆ2.8 వ సూత్రభాష్యమునను "నగత్యభావాత్" అను సూత్రభాష్యమందును, "సోయంనాంతః కరణేవివాదః।న తస్యనిత్యత్వే, సిద్ధంహి మనో అంతఃకరణమ్, నిత్యంచ, క్వ తహిౕవివాదః తస్యవిభుత్వే" అని మనస్సునకు నిత్యత్వమునందు సాంఖ్యసామ్యమును విభుత్వమం దసమ్మతియు చెప్పబడినది.

యోగదర్శనకైవల్యపాద 10 వ సూత్రభాష్యమందు "వృత్తిరేవాస్య విభునస్సంకోచ వికాసినీ" అని అంతఃకరణమునకు విభుత్వమే చెప్పబడినది. సాంఖ్యసూత్రములందు మాత్రము" అణుపరిమాణమ్ తత్కృతిశ్రుతేః" అనునెడ మనస్సునకణుత్వమే చెప్పబడినది. అ 3. సూ 14.

బ్రహ్మసూత్ర శాంకరభాష్యమందు పరస్పర విరుద్ధశ్చాయం సాంఖ్యానా మభ్యుపగమః । కేచిత్సప్తేంద్రియాణ్యనుక్రామంతి । క్వచిదేకాదశ, తథాక్వచిన్మహత స్తన్మాత్ర సర్గ ముపదిశంతి । క్వచిదహంకారాత్ । తథాక్వచిత్త్రీణ్యంతః కరణానివర్ణయంతి । క్వచిదేకమితి" అని ప్రాచీన సాంఖ్యమతములు కొన్ని ఉదాహరింపబడినవి. 2-2-10 సూ॥

## ముఖబంధ టిప్పణములు రచించుటకు నాధారముగ గ్రహింపబడిన గ్రంథముల పట్టిక.

1. సాంఖ్యకారికా

(క) వంశీధరమిశ్రకృత, సాంఖ్యతత్త్వవిభాకరటీకోపేత, తత్త్వకౌముదీ సహితా; చౌకాంబాప్రెస్, బెనారస్ 1921.

(ఖ) పూర్ణచంద్ర వేదాంత చుంచుకృత, వంగానువాద టిప్పణీయుత తత్త్వకౌముదీసహితా; సైదాబాద్ హితైషిప్రెస్, బరహాంపూర్, ముర్శిదాబాద్ 1901.

(గ) కృష్ణనాధన్యాయ పంచాననకృత, ఆవరణనాశినీ టీకోపేత, తత్త్వకౌముదీసహితా; కాత్యాయనీప్రెస్, కలకత్తా శకాబ్ద 1856.

(ఘ) రమేశచంద్ర తర్కతీర్థకృత గుణమయీ టీకోపేత, తత్త్వకౌముదీ సహితా; Calcutta Sanskrit Series కలకత్తా 1935.

(ఙ) గౌరకిశోర భాగవతాచార్యకృత వంగానువాద టిప్పణీయుత మాఠరవృత్తిసహితా; శ్రీ చైతన్యప్రెస్, కలకత్తా వంగాబ్ద 1347.

(చ) Colebrooke & Wilson కృత ఆంగ్లానువాద టిప్పణీయుత గౌడపాదభాష్యసహితా; Bengal Theosophical Society కలకత్తా 1887.

(ఛ) శంకరకృత జయమంగళ టీకాసహితా; చౌకాంబాప్రెస్, బెనారస్.

(జ) కామాఖ్యానాధ తర్కవాగీశకృత సాంఖ్యదీపనీసహితా; ఆర్యమిషన్ ప్రెస్, కలకత్తా, శకాబ్ద 1822.

(ఝ) హారదత్తశర్మకృత ఆంగ్లానువాద, భూమికా టిప్పణీయుత గౌడ పాదభాష్యసహితా; Oriental Book Agency పూనా 1933.

(ఞ) Davies కృత ఆంగ్లానువాద టిప్పణీసహితా; Truebner's Oriental Series, London ,1881.

(ట) సూర్యనారాయణశాస్త్రి కృతాంగ్లానువాద టిప్పణీ సహితా; మద్రాసు యూనివర్సిటీ మద్రాస్, 1935.

2. సాంఖ్యసూత్రమ్

(క) విజ్ఞానభిక్షుకృత, సాంఖ్యప్రవచన భాష్యసహితమ్ చౌకాంబాప్రెస్ బెనారస్.

(ఖ) ప్రమథనాథతర్క పంచాననకృత, అనులావ్యాఖ్యోపేత, అనిరుద్ధ వృత్తిసహితమ్ వాచస్పతీప్రెస్, కలకత్తా 1911.

3. కాపిలసూత్రమ్ (తత్త్వ సమాసః) రమేశచంద్ర కృత టిప్పణీయుత.

(క) రఘునాథకృత సాంఖ్యతత్త్వ విలాససహితమ్, (ఘ) పుస్తకములో కలిసియున్నది.

(ఖ) మాధవ పరివ్రాజక కృతవివరణ సహితమ్, ధర్మస్వరూపిణీసభా, కలకత్తా, శకాబ్ద, 1810.

4. సాంఖ్యసారము, విజ్ఞాన భిక్షుకృతము.

కాళీపాద తర్కాచార్యకృత వంగానువాద, సంస్కృతసార ప్రభా టీకాసహితము. ఛాత్రపుస్తకాలయము, కలకత్తా 1930.

(5) Keith కృత The Samkhya System, Heritage of India Series, Association Press, కలకత్తా

(6) Sovani కృత A Critical Study of the Samkhya System on the Line of the Samkhya Karika, Samkhya Sutra, and their Commentaries, Oriental Book Agency, పూనా, 1935.

(7) Garbe కృత Die Samkhya Philosophic, Leipzig, 1894.

8. యోగసూత్రమ్.

(క) వేదాంతమంచు పూర్ణచంద్రకృత, వంగానువాద టిప్పణీయుత, వ్యాసభాష్యసహితమ్, మణికాప్రెస్, కలకత్తా 1907.

(ఖ) వాచస్పతి మిశ్రకృత, తత్త్వవైశారదీయుత, వ్యాసభాష్య సహితమ్, ఘోష్ ప్రెస్, కలకత్తా, వంగాబ్ద 1326.

(గ) Wood కృతాంగ్లానువాదయుత వైశారదీ భాష్యసహితమ్, Harvard Oriental Series, U.S.A.

(ఘ) రామానందతీర్థకృత, మణిప్రభాసహితమ్, చౌఖాంబా ప్రెస్, బెనారస్ 1930.

(9) Faddegon కృత, The Vaisesika System. Amsterdam, 1919.

10. న్యాయసూత్రమ్.
ఫణిభూషణతర్క వాగీశకృత వంగానువాద టిప్పణీసహితమ్, సభాష్యమ్, వంగీయ సాహిత్య పరిషత్, కలకత్తా.

11. బ్రహ్మసూత్ర భాష్యమ్.
భామతీ, కల్పతరు, పరిమళ సహితమ్, నిర్ణయసాగర ప్రెస్, బొంబాయి.

12. భగవద్గీతా
శాంకరభాష్య సహితా, వావిళ్లా ప్రెస్, మద్రాసు.

13. గౌడపాద కారికా.
శాంకరభాష్య సహితా.

14. ముండకాద్యుపనిషత్తులు.

15. మహాభారతము. శాంతిపర్వము.

16. రాధాకృష్ణ మహాశయకృత Indian Philosophy Vols. I & II, Allen & Unwin, London.

17. Hasting సంపాదిత Encyclopedia of Religion and Ethics.

18. Masson-Oursel కృత Esquisse d'une Historic deal Philosophic Indienne, Paris, 1923.

# తప్పొప్పుల పట్టిక

## ముఖబంధము

| పుట | వంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 4 | 11 | గుణచులు | గుణతత్త్వము |
| 5 | 3 | యిణీ | యణీ |
| 6 | 19 | మహాభూతాది | మహదాది |
| 8 | 17 | షాణుల | షాణాదుల |

## ఆంధ్రీకృత సాంఖ్యతత్త్వ కౌముది

| పుట | వంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 2 | బణ్వోః | బహ్వోః |
| ,, | 5 | నయె | నయే |
| ,, | 6 | రయె | రయే |
| ,, | ,, | భాసు | చాసు |
| ,, | ,, | నయె | నయే |
| ,, | 9 | ట్టియు | ట్టి |
| 2 | 12 | ఘాత | ఘాతకే |
| 3 | 18 | కాది | కాధి |
| ,, | 20 | ఆది | ఆధి |
| ,, | ,, | కములు | కము |
| 6 | 14 | అను | అను |
| 8 | 6 | చచ్చు | వచ్చు |
| 10 | 6 | జ్షా | జ్ష |
| ,, | 12 | త్పని | త్పత్తిని |
| 11 | 2 | సామా | పామ్యా |
| 20 | 5 | వజ్య | వద్య |
| 21 | 3 | తము | తరము |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 34 | 7 | భహి | బహి |
| 35 | 2 | తి క్త | తిరి క్త |
| 36 | 13 | హ త్త్వ | హ త్తత్త్వ |
| ,, | 17 | శశి | శశ |
| 45 | 4 | భేధ | బేద |
| 53 | 9 | దహా | దాహా |
| 64 | 20 | వ్యాధు | వ్యాదు |
| 66 | 10 | వస్త | వస్థ |
| ,, | 22 | వ్య త్తిం | వ ర్తిం |
| 71 | 2 | ఐః | ఇః |
| 72 | 3 | శోడ | షోడ |
| ,, | 4 | శోడ | షోడ |
| ,, | ,, | శ్రమ | శ్రయ |
| 73 | 8 | పయు | పయసు |
| ,, | 14 | చుట్ట | చుక్క |
| 75 | 15 | రధ్య | దధ్య |
| ,, | 22 | తాదె | తాదే |
| 77 | 12 | నవి | నది |
| 83 | 15 | అతః | అంతః |
| ,, | 22 | పాణా | ప్రాణా |
| 85 | 4 | హ్నినిం | హ్ని ని |
| ,, | 11 | శేము | శేషము |
| 85 | 23 | వ్యాధు | వ్యాదు |
| 88 | 4 | నవి | నది |
| 94 | 5 | ర్భస్త | ర్భస్థ |
| 104 | 8 | ఆధ్యా | ఆధ్యా |
| ,, | 9 | ఆధ్య | ఆధ్య |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 106 | 14 | భావేనలింగ | లింగేనభావ |
| ,, | 16 | త్రల | త్రలయొక్క |
| 113 | 11 | దిరూప | దివిషయరూప |
| 118 | 19 | షుడు | షుడను |
| 122 | 15 | అక్లే | ఇక్లే |
| ,, | 23 | వృత్తా | వృత్తి |
| 124 | 2 | నాస | నాను |
| ,, | 12 | నితర | ఇతర |

## టిప్పణము

| | | | |
|---|---|---|---|
| 127 | 2 | మాధ | మాత |
| ,, | 14 | మాధ | మాత |
| 128 | 12 | మాధ | మాత |
| ,, | 22 | మాధ | మాత |
| 129 | 6 | మాధ | మాత |
| 133 | 16 | నుల | నుపల |
| 140 | 5 | కము | కమును |
| ,, | 12 | పాదవ | పాద |
| 144 | 5 | భాము | భావము |
| ,, | 10 | దశ్వ | దశ్వాక్వ |
| 146 | 6 | స్మాత్మ | స్వాత్మ |
| ,, | 22 | మమను | మము |
| 148 | 11 | గాఢ | గాఢ |
| 151 | 12 | డచే | డుచే |
| 155 | 13 | అవ | అవ్య |
| 157 | 14 | 140, 144 | 140-144 |
| 159 | 12 | పమే | పచైతన్యమే |
| 164 | 17 | మతు | మత్తు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 166 | 19 | నినే | నికే |
| 180 | 4 | కృతము | కృతికము |
| 183 | 20 | ఆభూ | ఆభూ |
| 184 | 15 | 39 | 38 |
| ,, | 17 | ధకు | ధముకు |
| ,, | 18 | వ్రత్య | ప్రత్య |
| 187 | 24 | బ్రాహ్మణు | బ్రాహ్మ |
| 191 | 15 | కుభో | కుపభో |
| 192 | 17 | ద్రష్ట | ధృష్ట |

## పరిశిష్టము

| | | | |
|---|---|---|---|
| 201 | 15 | త్స్వాల్ప | త్స్వాల్పః |
| 205 | 12 | కృతహిత | కృతహీన |